




tbz®

The original since 1864

TRIBHOVANDAS BHIMJI ZAVERI

SHRIKANT ZAVERI GROUP

HYDERABAD: 70 GREENSLAND ROAD, PUNJAGUTTA. PH.: 040 3043 5001, MOGUL'S COURT, BASHEERBAGH. PH.: 040 3024 5001/2.
VIJAYAWADA: M. G. ROAD, OPP GATEWAY HOTEL, LABBIPET, PH.: 0866 307 5001.

AHMEDABAD | AURANGABAD | BHAVNAGAR | DHANBAD | GANDHIDHAM | INDORE | JAMSHEDPUR | KOCHI | KOLKATA
MUMBAI | NAGPUR | PATNA | PUNE | RAIPUR | RAJKOT | RANCHI | SURAT | UDAIPUR | VADODARA | VAPI

tbztheoriginal.com 

TBZ-The Original's product range is also available online on





©

THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక

# స్వాతి

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM

ESTABLISHED 1984 | సంపుటి 34 | 30.3.2018 | సంచిక 39 | అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


సర్వులకు
శ్రీరామనవమి
శుభాకాంక్షలు



సీరియల్స్, కథలు, స్పెషల్ ఫీచర్స్ మరియు శీర్షికలు

ముఖచిత్రం రాశీఖన్నా


E-mail: advtswati@gmail.com swativja@eth.net

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



16.3.2018

'**మ**నసు మాట' ద్వారా మనస్సును నిగ్రహంతో ఉంచుకోగలిగితేనే, శక్తి యుక్తులు వాటంతట అవే బయటపడి ఉన్నతమైన స్థానానికి తీసుకెళ్తాయని ద్యోతకమైనది.

'అమ్మకచెల్ల' కథాకర్త అలపర్తి రామకృష్ణగారికి అభినందనలు.

సత్ప్రవర్తన ఎక్కడుంటే సత్యం, ధర్మం, న్యాయం అక్కడ ఉంటాయని 'సత్యాన్వేషణ' ఉద్బోధించింది.

'చివరిరోజుల్లో...' బిల్లీగ్రాహమ్ దైవాన్ని నమ్మినందువల్లనే వందేళ్ళ ఆయుష్షు పొందారనిపించింది.

ఎన్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

**సిం**హప్రసాద్ కథ చదివినతర్వాత పాఠకులచే 'ఏమి హాయిలే హలా' అనిపించింది.

చిలిపి సమాధానాలు రసరమ్యంగా ఉన్నాయి. శృంగారం పెంపొందాలంటే ఆహారపదార్థాలను గురించి విలువైన విషయాలు చెప్పారు.

వృద్ధాప్యాన్ని గురించి 'ఒక చిన్న మాట'లో భాగ్యలక్ష్మిగారు గుర్తుచు కోదగ్గ విషయాలు చెప్పారు.పురాణస్త్రీల మనోభావాలను చక్కగా తెలిపారు.

డాక్టర్ శివభూషణం కర్నూలు

'**చం**దమామ రావే' శీర్షికలోని కథలు వారం వారం చాలా ఆసక్తిని రేపుతున్నాయి.

'షర్U' శీర్షికలోని చిట్కాలు ఆరోగ్యానికి ఎంతగానో ఉపయోగపడే విధంగా ఉంటున్నాయి.

'మనిషిలో మనిషి' సీరియల్ చాలా ఇంట్రెస్టింగ్‌గా ఉంటోంది.

చిన్నా ఖమ్మం

**యో**గా,ధ్యానం మనస్సు ప్రశాంతతకు చాలా అవసరం అని 'మనసు మాట'లో చెప్పినవి అక్షరసత్యాలు.

'శృంగారం ఆహారం' శీర్షికలో శృంగార సామర్థ్యానికి తీసుకోవలసిన ఆహారం గురించి చక్కగా తెలియజేశారు.ప్రతిఒక్కరికి ఆచరణీయం.

లక్ష్మీగిరిజకుమార్ రాజమహేంద్రవరం

**రెం**డు వేల ఐదు వందల సంవత్సరాలుగా తమ ఆచార్య పరంపరతో సనాతనధర్మం పరిరక్షించే కృషిచేసిన కంచికామకోటిపీఠాధిపతి శ్రీ జయేంద్ర సరస్వతి స్వామివారి గురించి ఎన్నో మంచి విషయాలు చెప్పారు.

పిల్లలు పరీక్షలను ఎదుర్కోవడానికి ప్రిపరేషన్ ఎలా అనేది చాలా చక్కగా వివరించారు. ఉపయుక్త సూచనలు ఇచ్చారు. ధన్యవాదాలు.

'మనిషిలో మనిషి' 'హృదయం ఎక్కడున్నదీ...', 'జై భారత్' 'సామ్రాట్ సముద్రగుప్త' సీరియల్స్ ఆసక్తిగా సాగుతున్నాయి.

'భయం', 'అమ్మక చెల్ల' 'ఏమి హాయిలే హలా' కథలు బాగున్నాయి. శీర్షికలు, ఫీచర్స్ అన్నీ బాగున్నాయి.

పి.ఎస్.లక్ష్మి బృందావనం

## వచ్చేవారం స్పెషల్

### మెంటల్ ఎనర్జీ

# ఇది మంచి సమయం

**22.3.2018 నుండి 28.3.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, ఉత్తరాయణం, వసంతఋతువు, చైత్రమాసం, శుక్లపక్షం.**



**22.3.2018 గురువారం**
తిథి: పంచమి మ.1.52 వరకు
నక్షత్రం: కృత్తిక సా.6.05 వరకు
వర్జ్యం: ఉ. 6.32-8.04 వరకు
దుర్ముహూర్తం : ప. 10.18-11.05 వరకు. మ. 3.00-3.47 వరకు
రాహుకాలం: మ.1.43-3.11 వరకు
మంచి సమయం : సా. 6.10 నుండి 7.40 వరకు
సూర్యోదయం: 6.07కి
సూర్యాస్తమయం: 6.12కి

**23.3.2018 శుక్రవారం**
తిథి: షష్ఠి మ.12.03 వరకు
నక్షత్రం: రోహిణి సా.4.57 వరకు
వర్జ్యం: ప. 9.19 నుండి 10.51 వరకు రా.10.16 నుండి 11.47 వరకు
దుర్ముహూర్తం: ప.8.43 నుండి 9.30 వరకు. మ. 12.38-1.25 వరకు
రాహుకాలం:ప.10.47-12.15 వరకు
మంచి సమయం: ఉ. 7.30 నుండి 8.15 వరకు. తె. 5.00-5.40 వరకు
సూర్యోదయం: 6.06కి
సూర్యాస్తమయం: 6.12కి

**24.3.2018 శనివారం**
తిథి: సప్తమి ప.10.06 వరకు
నక్షత్రం: మృగశిర మ.3.42 వరకు
వర్జ్యం: రా. 11.38-1.08 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.21-7.55 వరకు
రాహుకాలం: ప. 9.19-10.47 వరకు
మంచి సమయం: సా. 5.30-7.30 వరకు తె. 5.00-5.30 వరకు
సూర్యోదయం: 6.06కి
సూర్యాస్తమయం: 6.13కి

**25.3.2018 ఆదివారం**
తిథి: అష్టమి ప. 8.03 వరకు
నవమి తె. 5.54 వరకు
నక్షత్రం: ఆర్ద్ర మ.2.20 వరకు
వర్జ్యం: రా.1.37-3.07 వరకు
దుర్ముహూర్తం: సా.4.34-5.21 వరకు
రాహుకాలం: సా.4.39-6.08 వరకు
మంచి సమయం: సా. 5.31 నుండి 7.30 వరకు
సూర్యోదయం: 6.05కి
సూర్యాస్తమయం: 6.13కి
శ్రీరామనవమి

**26.3.2018 సోమవారం**
తిథి: దశమి రా.3.43 వరకు
నక్షత్రం:పునర్వసు మ.12.55 వరకు
వర్జ్యం: రా.8.26-9.56 వరకు
దుర్ముహూర్తం : మ. 12.38 నుండి 1.25 వరకు.మ. 3.00-3.47 వరకు
రాహుకాలం: ఉ. 7.50-9.18 వరకు
మంచి సమయం: ఉ. 7.10 నుండి 8.50 వరకు
సూర్యోదయం: 6.05కి
సూర్యాస్తమయం: 6.14కి

**27.3.2018 మంగళవారం**
తిథి: ఏకాదశి రా.1.32 వరకు
నక్షత్రం: పుష్యమి ప.11.28 వరకు
వర్జ్యం : రా. 11.30-1.00 వరకు
దుర్ముహూర్తం: ప. 8.41 నుండి 9.28 వరకు రా.11.01-11.48 వరకు
రాహుకాలం: మ. 3.11-4.39 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.04కి
సూర్యాస్తమయం: 6.14కి

**28.3.2018 బుధవారం**
తిథి : ద్వాదశి రా.11.24 వరకు
నక్షత్రం: ఆశ్లేష ప.10.01 వరకు
వర్జ్యం: రా.9.20-10.50 వరకు
దుర్ముహూర్తం : ప. 11.50 నుండి 12.37 వరకు
రాహుకాలం: మ.12.14-1.42 వరకు
మంచి సమయం : సా.5.20-7.15 వరకు
సూర్యోదయం: 6.03కి
సూర్యాస్తమయం: 6.14కి





# శ్రీరామనవమి

ఏ క్షణంలో ఎలా నడవాలో, ఏ కష్టంవస్తే ఏ తీరు నిర్ణయాన్ని చేయాలో... అలా మనని నడిపించే వారిని మార్గదర్శకులు అంటాం.

అయితే జీవితంలో అందరికీ అన్నివేళలా మార్గ దర్శకులుండడమనేది అసాధ్యం కదా! ఈ లోటుని గమనించిన ప్రాచీన ఋషులు లోకంలోని ప్రతి వ్యక్తికీ మార్గదర్శకంగా ఉండేందుకుగా శ్రీమద్రామా యణ, భారత, భాగవతాలనే ఇతిహాసాలనీ, పురాణా లనీ మనకి అందించారు.

వాటిలో శ్రీమద్రామాయణం మనకి ఎలా నిత్య జీవితంలో ప్రతిక్షణమూ మార్గదర్శకంగా నిలు స్తుందో ఆ విషయాన్ని తెలుసుకుందాం!

## పురుష స్వభావం

దశరథుడు, కౌసల్య, సుమిత్రలనే ఇద్దర్ని అప్ప టికే భార్యలుగా స్వీకరించాడు.

సంతానం కలగలేదు. దాంతో ఆయనలో ఒక తీరు ఆందోళన ప్రారంభమయింది. ఎక్కడ దశరథు డనే వానితో ఇక్ష్వాకుకులం కాస్తా సంతానం లేనిదై పోయి, ఇక్ష్వాకు కులంనుండి రాజరికం జారిపోయిం దనే నిందకాస్తా తనమీదపడి ఆ అపకీర్తికి తాను కేంద్రబిందువుగా అయిపోతానో! అని.

సహజంగా తప్పులనేవి ఆందోళన దశలోనే తెలియకుండా జరిగిపోతుంటాయి. దాంతో కేకయ మహారాజుని యాచించాడు.

'తన కూతురికీ, దశరథునికీ కలిగే సంతానానికే రాజరికమిస్తావా?' అనే నియమాన్ని పెడితే, దానికంగీ కరించి కైకమ్మని చేసుకున్నాడు.

పురుషుల స్వభావం ఇదే. ముఖ్యంగా పెళ్ళి విష యంలో. ఈ రోజు కూడా కొద్ది వయసు వచ్చిన పెళ్ళికొడుకులు ఇలానే 'ఎలాగో ఒకలాటి పెళ్ళిళ్ళని' చేసుకుంటున్నారేమో గమనించుకోవాలంటుంది శ్రీమద్రామాయణం. పెళ్ళి కావడం గొప్ప కాదు. ఆ మీదట దశరథుని ఇబ్బందిలాంటి మరో తీరు ఇబ్బం దికి గురవుతారని హెచ్చరిస్తోంది ఇతిహాసం!

ఇదే తీరుగా రావణుడు కూడ మహాశివపూజా ధురంధరుడయ్యుండికూడ సీతా మోహం కారణంగా లంకా జనం మొత్తం 'వద్దువ'ద్దని ప్రార్థించినా సీత మ్మని తేనే తెచ్చాడు.

ఆ మీదట విభీషణాదులు హెచ్చరించినా, సూచిం చినా, ప్రార్థించినా చివరికి యుద్ధంలో రాక్షసజనం వధింపబడుతున్నా మనసు మార్చుకోలేదు.

**శ్రీరామనవమి : 25.3.2018**

స్త్రీని వివాహం చేసుకోవడం లేదా ఆ మోహానికి గురికావడమనే రెంటిద్వారా పురుషుడు తీవ్ర దుఃఖా నికి లోనవుతాడని చెప్తోంది ఇతిహాసం.అదే ఇతిహాసం శూర్పణఖ మోహానికి రాముడు గురికాకపోవడాన్ని కూడ చెప్తూ మార్గదర్శకంగా నిలుస్తోంది!

## స్త్రీ స్వభావం

దశరథుడు యుద్ధాలకి వెళ్ళిన సందర్భంలో కూడ ఆ యా దేశాల్లో ప్రసిద్ధి చెందిన పట్టు వస్త్రాలనీ, ఆభరణాలనీ తెచ్చి కైకకే ఇస్తూ మిగిలిన ఇద్దరు భార్యలకంటె గొప్పగా చూస్తూండేవాడు. ఎక్కువగా ఆమెవద్దే గడుపుతూండేవాడు. ఇలా గడిచినంత కాలమూ ఈమెకి ఏ దుఃఖమూ కలగలేదు.

ఎప్పుడైతే రామునికి రాజరికం అనే విషయం వచ్చిందో అప్పుడు కూడ ఆమెకేమాత్రపు దుఃఖమూ రాలేదు సరికదా 'రామునికే రాజ్యం ఇయ్యా' (ధర్మజ్ఞో గురుఖర్దాంతః...)లంటూ తీర్మానించింది కూడ.

స్త్రీకి దుఃఖం పొంగిపొర్లాలంటే సంతానాన్ని గురిం చిన భయాన్ని, ఆందోళననీ కల్గించాలనే రహస్యం తెలిసిన మంథర (మంథరా పాపదర్శినీ- పాపపు బుద్ధికలదీ, ఆ తీరుదృష్టితోనే చూసేదీ, చూపించేదీ కూడ) ఎప్పుడైతే రామునికి రాజరికం వెళ్తే ఇక



ఆ రాజరికం రామునికీ, ఆయన పెద్దకొడుకుకీ, ఆ పెద్దకొడుకుకీ... అలాగే వెళ్ళిపోతుందని చెప్పగానే కైకమ్మకి బాధ ప్రారంభమయింది.

భరతునికి రాజ్యం వచ్చే వీలు 'పెళ్ళికి ముందే ఉంది' కాబట్టి రాజు తానిచ్చిన మాటని తప్పుతున్నాడనీ, అంతేకాక రాముడే గనుక రాజైతే ముందు భరతునిమీదే ప్రతీకారబుద్ధి రామునికుంటుందనీ... ఇలా నూరిపోసింది మంథర.

స్త్రీ ఎప్పుడూ సంతానపు తక్కువదనాన్ని తట్టుకోలేదు. ఆ సమయంలో ధర్మాధర్మాలూ, న్యాయాన్యాయాలూ, సుఖదుఃఖాలూ, ప్రతిష్ఠా అప్రతిష్ఠలూ ఏమాత్రమూ తనకి గుర్తుకే రావు.

మరోమాట- మంథర అనేది కైకమ్మకి పెళ్ళితో వచ్చిన సారెలో ఒకరు. దానికి అంతటి స్థానాన్నియ్యడమే కైకమ్మ చేసిన తప్పు. లోకంలో చాలామంది స్త్రీలు తమ తమ భర్తలమీది నేరాలని పనిమనిషిగా పనిచేస్తూండే స్త్రీలకి చెప్పుకుంటూ ఉంటారు. అది సరికాదనడానికి మంథరా వృత్తాంతం మనకి ఉదాహరణగా కన్పిస్తుంది.

రాముని రాజరికం చెడిపోయేందుకూ, భరతునికి రాజ్యం వచ్చేందుకూ కూడ దశరథుడిచ్చిన 2 వరాలనీ ఆయుధాలుగా ప్రయోగించవలసిందని మంథర ఎలా చెప్పగలిగింది?

కైకమ్మ చెప్పిఉంది కాబట్టే కదా! భార్యాభర్తల మధ్య గుట్టు మూడవవారికి ముఖ్యంగా పనిమనుషులకి తెలిస్తే అది ఎంత ఉపద్రవాన్ని తెచ్చిపెడుతుందో మనకి తెలియజేస్తుంది ఇతిహాసం.

## దాస స్వభావం

నెలసరి జీతాన్ని తీసుకుని సేవచేసేవాణ్ణి 'భృత్యుడు' (భృతిని తీసుకుని...) అంటారు. నిస్వార్థంగా సేవచేసేవాణ్ణి 'దాసుడు' అంటారు. ఇతరులకి సహాయపడడమే తన స్వభావం.

14 సంవత్సరాలపాటూ తన శృంగిబేరపురంలోనే ఉండవలసిందని ప్రార్థించిన గుహుడు మొదటి దాసుడు. అరణ్యాల్లోనే తమతో ఉండిపోవలసిందని ప్రార్థించిన మహర్షులు రెండవ దాసులు.

తనకై తాను సహాయపడడానికే వస్తున్నానంటూ పలికిన జటాయువు (**సీతాం చ తాత రక్షిష్యే...**) మూడవ దాసుడు. నిజమైన రాజుగా రాముని గుర్తించి అతని విధానాన్ని సంపూర్ణంగా గమనించి తన జీవితం మొత్తాన్ని ఆయనకే అంకితంచేసిన పరమదాసుడు ఆంజనేయస్వామి.

రావణ పుత్రుడైన ఇంద్రజిత్తు దగ్గరున్న బ్రహ్మాస్త్రాన్ని, ఎక్కడ ఆ రాక్షసుడు రామునిమీద విడుస్తాడోననే భయంతో- తన ప్రాణాలని ఆ అస్త్రానికి గురిచేస్తూ- రామునికి పరోక్ష ప్రాణదాతగా అయిన హనుమ దాస్యంగురించి ఎంత చెప్పినా తక్కువే.

శత్రువైన రావణుని దగ్గరనుండి హనుమ రాగానే- రావణుడు రాముణ్ణి నిందించిన వాక్యాలనీ, ఇతరాలనీ చెప్పకుండా... ఎంత చెప్పాలో అంతమాత్రమే చెప్పవలసింది సుమా! అని సూచించిన జాంబవంతుడు మరింత గొప్ప దాసుడు.

రావణుడంతటివాణ్ణి సంహరించడంకోసం తానై తపస్సునిచేసి దాన్ని రామునికి సమర్పించదలిస్తే- ఆయన స్వీకరిస్తాడా?- అనే లో అనుమానంతో,సంశయంతో ఉండి రాముణ్ణే తన వద్దకి మనోధైర్యంతో తాపసశక్తితో రప్పించుకుని తన తపఃఫలాన్ని రామునికి అందించిన శబరి మరో గొప్ప దాసి.

అందరికంటే ముందుగా తన తపస్సుని ఫలరూపంగా చేసి సమర్పించుకుని తన జన్మ ధన్యమనుకున్న ఇల్లాలు అహల్య.

అందుకే రాముడు లక్ష్మణ సమేతుడై ఆమెకి పాదాభివందనం చేశాడు. నిజానికి ఆమె రామునికి తపోవృత్తి నెపంతో దాస్యం చేయాలని భావించిన ఉత్తమురాలూ- కృతకృత్యురాలూను.

మనంగనుక ధర్మమార్గంలో సత్యవాక్కుతోజీవిస్తూ ఉన్నపక్షంలో ఆ భగవంతుడే ఇందరినీ మనకి సహాయకులుగా చేసి మన కార్యాన్ని సఫలం చేస్తూ, ఆయనే మార్గదర్శకునిగా వ్యవహరిస్తాడని ఉదాహరణలతో చెప్పే ఇతిహాసం శ్రీమద్రామాయణం.



## మార్గదర్శక సూత్రాలు

తన తండ్రి, తన తల్లి మాటకి చిక్కుకుని తనకి రాజరికాన్ని ఈయ(లే)కపోయినా, తండ్రి ప్రతిజ్ఞని (భరతునికి రాజ్యం ఇయ్యడం) నెగ్గించిన రాముడు- ప్రతి పుత్రుణ్ణీ, తండ్రి పరిస్థితిని గమనించి ప్రవర్తించాలని చెప్తున్నాడు.

అరణ్యాలకి వెళ్ళబోతూ సీతమ్మని రాముడు తీసుకువెళ్ళనన్నప్పుడు ఆమె అంది గదా!-

భర్త కష్టాల్లోఉన్నప్పుడు తాను సుఖిస్తూ మరెక్కడో ఉంటే అది భార్యా లక్షణం కాదు. అరణ్యాల్లో భర్త ఉంటే ఆమెకూడ అక్కడే ఉండాలి.

సింహాసనంలో భర్త ఉంటే ఆమె అర్ధసింహాసనంలో కూర్చోవాలిగాని,కష్టాలన్నీ తీరాక నేను నీతో సుఖంగా ఉంటాననేది భార్య ధర్మం కాదు-అని.

ఉద్యోగరీత్యా జీవనం కష్టంగా ఉండే ప్రదేశాలకి బదిలీ అయినప్పుడు సుఖంగా పుట్టింట్లో ఉండవలసిందని చెప్పే తల్లిదండ్రులకీ, సుఖంగా పుట్టింట్లో ఉంటూండే భార్యలకీ దివ్యౌషధ సూత్రం ఈ ఇతిహాసం.

ఏ బాంధవ్యమూ, మైత్రి కనీసం ఎరుగున్నతనమూ కూడ లేకపోయినా, తాను రాక్షసజాతివాడే అయినా, రావణునికి సోదరుని వరుసే అయినా,

మంత్రిగా ఉన్నాకూడ, ఓ స్త్రీ తన లంకలో పడుతున్న మనోవేదన (భర్తకి దూరంగా ఉన్నాను)ని తొలగించదలచి తానూ, తన భార్య సరమా, తన కూతురు నలా అనే ముగ్గురూ ఆమెకి అండగా నిలిచారంటే- కష్ట సమయంలో, నిస్సహాయ స్థితిలో భగవద్భక్తులైతే చాలు ఎవరో ఒకరు అండగా నిలిచి ప్రాణాల్ని నిలబెడతారనీ ఆత్మహత్య సరికాదనీ మార్గదర్శకంగా చెప్తుంది ఈ ఇతిహాసం.

ఇతిహాసం జీవిత యుద్ధంలో పరమాయుధం.
కష్ట సమయాల్లో దివ్యౌషధం.
తన్నో రామచంద్రః ప్రచోదయాత్.

డా॥ మైలవరపు శ్రీనివాసరావు

# ఒక చిన్న మాట

విగ్రహాలను ప్రేమించి ఆరాధించేవారున్నారు. పటాలను ప్రేమించి ఆరాధించేవారున్నారు. తమ కష్టసుఖాలను, ఇతరులతో పంచుకోలేని బాధలను, అశ్రువులు అవిరామంగా ప్రవహిస్తుంటే, ఎక్కిళ్ళ మధ్య మాట మాట చేర్చుకొంటూ విగ్రహాల ముందు, పటాలముందు వెల్లబోసుకొనే వారున్నారు.

రెండో కంటికి తెలియకుండా ఏకాంతంలో ఎవరెవరు ఎన్ని దుఃఖాలు భరిస్తారో, ఎన్ని ఆనందాలు పొందుతారో, ఎన్ని ఉద్రిక్తలకు లోనవుతారో ఎవరూ అంచనావేయలేరు.

విదేశీయులు కొందరు భారతదేశంలోని సినిమాలలో సంభాషణలు ఫోటోలతో విగ్రహాలతో ఎందుకు జరుగుతాయి అనికూడా ఆశ్చర్యపోతుంటారు. ఎవరి మనోభావాలు వారివి.ఎవరి అవగాహన వారిది. చాలామంది విగ్రహారాధనను వ్యతిరేకిస్తారు.అది అర్థంలేనిదని, మూఢాచారమని అంటారు.

నిరాకారునికి ఆకారం ఆపాదించడమేమిటని ప్రశ్నిస్తారు. మనుషులు చేసిన బొమ్మలు దేవుళ్ళెలా అవుతారు అని అడుగుతారు.

ఎంతమంది ఉంటే అన్ని అభిప్రాయాలుంటాయి. అన్ని నమ్మకాలూ ఉంటాయి. నమ్మకాలు మాత్రం ఎలా ఏర్పడుతాయి. పుట్టుకతోనే రావు కదా!

పుట్టి పెరుగుతున్న వాతావరణాన్ని బట్టి, చుట్టూ ఉన్న ప్రపంచాన్నిబట్టి, విని, చదివి, అవగాహన చేసుకోవటం, దానిని ప్రశ్నించటం,అంతర్మథనంతో దొరికిన సమాధానం ఒక నమ్మకాన్ని ఏర్పరుస్తాయి.

చెట్టును పూజించినా, పుట్టను పూజించినా, రాతిని పూజించినా, సూర్యుణ్ణి ఆరాధించినా, చంద్రుడికి నమస్కారం పెట్టినా, అగ్నికి ప్రదక్షిణం చేసినా, భూమికి సాగిలపడినా ఈ చర్యల వెనకనున్న పవిత్ర భావమే ముఖ్యమైనది.

నిజానికి అక్కడున్నది చెట్టు,పుట్ట లేకఇతర పదార్థమే. వాటిని బాహ్యేంద్రియాలు కాదనలేవు.

నమ్మకం కోసం ఒక వ్యక్తి మరణించగలడని, సిద్ధాంతంకోసం ఒక వ్యక్తి వధించగలడని టోనీబెన్ రాస్తారు. పక్షులు ఎగరగలవు. మనం ఎగరలేము.

పక్షులకు దేవుడిమీద సంపూర్ణమైన విశ్వాసం ఉంది. విశ్వాసం ఉంటే రెక్కలు ఉన్నట్టే అని రచయిత జె.ఎమ్.బారియర్ అంటారు.

విశ్వాసం అన్నివైపులా దీపాలు వెలిగిస్తే నిజం ఆర్భాటంగా వచ్చి దీపాలు ఆర్పివేస్తుందని అంటారు.

మనకు తెలిసిన ప్రపంచానికి, తెలియని ప్రపంచానికి మధ్య విశ్వాసం, నమ్మకం ఉంటాయి.

అమర ప్రేమ, భగవంతుని బిడ్డ
నీ ముఖమైనా చూడని మేము
నమ్మకంతో, కేవలం నమ్మకంతో ఋజువు
చేయలేనప్పుడు నమ్మకమే చాలని
నిన్ను మనసారా కౌగలించుకొంటాం

అని ప్రఖ్యాత కవి టెన్నిసన్ రాస్తారు.

నమ్మకం కొండలను కూడా కదిలిస్తుందనే మాట వాడుకలో ఉంది. ఆ మధ్య ట్యూబ్‌లైట్ అనే సినిమా వచ్చింది. మందబుద్ధి కాని మంచిమనసున్న హీరో ఎవరో చెప్పినమాట నమ్మి యుద్ధం ఆపటానికి కొండను కంపించమని ప్రార్థిస్తాడు.

సంపూర్ణ విశ్వాసం అచంచలం. అక్కడ పర్వతమూ అచంచలమే. నిరాశతో వెనుతిరగగానే భూమి కంపిస్తుంది. కొండ కంపిస్తుంది. శత్రుసైన్యం ఆగిపోతుంది. ఇది ఒక విదేశీ సినిమాను ఆధారంగా తీసుకుని నిర్మించింది. ఆ సినిమాలో ఒక చిన్న కుర్రాడు కొండను కదలమని ప్రార్థిస్తాడు.

మేధావి బెర్నార్డ్ షా కూడా జోన్ ఆఫ్ ఆర్క్ గురించి నాటకంలో ఈవిధంగా చెపుతారు."మిత్రమా, అద్భుతమైన సంఘటన అంటే విశ్వాసాన్ని పుట్టించేది. అద్భుతాల ప్రకృతి, ఉద్దేశము అదే"

బొమ్మల్లో దేవుడుండమేమిటి, బొమ్మల్ని అవమానిస్తే బాధెందుకు అని చాలామంది అడగవచ్చు. ఇటువంటి ప్రశ్నే ఒకసారి స్వామి వివేకానంద ఎదురుకోవలసి వచ్చింది. ఆ ప్రశ్న అడుగుతున్న వ్యక్తి ఒక రాజు.

వివేకానందుడు రాజుగారి సేవకుని పిలిచి ఎదురుగానున్న రాజాపటంమీద ఉమ్మమని చెపుతాడు. సేవకుడు వణికిపోతాడు.

"భయమెందుకు? మీ రాజుగారు ఇక్కడ క్షేమంగా ఉన్నారు. బొమ్మమీద ఉమ్మటానికి సంకోచమెందుకు?"అని వివేకానందుడు అడుగుతాడు. అప్పుడు బొమ్మలేమిటో, విగ్రహాలేమిటో, ప్రతీకాత్మకమేమిటో-

విశ్వాసమేమిటో, గౌరవమేమిటో, భక్తిశ్రద్ధలేమిటో రాజుకు తెలిసివస్తుంది. విగ్రహభంజకులకు ఈ విషయాలన్నీ తెలిసినట్లేనిపిస్తుంది.

అందుకు ప్రతీకారం తీర్చుకోటానికి, తమ ఆధిక్యత చాటుకోటానికి, అవతలివారిని బాధించటానికి, ప్రతీకాత్మకంగా విగ్రహంలోనున్న వ్యక్తిని అవమానించటానికి విగ్రహాలను విరగ్గొట్టి, తొక్కి, మాలిన్యాలు పూసి వికటాట్టహాసాలు చేస్తుంటారు.



ఇది ఈనాటిది కాదు. ఏ దేశచరిత్ర చేసినా ఇదే కథ. కాలాలు మారినా, మానవమేధస్సు వికసించినా, అత్యాధునిక, నాగరిక సమాజంవైపు అడుగువేస్తున్నా, మెరుగైన సమాజం కోసం పాటుపడుతున్నా, మానవతా దృక్పథంతో మెరుగైన మనుషులుగా మారాలని ప్రయత్నిస్తున్నా మనిషి మారలేదు, అతని తీరు మారలేదు.

దండయాత్రలు, యుద్ధాలు, జయాలు, విజయోత్సాహాలమధ్య విధ్వంసం, వినాశనం జరుగుతూనే వచ్చాయి. మనదేశంలో మందిరాల గురించి, విగ్రహాల గురించి ప్రముఖంగా మాట్లాడుతాము.

దేవాలయాలు ధనాగారాలుగా విలసిల్లుతున్నప్పుడు శత్రురాజులు కొల్లగొడతారు. విగ్రహారాధనను నమ్మనపుడు విరగ్గొడతారు. అవమానిస్తారు. చరిత్రను తిరగవేసి ఎవరిని నిందిస్తే ఏమి లాభం?

నాయకుల, ప్రముఖుల విగ్రహాలు ఈనాడూ వెలుస్తున్నాయి, విరుగుతున్నాయి, అవమానాల పాలవుతున్నాయి.

అప్రస్తుతమనుకొన్న విగ్రహాలను మ్యూజియంలకు తరలించవచ్చు.

లెనిన్ విగ్రహం లెనిన్‌గ్రాడ్‌లో కూలినా, త్రిపురలో కూలినా ఒకేవిధమైన వ్యధ చోటుచేసుకొంటుంది. ఒకనాటి నాయకుడు, ఆనాటి దేవుళ్ళు, ఒక క్షణంలో ప్రజాపకారులుగా, రాక్షసులుగా ఎలా మారుతారు? ఇరాక్‌లో సద్దాం హుసేన్ విగ్రహాన్ని ధ్వంసం చేసినా అదే ప్రశ్న.

లెనిన్ విగ్రహం తర్వాత వరుసగా పెరియార్, శ్యామాప్రసాద్ ముఖర్జీ, అంబేద్కర్ విగ్రహాలను ధ్వంసం చేయటం, అవమానించటం ఏ నైతికశాస్త్రం సమర్థిస్తుంది? ఏ భావజాలం సరేనంటుంది.

ఏ విలువలు హర్షిస్తాయి?

విగ్రహాలకు భద్రత కలిపించుకొంటూ పోతే దానికి అంతముందా? సమస్యకు పరిష్కారమా? దేవుళ్ళకూ భద్రత అంటే కాస్త విరోధాభాసమనిపిస్తుంది.

అందుకే అంటారు రోగానికి మందు వేయాలికాని లక్షణానికి కాదు అని. ఆలోచించవలసిందే.

డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

# కథ కథ కథ కథల పోటీ

Courtesy : VANITHA

## ఒక్కొక్క కథకు ₹ 9,999 ల బహుమతి

## సాధారణ ప్రచురణ కథకు ₹ 2,000

కథ అంటే కలలా కరిగిపోకూడదు. అది మనకు కనబడుతూవుండాలి. అందులో మనమూ వుండాలి. మన చుట్టుపక్కలవారూ, మనవాళ్ళూ వుండాలి. చాలాకాలం గుర్తుకొస్తూవుండాలి. అందరికీ చెప్పేలా వుండాలి.

మన సమస్యలకు సమాధానాలు ఆ కథలో దొరికితే అది మరీ ఉత్తమమైన కథ. అటువంటి కథలను ఈ 'కథ కథ కథ కథల పోటీ'కి రాయండి.

ఈ దిగువ ఇస్తున్న సబ్జెక్టులను ఇతివృత్తాలుగా చేసుకుని రచయిత(త్రు)లను కథలు రాయవలసిందిగా కోరుతున్నాం.

ఒక్కరు ఒక్క సబ్జెక్టుపైనే రాయాలన్న నియమం లేదు. ఒకటికి మించి రాయొచ్చు. రాయగలిగితే అన్ని సబ్జెక్టులపైనా రాయొచ్చు. అది మీ ఇష్టం. పాఠకదేవుళ్ళకు అక్షరనైవేద్యంగా మీ కథలను అందించండి.

రచయిత(త్రు)లు కథలుగా మలచవలసిన సబ్జెక్టులు ఇవే:

1. ఉద్యోగి
2. వ్యాపారి
3. డాక్టర్
4. ఇంజనీర్
5. ఆర్కిటెక్ట్
6. రైటర్
7. ఎన్ఆర్ఐ
8. ఇండియన్

9.పై 8 గాక మీకు ఇష్టమైన సబ్జెక్ట్ ఏదైనా సరే 9వ కథ అవుతుంది

ఇవీ సబ్జెక్టులు. రాయండి, రాసి విజేతలుకండి.

9 కథలకు 9 బహుమతులు. ప్రతి కథకు ₹ 9,999లను బహుమతిగా అందజేస్తాం.

ఈ పోటీలో పాల్గొనే రచయిత(త్రు)లు ఈ క్రింది విషయాలను గమనించవలసిందిగా మనవి.

: నిబంధనలు :

1. అనువాదాలు, అనుకరణలు, ఇతర పత్రికలకి పంపబడి పరిశీలనలో ఉన్న రచనలు పంపవద్దు.
2. కథల ఎంపికలో స్వాతిసంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు. ఈ కథల పోటీ గడువు తేదీని పొడిగించేందుకుగానీ,పోటీనిరద్దు చేసేందుకుగానీ స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులున్నాయి.
3. కథ తమ స్వీయరచన అని,అముద్రితమని, తమ స్వదస్తూరితో రాసిన హామీపత్రాన్నివిధిగా జతపరచాలి.
4. మీరు రాసే కథపైన తప్పనిసరిగా తీసుకున్న సబ్జెక్టు రాయండి. కథ ప్రింటింగ్‌లో 3 పేజీలకు మించరాదు. కథలను త్రిప్పిపంపగోరువారు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జతపరచాలి. కవరుమీద 'కథ కథ కథ కథల పోటీకి' అని రాయాలి.

కథలను పంపవలసిన చిరునామా : ఎడిటర్ స్వాతి సపరివార పత్రిక అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002

**రచనలు మాకు చేరవలసిన ఆఖరు తేది : 20.4.2018**

# వేడెక్కిన ఆంధ్ర రాజకీయం

**ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు అక్కడి వేసవి ఉష్ణోగ్రతల్లాగానే ఒక్కసారిగా వేడెక్కాయి. అసాధారణ ఉష్ణోగ్రతల్లాగా, సాధారణ వేడికన్నా అధికంగా, అతి వేగంగా మారిపోతున్న ఆ రాజకీయ వడగాల్పుల దెబ్బకు అన్ని పార్టీలు విలవిలలాడక తప్పటంలేదు.**

అన్ని రాజకీయ పార్టీలు ప్రస్తుతం ఎదురవుతున్న విపత్కర పరిస్థితులను తట్టుకుని 2019లో విజయం సాధించాలన్న లక్ష్యంతో తగిన ఎత్తుగడలు వేస్తున్నాయి.

తాడిని తన్నేవాడు ఒకడైతే వాడి తల తన్నేవాడు మరొకడు అన్నట్టుగా ఆ ఎత్తుగడలలో ఎప్పుడు ఏ పార్టీమీద లేదా ఏ నేతమీద ఎటువంటి అస్త్రం ఏ మూలనుండి వస్తుందో తెలియని పరిస్థితి.

రాజకీయ యుద్ధం మొదలైనతర్వాత అది ఊహించిన రీతిలోనే ముందుకు వెళ్ళదు. నిన్న మొన్నటి వరకు మిత్రపక్షాలుగా వ్యవహరించి అటు కేంద్రంలో ఇటు రాష్ట్రంలో అధికారం పంచుకున్న టి.డి.పి., బి.జె.పి.ల బంధం పుటుక్కున తెగిపోయింది.

ఒకరి లోతుపాతులు మరొకరికి ఈ నాలుగేళ్ళలో బాగా తెలిశాయికాబట్టి ఎటువంటి అస్త్రానికి ఎవరు లొంగుతారో అర్థంచేసుకుని మరీ విమర్శనాస్త్రాలు ప్రయోగించుకుంటున్నారు ఆ రెండు పార్టీల నేతలు. ఆంధ్రులకు అన్యాయం చేసింది ఎవరో పూర్తిగా బయటపెడతామంటూ వివరాలను అందిస్తున్నారు.

టి.డి.పి-బి.జె.పి. బంధం తెగిపోతే కొత్త బంధంలోకి తాము వెళ్ళాలన్న ఆశతో ఎదురుచూస్తున్నది ప్రధాన ప్రతిపక్షం వై.కా.పా. బి.జె.పి.ని సుతిమెత్తగా, టి.డి.పి.ని కటువుగా విమర్శిస్తూ-

తమది తొలినుంచే 'ప్రత్యేక హోదా' మార్గమేనని, అధికార పక్షమే 'హోదా' విషయంలో రాజీపడిందని ప్రజలను ఒప్పించే పనిలో పడింది.

రాష్ట్రంలో తృతీయ రాజకీయ శక్తిగా ఎదుగుతామంటూ రాజకీయరంగప్రవేశం చేసిన జనసేన పార్టీ స్వరం హఠాత్తుగా మారిపోయింది. సినీరంగం నుండి రాజకీయరంగంలోకి వచ్చిన పవన్‌కళ్యాణ్‌ని సీరియస్ పొలిటీషియన్‌గా ఎవరూ పరిగణించలేదు.

మతబోధకుడిలా చేతిలో ఒక పుస్తకంతో వచ్చి ఆవేశంగా ప్రసంగాలు చేసి వెళ్ళిపోయే ప్రచారకుడనుకున్నారు.

ఏదో ఒక పార్టీకి అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని మార్చగలిగిన వ్యక్తే కాని స్వయంగా ఒక రాజకీయ ఎజెండా ముందుకెళ్ళగలడని ఎవరూ అనుకోలేదు. అటువంటి పవన్‌కళ్యాణ్ ఇప్పుడు అమరావతిలో తన నివాసమంటూ భూమిపూజను సతీసమేతంగా చెయ్యటం, ఆ ప్రాంతంలోనే బహిరంగ సభ పెట్టి తొలిసారిగా నేరుగా తెలుగుదేశం అగ్రనేత కుటుంబ సభ్యులమీద అవినీతి ఆరోపణలు చేసి తనది స్వతంత్ర బాట అని స్పష్టంచేశాడు. దీనితో ఆంధ్రప్రదేశ్ రాజకీయ వేడి మరింత పుంజుకుంది.

ఇలా అన్ని పార్టీలు రాజకీయ వేడిని పెంచటానికి అవకాశం ఇచ్చిన పార్టీ బి.జె.పి. ఆంధ్రప్రదేశ్ విభజన చట్టంలో పేర్కొన్న అంశాలు అమలుచెయ్యటంలో బి.జె.పి. చేస్తున్న తాత్సారం, అందించాల్సిన సహాయం అందించాం, ఇక చెయ్యగలిగింది, చెయ్యాల్సింది ఏమీలేదని కేంద్ర ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ చేసిన ప్రకటన ఆంధ్రప్రదేశ్‌లోని రాజకీయ పార్టీలన్నింటిని ఏకంచేసింది. ఇప్పుడు బి.జె.పి. యేతర పక్షాలన్నింటి ఎజండా ఆంధ్రప్రదేశ్‌కి ప్రత్యేక హోదా సాధనే.

ఆంధ్రప్రదేశ్‌లో రాజకీయ వేడి పెరగటానికి మూలం కేంద్ర బడ్జెట్. 2018-19 కేంద్ర బడ్జెట్‌లో ఆంధ్రప్రదేశ్ ఆశించినవి ఏవీ జరగలేదు.

వచ్చే లోక్‌సభ ఎన్నికలకు ముందు సమర్పించిన పూర్తిస్థాయి బడ్జెట్ ఇది. నాలుగు బడ్జెట్‌లు గడిచినా, ఆంధ్రుల ఆశలమీద నీళ్ళు చల్లటంతో మిత్రపక్షం 'తెలుగుదేశం' ప్రభుత్వంలోనుండి తప్పుకుంది.

విభజన చట్టంలోని విశాఖ రైల్వే జోన్, కడప ఉక్కు ఫ్యాక్టరీ, దుగరాజపట్నం నౌకాశ్రయంవంటివేవీ కేంద్రానికి పట్టలేదు. రాష్ట్రానికి జరిగిన అన్యాయం వివరించి, చర్చలు జరిపి సప్లిమెంటరీలలో కొంతమేర లబ్ది పొందే యత్నం చంద్రబాబు చేసివుండేవాడేమో. కాని ఆ అవకాశం ఆయనకు ఇవ్వనీయనంత వేగంగా ప్రత్యేక హోదా అంశం బలంగా ప్రజలలో నాటుకుపోయింది.

**రాజ్యాంగాన్ని సవరించి 2024 తర్వాత కూడా అధికారంలో వుండాలని నాకు లేదు.**
**-పుతిన్, రష్యా అధ్యక్షుడు**



ఫలితంగా చంద్రబాబునాయుడు ఆ ప్రత్యేక పవనాలలో కలిసిపోక తప్పలేదు. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతిపక్షాలు ప్రత్యేక హోదా అంశంమీద చాలాకాలంగా ఆందోళన చేస్తున్నాయి. ప్రత్యేక హోదా అంశం విభజన చట్టంలో చేర్చటానికి ఇష్టపడని కాంగ్రెస్ పార్టీ కూడా ప్రత్యేక హోదా అంశాన్ని భుజాన వేసుకుని ప్రజలలోకి వెళ్ళే ప్రయత్నం చేస్తున్నాయి.

ఇతర రాజకీయ పార్టీలు ప్రజలలో బలంగా లేకపోయినా ప్రత్యేక హోదా అంశంమీద పలురకాల వేదికలను నిర్మించాయి. ప్రధాన ప్రతిపక్షమైన వైకాపా ప్రత్యేక హోదా అంశాన్ని ప్రతిష్టాత్మకంగా తీసుకుని, ఆ 'ప్రత్యేక హోదా' అస్త్రాన్ని అధికార టి.డి.పి.ని ఇబ్బందిపెట్టేందుకు ఉపయోగించుకుంటున్నది.

ఒకటి రెండు నెలలక్రితంవరకు ప్రజల మనసుల్లో లేని ప్రత్యేక హోదా అంశం హఠాత్తుగా ఇప్పుడు మొగ్గతొడగటమేకాక బలంగా ఎదిగింది కూడా.

కొత్తగా జనసేనను ప్రారంభించిన సినీనటుడు పవన్‌కళ్యాణ్ కూడా ప్రత్యేక హోదా అంశాన్నే ప్రజలలోకి తీసుకువెళ్ళాడు. అందుకోసం ప్రత్యేకంగా ఒక నిజనిర్ధారణ కమిటీని ఏర్పాటుచేశాడు.

మాజీ అధికారులు, రాజకీయనాయకులతో కూడిన ఆ నిజనిర్ధారణ కమిటీ ఆంధ్రకు అన్యాయం జరిగిందన్న మాట వాస్తవమేనని తేల్చింది. కేంద్రం నుండి ఆంధ్రప్రదేశ్‌కి గత నాలుగేళ్ళలో రావాల్సిన ఆర్థికసహాయం ఎంతో, అందులో రాకుండా ఆగిపోయింది ఎంతో వివరంగా ఆ కమిటీ తన నివేదికలో పేర్కొన్నది.

పవన్‌కళ్యాణ్ నియమించిన కమిటీలో సీనియర్ ఐ.ఎ.ఎస్. మాజీలు పనిచేయటం ఏమిటన్న ప్రశ్న, అసలు ఆ కమిటీకి ఉన్న సాధికారత ఏమిటన్న ప్రశ్న కొందరు వేసినా సామాన్య ప్రజలు ఆ కమిటీ నివేదికను విశ్వసించారు. దాని ఫలితమే ప్రజలలో హఠాత్తుగా పెరిగిన ప్రత్యేక హోదా డిమాండ్.

ప్రత్యేక హోదా రాకుంటే ఆంధ్ర రాష్ట్రంకి భవిష్యత్తు లేదన్నంతగా ప్రజల్లోకి సందేశం వెళ్ళింది. ఒక సామాజిక వర్గం నేతగా రంగంలోకి దిగిన పవన్‌కళ్యాణ్ ఇమేజ్ నిజనిర్ధారణ కమిటీతో ప్రజానాయకుడిగా మారింది.

అన్నివర్గాల ప్రజలను ఆకట్టుకోగలిగిన మనిషిగా పవన్‌కళ్యాణ్‌ని ఇతర రాజకీయ పార్టీలు అంగీకరించాయి. కమ్యూనిస్టు పార్టీలు పవన్‌కళ్యాణ్‌వెంట నడవటానికి సుముఖత వ్యక్తంచేశారు. మొత్తంమీద ప్రత్యేక హోదా నినాదం,

ఆంధ్రకు అన్యాయం అనే వాస్తవం కలిసి రాజకీయాలను మలుపుతిప్పాయి. ఆంధ్రప్రదేశ్‌లో అన్ని జిల్లాలలోకి ఆ సందేశం అతి వేగంగా వెళ్ళింది.

అటువంటి ప్రజా వాతావరణం వచ్చినతర్వాత ఆ అవకాశాన్ని ఏ రాజకీయ పార్టీ అయినా ఎందుకు వదులుకుంటుంది? అందునా చంద్రబాబునాయుడు వంటి రాజకీయ చతురత కల్గినవాడు ప్రజాగ్రహాన్ని ఎలా తనమీద పడకుండా తప్పించుకోకుండా ఉంటాడు. అందుకే చంద్రబాబు తగిన సమయంలో తప్పు తన భుజంమీదనుండి దించుకుని కేంద్ర ప్రభుత్వంమీద విసిరేశాడు.

ప్రత్యేక హోదా విషయంలో తాను గత నాల్గు సంవత్సరాలుగా ఎటువంటి ప్రకటనలు చేసింది మరచిపోయి ఇప్పుడు ప్రత్యేక హోదా నినాదపు శక్తులతో తెలివిగా చేరిపోయాడు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ఏకాకి అయింది బి.జె.పి.

ఆంధ్రప్రదేశ్ ప్రజల దృష్టిలో బి.జె.పి.నే పెద్ద విలన్. నిన్నమొన్నటివరకు బి.జె.పి.తో అంటకాగిన తెలుగుదేశం తప్పు నాదికాదు బి.జె.పి.దే అని ప్రజలను నమ్మించగలుగుతున్నది.

కాబట్టి మొత్తంమీద బిజెపి, కేంద్రప్రభుత్వం, ప్రధాని నరేంద్రమోడీలను దోషులుగా ఆంధ్రలో నిలపటంలో రాజకీయ పార్టీలు విజయం సాధించాయి. ఇప్పుడు ఆంధ్రులకు సమాధానం చెప్పుకోవాల్సిన పరిస్థితి బి.జె.పి.ది.

మిగిలిన రాజకీయ పార్టీలమీద ఎదురుదాడి చేయగలిగిన పరిస్థితి బి.జె.పి.కి లేదు. కాబట్టి దాని ఎదురుదాడి తమను ఈ పరిస్థితిలోకి నెట్టిన చంద్రబాబుమీదే చేస్తుంది.

ప్రత్యేక హోదా అంశంలో 2014 ఎన్నికలనాటికి ఆ తర్వాత 14వ ఆర్థికసంఘం నివేదికనాటికి వచ్చిన మార్పును బి.జె.పి-టి.డి.పి.లు అంగీకరించాయి.

ప్రత్యేక హోదా ఇవ్వటం సాధ్యంకాదని, అయినా దానికి సరిసమానమైన ఆర్థిక సహాయం ఇచ్చేప్యాకేజ్‌ని రూపొందిస్తామని కేంద్రమంత్రి అరుణ్‌జైట్లీ చేసిన సూచనను చంద్రబాబునాయుడు ప్రభుత్వం స్వాగతించింది. ఆ మేరకు ప్రధాని మోడీకి కృతజ్ఞతలు తెలియచెప్పే తీర్మానం కూడా చేసింది.

ప్రత్యేక హోదా సంజీవిని కాదని, ప్రత్యేక హోదా పొందిన రాష్ట్రాలు అభివృద్ధిచెందలేదని చంద్రబాబు స్వయంగా ప్రకటించాడు.

పైగా ప్రత్యేక హోదా డిమాండ్‌ని కొనసాగించే ప్రతిపక్షాలను వారి ఉద్యమ నేతలను జైలుకు పంపుతామని హెచ్చరించారు కూడా.

కేంద్రంనుండి మరే రాష్ట్రానికి స్వతంత్ర భారత చరిత్రలో అందనంత సహాయం ఆంధ్రప్రదేశ్‌కి అందిందని చంద్రబాబు అనగా, కేంద్రాన్ని అడిగేందుకు ఏమీలేవు, అన్నీ ఇచ్చేసింది అని నాటి కేంద్ర మంత్రి సుజనా చౌదరి అన్నారు.

అవన్నీ ఆంధ్ర ప్రజలకు నేడు గుర్తుచెయ్యటమే నేడు బి.జె.పి. చెయ్యగలిగింది. అయితే తెలుగుదేశం పార్టీకి ఆంధ్రప్రదేశ్‌లో అధికారం ముఖ్యం, బిజెపికి ఆంధ్రప్రదేశ్‌లో పొయ్యేదేమీ లేదు. కాబట్టి ప్రత్యేక హోదా రాజకీయం ఆ రెండు పార్టీలమధ్య మరింత తీవ్రమవుతుంది. తెగతెంపులతర్వాత చంద్రబాబు విమర్శల పదును పెంచటం ఖాయం.

మొన్నటి త్రిపుర రాష్ట్ర విజయంతర్వాత తెలుగుదేశం విమర్శల్లో వెనకడుగు వేస్తుందనుకున్న బిజెపి అంచనాకు ఉత్తరప్రదేశ్ ఓటర్లు ఉప ఎన్నికల షాక్ ఇచ్చారు. ఆ రాష్ట్రంలో ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రులుగా నియమితులైనవారు రాజీనామా చేసిన గోరఖ్‌పూర్,పూల్‌పూర్ సీట్లలో బిజెపి ఓడిపోయింది.

బి.ఎస్.పి., ఎస్.పి.లు చేతులు కలపటంద్వారా బిజెపిని ఓడించగలిగారు. చంద్రబాబునాయుడు తన విమర్శలకు, బి.జె.పి.పై దాడులకు ఏమాత్రం వెనకడుగు వెయ్యడు. ఆంధ్రప్రదేశ్‌కి సంబంధించినంతవరకు బి.జె.పి.కి గెలుపు, ఓటములు రెండూ ఒకలాంటివే. సొంతగా ఏమాత్రం బలం లేని పార్టీ.

> ➤ మరల రగిలిన ప్రత్యేక హోదా
> ➤ ఏకాకి అయిన బి.జె.పి.
> ➤ టి.డి.పి. తప్పించుకునే యత్నం
> ➤ పవన్‌కళ్యాణ్ ప్రవేశంతో సీన్ మారింది

నాలుగేళ్ళుగా కేంద్రంలో అధికారంలో ఉన్నప్పటికీ రాష్ట్రంలో పార్టీని విస్తరించుకునేందుకు ప్రయత్నము చెయ్యని పార్టీ. దేశంలో బి.జె.పి. అధ్యక్షుడి ఎన్నిక జరగని, రాష్ట్ర స్థాయి కమిటీలు ఏర్పాటు చేయనిది ఆంధ్రప్రదేశ్‌లోనే.

తెలుగుదేశం పార్టీకి తోక పార్టీగా మిగిలిపోయిన పార్టీ బి.జె.పి. ఇప్పుడు ఆ బంధం తెగిపోగా రాజకీయంగా ఏకాకి అయింది.

ప్రజలలో ఏర్పడిన వ్యతిరేకతవల్ల ఆ పార్టీ తరపున పోటీ చేసేందుకు అభ్యర్థులు వస్తారా! అన్నది ప్రశ్న. ఇటీవలి కాలంలో ఇతర పార్టీల నుండి బి.జె.పి.లో చేరిన నేతలు ఆ పార్టీలో కొనసాగే విషయంలో పునరాలోచన చేసే అవకాశముంది.

చివరికి తిరిగి అధికారం కోసం చంద్రబాబునాయుడు, వై.ఎస్.జగన్మోహన్‌రెడ్డి పోటీపడతారు.

నేటివరకు ప్రత్యేక హోదా వైకాపా ఎజండాగా ఉండగా ఆ ప్రత్యేక హోదాకోసమే నేను కేంద్రంతో తెగతెంపులు చేసుకున్నా అంటూ చంద్రబాబు ప్రచారం మొదలవుతుంది. ప్రత్యేక హోదా ఎవరు సాధించగలరు, ఎలా సాధించగలరు అనే విషయంలో చంద్రబాబు, జగన్‌లలో ఎవరిని నమ్ముతారన్నదాని మీద రాష్ట్ర ఎన్నికల ఫలితాలు ఆధారపడతాయి.

ఇద్దరి ఎజండాలు ఒకలాంటివే అయిపోయి, అధికార ప్రతిపక్ష పార్టీలిద్దరి పోరాటం కేంద్రానికి వ్యతిరేకమే అయినపుడు ఓటర్లకు కన్ఫ్యూజన్‌తప్పదు.

చంద్రబాబునాయుడు నాలుగేళ్ళ పాలనను బేరీజు వేసుకుని ఓటు వెయ్యాలా! లేక ప్రత్యేక హోదా సాధన అంశంగా తాను ఓటు వెయ్యాలా! అనే ఆలోచనలో ఓటరు ఉంటాడు. చంద్రబాబునాయుడు ప్రభుత్వంమీద ఓటర్లలో వ్యతిరేకత ఉంది.

రాష్ట్ర రాజధాని నిర్మాణం విషయంలో చంద్రబాబు చెపుతున్నవి వాస్తవాలు కాదు. శంకుస్థాపన తప్పించి అమరావతి నిర్మాణంలో జరిగిందేమీ లేదు. కేంద్రం ఇచ్చిన 1500 కోట్లు ఏ నిర్మాణంలోకి పోయాయో కూడా తెలియదు.

అలాగే పోలవరం నిర్మాణం 2019లోగా అవుతుందా అనేది సందేహమే! కాపు రిజర్వేషన్ అంశం ఉండనే వున్నది. పెరగని మౌలిక వసతులు, లభించని ఉద్యోగాలు... ఇలా చాలా అంశాలలో తెలుగుదేశం వాగ్దానాలను నిలబెట్టుకోలేదు.

ఆ మొత్తం ప్రభుత్వ వ్యతిరేకతను తనమీద పడకుండా కేంద్రంమీదికి నెట్టేసే అంశం అందించింది బి.జె.పి. ఆంధ్రప్రదేశ్ విషయంలో బి.జె.పి. నిర్లక్ష్యం స్పష్టం. భారీగా సహాయం చెయ్యాల్సిన చోట పిసినారిగా విదిలించింది. దానికి భారీ వ్యతిరేకతను మూటకట్టుకుంది.

వాజ్‌పేయి-అద్వానీ కాలంనాటి బి.జె.పికి అమిత్‌షా-మోడీ నడిపే బిజెపికి చాలా తేడా ఉంది. ఎత్తుగడల విషయంలో ఆరితేరారు. బలమైన ఆర్థిక పునాదులు పార్టీకున్నాయి.

తాము గెలవలేని రాష్ట్రాలలో కూడా ఇతరులను దెబ్బతీయగలిగిన శక్తివంతులుగా తయారయ్యారు. కాబట్టి చంద్రబాబునాయుడు కొత్తగా విసిరే అస్త్రాలకు ధీటుగా స్పందించగలరు.

వ్యతిరేక ప్రచారం చెయ్యగలరు. ఆ ప్రమాదం పసిగట్టే చంద్రబాబు బి.జె.పి.తో బంధం తెంచుకున్న ఎన్.డి.ఎ.ని వదులుకోలేదు.

పవన్‌కళ్యాణ్ నేరుగా చంద్రబాబుమీద, లోకేష్ మీద అవినీతి ఆరోపణలు సంధించినతర్వాత రాజకీయ వాతావరణం మరింత వేడెక్కితీరుతుంది. పవన్‌కళ్యాణ్ విమర్శల వెనక ఎవరున్నది తెలుసుకోవాల్సిన అవసరం తెలుగుదేశానిది.

పవన్‌కళ్యాణ్ స్వతంత్రంగా వ్యవహరిస్తుంటే తెలుగుదేశానికి ఒక రకంగా లాభం, మరో రకంగా నష్టం. ప్రభుత్వ వ్యతిరేక ఓటును వైకాపా, జనసేన పంచుకుంటే టి.డి.పి.కి లబ్ది చేకూరుతుంది.

అలాకాక మిగిలిన రాష్ట్రాలలో ఓటర్లు ప్రస్తుత ప్రభుత్వాలను ఓడించి కొత్త పార్టీకి పట్టంగట్టే సాంప్రదాయాన్ని ఆంధ్రులు అనుసరిస్తే చంద్రబాబుకు దెబ్బతగులుతుంది. ఆంధ్ర రాజకీయం రంజుగా మారింది. అలాగని వీరంతా ఇలాగే శత్రువుల్లా చివరివరకు వ్యవహరిస్తారనేది కాదు.

తమ గెలుపుకన్నా ఎదుటివారి ఓటమికోసం నడిపే రాజకీయాలది పైచేయి అవుతుంది చివరికి.

*డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు*



Courtesy : SANANDA

# పోటు ఎక్కువే

ఎవరైనా గట్టిగా మాట్లాడినా, కోపంతో అరిచినా వెంటనే అతగాడిని వీడుత్త బి.పి.గాడురా అంటుంటాం. ఎవరైనా విసిగిస్తుంటే "నాకు బి.పి. తెప్పించకు అవతలికిపో" అంటాం. ఏమిటి ఆ బి.పి., అంతగా అందరూ వాడే ఆ పదానికి అర్థం ఏమిటి! అంటే వెంటనే చెప్పలేరు చాలామంది.

మానవ శరీరంలో నిరంతరం పనిచేసే అంగం గుండె. ప్రతిక్షణం గుండె కొట్టుకోవటంద్వారా రక్తాన్ని శరీర భాగాలకు అందచేస్తుంది. ఆ యా కండరాలకు అవసరమైన ఆక్సిజన్‌తో నిండిన స్వచ్ఛ రక్తాన్ని సరఫరా చేయటం గుండె చేస్తుంది.

గుండె ఒక 'పంప్' వంటిది. ఒత్తిడితో గుండె కండరాలు కొట్టుకుని రక్తాన్ని బయటకు పంపితే,ఆ రక్తం ప్రవహించేందుకు వీలుగా రక్తనాళాల వ్యవస్థ శరీరమంతా వ్యాప్తిచెంది వుంటుంది.

రక్తనాళాల గోడలు సంకోచ, వ్యాకోచాలను ప్రదర్శించగలిగిన రబ్బరుగొట్టాల వంటివి. రక్తనాళం గుండా ప్రవహించే రక్తం రక్తనాళాల గోడలమీద ప్రదర్శించే ఒత్తిడిని రక్తపోటు లేదా బ్లడ్ ప్రెషర్ (బి.పి) అంటారు.

## బి.పి.కి కారణాలు

గుండె కొట్టుకోవటం రెండు దశల్లో సాగుతుంది.

గుండె గట్టిగా కొట్టుకున్నప్పుడు ఆ ఒత్తిడికి గుండెలోని రక్తం బయటకు వెళుతుంది.



గుండె తిరిగి సాధారణ స్థితికి వచ్చినప్పుడు రక్త పీడనం తగ్గుతుంది. అలా ఒక్కసారి కొట్టుకుని, తిరిగి వికసించే గుండెవల్ల రక్తప్రవాహం రక్తనాళాలలో అలలా సాగుతుంది.

గుండె గట్టిగా కొట్టుకున్న దశను 'సిస్టోలిక్' అని, తిరిగి వికసించిన దశను 'డయాస్టోలిక్' అని అంటారు. ఆ రెండు దశలలో ఒత్తిడిని కొలవటంమాత్రం మిమీ మెర్క్యురీ (mmHg) లో కొలుస్తారు.

ఆరోగ్యవంతుడైన మానవుడిలో సిస్టోలిక్ ఒత్తిడి 120 mmHg కన్నా తక్కువగా, డయాస్టోలిక్ ఒత్తిడి 80కన్నా తక్కువగా వుంటుంది. దీనిని 120/80 అంటారు. సిస్టోలిక్ రక్తపోటు 120-139 మధ్య వుంది. డయాస్టోలిక్ 80-89 మధ్యవుంటే హైబి.పి. వస్తోందని అర్థం. అది 140/90 లేదా అంతకన్నా ఎక్కువగా వుంటే హైబి.పి. వచ్చినట్టు.

వైద్యశాస్త్ర పరిభాషలో హైబి.పిని హైపర్ టెన్షన్ అంటారు. రక్తపోటు అనేది స్థిరంగా వుండదు.

రోజులో కొన్నిసందర్భాలలో అధికంగా, మరోసారి సాధారణంగా వుంటుంది. రక్తపోటు పెరిగిన స్థాయిలోనే. ఎక్కువ సమయం వుంటే హైపర్‌టెన్షన్ వచ్చినట్టు లెక్క. ఈ హైపర్‌టెన్షన్ రావటానికి పెరిగిన వయసు, వంశపారంపర్యంగా హైపర్‌టెన్షన్ వుండటం, ఊబకాయం, వ్యాయామంలేని జీవనవిధానం, ఆహారంలో ఉప్పు అధికంగా తీసుకోవటం, మానసిక ఒత్తిడి వంటి వాటిలో ఏ ఒక్కటైనా లేదా ఒకటి, రెండు కలిసి అయినా కారణం అవవచ్చు.

హైపర్‌టెన్షన్ దీర్ఘకాలం వుండటం మంచిది కాదు. రక్తపోటు పెరిగితే దాని ప్రభావం గుండెకొట్టుకునే తీరుమీద పడుతుంది.

రక్తం 'పంప్' చెయ్యటానికి గుండె మరింత కష్టపడాల్సి వస్తుంది. దీనివలన రక్తనాళాల గోడలు సాగేగుణం కోల్పోయి గట్టిపడవచ్చు. ఇటువంటి హైపర్‌టెన్షన్‌ని నియంత్రించకపోతే గుండెజబ్బులు వస్తాయి.

పక్షవాతం రావచ్చును. కంటిచూపు మందగించి క్రమంగా కంటిచూపు పోవచ్చును. డయాబెటిక్ అవుతారు. మూత్రపిండాలు దెబ్బతినవచ్చు. గుండె పనిచేయటం ఆగిపోగలదు. కొలెస్ట్రాల్ స్థాయి పెరిగే ప్రమాదముంటుంది.

హైపర్‌టెన్షన్‌ని నియంత్రించి, అదుపులో వుంచుకోవాల్సిందే కాని ఒకసారివచ్చిన తర్వాత ఇక తగ్గటం అంత సులభంగా జరగదు.

## పొట్ట తగ్గాలి

హైపర్‌టెన్షన్ ఈ అనారోగ్యం వచ్చిందనే విషయం గుర్తించటం జరగదు. కొందరిలో ఎటువంటి ముందస్తు హెచ్చరికలు లేకుండానే హఠాత్తుగా తీవ్రస్థాయికి రక్తపోటు చేరవచ్చు.

కాబట్టి ఆ విషయంలో కారకాలు అయినవాటిని గుర్తించి అవి దరిచేరకుండా చూసుకోవటం మంచిది. ఊబకాయం రక్తపోటును, గుండెజబ్బులను కూడా తెస్తుంది. వయసు, ఎత్తుకు తగిన శరీర బరువులో వుండేవారికి ఈ ఇబ్బందులు తక్కువ.

కాబట్టి శరీర బరువు, శరీర రూపం మీద శ్రద్ధపెట్టాలి. బాడీమాస్ ఇండెక్స్ (బి.ఎమ్.ఐ.), పొట్ట చుట్టుకొలతలను పరిగణలోకి తీసుకోవాలి. ఎవరికి వారు తమ శరీర బరువు, ఎత్తును రెట్టింపుచేసి భాగిస్తే వచ్చేది బి.ఎమ్.ఐ.

డా॥ జె. శ్రీమన్నారాయణ
M.D., D.M., JIPMER (Pondicherry)
Senior Interventional Cardiologist,
Chief Cardiologist, Gold Medalist,
Cell : 91772 19900

## సమగ్ర ఆహారం

ఆహారపు అలవాట్లను మార్చుకోవటంద్వారా రక్తపోటును తగ్గించుకోవచ్చని నిరూపణ అయింది. ఆహారంలో పండ్లు, కాయకూరలు, ముతక ధాన్యం, ఎండుపండ్లు, తక్కువ స్థాయి కొవ్వులు కలిగిన పాడి ఉత్పత్తులు పెంచాలి. ఇటువంటి ఆహార పదార్థాన్ని డాష్ (డయటరీ అప్రోచ్ టు స్టాప్ హైపర్ టెన్షన్) అని పిలుస్తున్నారు.

హైపర్‌టెన్షన్ ప్రారంభదశలో వున్నవారికి, హైపర్ టెన్షన్‌తో బాధపడేవారికికూడా ఈ ఆహారమే తగినది. ఈ ఆహారంవల్ల హైపర్‌టెన్షన్‌తో బాధపడే రోగులలో 5.5 ఎమ్.ఎమ్.హెచ్.జి. సిస్టోలిక్ ఒత్తిడిలో, డయాస్టోలిక్ ఒత్తిడిలో 3 ఎమ్.ఎమ్.హెచ్.జి. తగ్గింది.

ఈ ఆహార పదార్థాలలో పొటాషియమ్, ఫాస్ఫరస్, ప్రొటీన్ అధికంగా వుంటాయి. కాబట్టి మూత్రపిండాల ఇబ్బందులు తీవ్ర స్థాయిలో వున్నవారికి 'డాష్' ఆహార పదార్థాలు తగినవికావు. ఉప్పు (సోడియమ్)ని ఆహారంలో తగ్గించటం హైపర్‌టెన్షన్ చికిత్సలో భాగం.

హైపర్‌టెన్షన్‌తో బాధపడేవారు కొన్ని విషయాలలో నిర్లక్ష్యం చెయ్యకూడదు.

- ఉదయం అల్పాహారం అస్సలు మానకూడదు.
- భోజనాలకు మధ్య సమయం తగ్గించాలి.
- ప్యాకెట్ ఫుడ్‌ని తినవద్దు. రెడీ టు మేడ్ సూప్స్, చిప్స్, జంక్‌ఫుడ్‌ని పూర్తిగా వదిలేయాలి.
- ఉప్పు అధికంగా వుండే ఊరగాయలు బాగా తగ్గించాలి.
- పండ్లు తినండి, పండ్లరసాలు వద్దు.
- వంటలో రుచికోసం వాడే కొత్తిమీర, కరివేపాకు ఇతర సుగంధద్రవ్యాలను ఉపయోగించండి. ఉప్పు తగ్గించాలి. ఉల్లి, వెల్లుల్లి వంటివి రుచికి వాడుకోవచ్చు.
- కారం, అల్లం వంటి ప్రకృతి సహజ పదార్థాలను తీసుకోవచ్చును. పుదీన, దాల్చిచెక్క వంటి వాటిని ఉపయోగించాలి.
- నిలవవుంచిన ఆహారాలు తీసుకోవద్దు. తాజా ఆహార పదార్థాలు చేసిన వెంటనే తినటం అలవాటు చేసుకోవాలి.
- బయట హోటళ్ళలో, రోడ్డు పక్కన రెస్టారెంట్స్‌లో చేసిన తినుబండారాలు తినవద్దు.
- మత్తు పానీయాలు తాగితే రక్తపోటు పెరుగుతుంది. కాబట్టి వాటిని చాలా పరిమితంగా ఉపయోగించాలి. ◆


Courtesy : VANITHA



బి.ఎమ్.ఐ. = బరువు (కి.గ్రా.) / ఎత్తు (మీటర్$^2$)

అలా చెయ్యగా వచ్చిన విలువ 18కన్నా తక్కువ వుంటే తగినంత బరువులేరని అర్థం. 18.5 నుండి 24.9 వరకు వుంటే సాధారణ బరువు వున్నట్టు.

25-29.9 మధ్య వస్తే బరువు ఎక్కువని, బి.ఎమ్.ఐ. 30ని మించివుంటే ఊబకాయులు అని అర్థం. పొట్ట పెరగటం అనేది మంచిదికాదు. పొట్ట పెరిగితే డయాబెటిక్ అవుతారు. మూత్రపిండ వ్యాధులు, కంటిచూపు సమస్యలు వస్తాయి.

మహిళలలో పొట్ట 35 అంగుళాలు దాటినా, పురుషులలో పొట్ట 40 అంగుళాల చుట్టుకొలత దాటినా వారు ఊబకాయులని అర్థం. అటువంటి శరీర రూపం మార్చుకునే యత్నం చెయ్యటం హైపర్ టెన్షన్‌ని నియంత్రించటంలో తొలియత్నం.

## శారీరక వ్యాయామం

శారీరక వ్యాయామం క్రమంతప్పక ఎవరు చేస్తారో వారి గుండె బలంగా వుంటుంది. రక్తాన్ని 'పంప్' చెయ్యటంలో పూర్తి సమర్థతని ప్రదర్శిస్తుంది. దీనివలన రక్తనాళాలమీద రక్తపోటు తగ్గుతుంది. ఫలితంగా మనిషిలో రక్తపోటు అదుపులో వుంటుంది.

ప్రతిరోజూ వ్యాయామం చెయ్యటం ఆరోగ్యానికి మంచిది. నడక, జాగింగ్ వంటివి ప్రతిరోజూ అరగంటనుండి గంటసేపు చెయ్యగలరు.

రోజూ చెయ్యలేనివారు వారంలో కనీసం మూడు, నాలుగుసార్లు ప్రతిసారి 40 నిమిషాలకు తగ్గకుండా వ్యాయామం చెయ్యాలి.

సైకిల్ తొక్కటం, జాగింగ్, ఈత, మెట్లు ఎక్కటం వంటివాటివల్ల రక్తపోటు అదుపులోవుంటుంది. ఎటువంటి వ్యాయామమైనా ఎంచుకోవచ్చును. అయితే ఏ తరహా వ్యాయామం మంచిది, ఏది కాదు అనేది వైద్యుని సంప్రదించి చెయ్యటం మేలు.

తగిన వ్యాయామ తీరును హైపర్‌టెన్షన్‌కి చికిత్స చేసేవారు నిర్దేశించగలరు. ఆహార, వ్యాయామ నియమాలను పాటిస్తే హైపర్‌టెన్షన్‌ని అదుపులో వుంచుకోవటం సాధ్యమవుతుంది.

హైపర్‌టెన్షన్‌ని నిర్లక్ష్యం చెయ్యవద్దు. పలురకాల ఇతర అనారోగ్యాలకు మూలం హైపర్‌టెన్షన్. ఈ హైపర్‌టెన్షన్‌ని అదుపుచెయ్యకుంటే గుండెపోటు, రక్తనాళాలు చిట్లటం, మూత్రపిండాలు దెబ్బతినటం వంటివి జరుగుతాయి. హైపర్‌టెన్షన్ అదుపులో లేనప్పుడు డయాబెటిస్ వస్తుంది. ఇక ఆ రెండు కూడితే మనిషిని పూర్తిగా కుంగతీస్తాయి.

సొంతగా మందులు వాడవద్దు. వైద్యుడిని సంప్రదించటం మరవవద్దు. ఆహారం విషయంలో నిపుణులు ఇచ్చిన సూచనలను ఆచరించండి. వేళకు ఆహారం, పరిమిత ఆహారం, సమగ్ర పోషకపదార్థాలు, వ్యాయామం వంటివి కీలకమనే విషయం మరచిపోవద్దు. హైపర్‌టెన్షన్ నియంత్రణ జీవితాన్ని పొడిగిస్తుంది. ఇబ్బందులు తగ్గిస్తుంది.

ముఖ్యంగా నలభైల వయసు దాటుతున్నవారు తప్పనిసరిగా తమ రక్తపోటు, మధుమేహ పరీక్షలు చేయించుకోవటం మరువవద్దు.

# తెర తీయగ రాదా

## ₹10,000 బహుమతి కథ



అది మధ్యాహ్న సమయం. చుట్టూ పచ్చని చేలు సన్నగా వీస్తున్న గాలికి మత్తుగా తలలు ఊపుతున్నాయి. చుట్టుపక్కల ఎక్కడా పెద్ద సద్దులేదు. ఒక చిన్న షెడ్ మాత్రం ఉంది. దాని తలుపులు గట్టిగా వేసి ఉన్నాయి.

లోపల ఒక అందాల రాశి అద్దంలో తనను తాను చూసుకుంటూ ముఖానికి చుట్టి ఉన్న చున్నీని సున్నితంగా తొలగించసాగింది.

ఆమె రూపం చూడాలనే ఆశతో ఉన్న ఒక యువకుడు ఆమె వెనక నుంచుని అద్దంలో ఆమె ప్రతిబింబాన్ని చూస్తున్నాడు. చున్నీ తొల గించాక ఆమె నుదుటిపైన సన్నటి స్వేదబిందువులు, ఆమె కలువ కనులలో అతనిపైన ప్రేమ, ఆమె గులాబి పెదవులు దర్శనం ఇచ్చాయి అతనికి. మెడచుట్టూ ఉన్న చున్నీనితొలగించి ఒక పక్కగా జారవిడిచింది.

.ఈలోగా ఆమె వెనకకుచేరిన అతను ఆమెను తన బాహువులలో బంధించాడు. ఒక్కసారిగా ఆ స్పర్శ ఆమెను మధురలోకాలలోకి లాక్కెళ్ళిపోయింది. ఆమె కనులు అరమూతలు పడ్డాయి. ఆమె పెదవులు మరింతగా నిగారించాయి.

బుగ్గల్లో సిగ్గుపండి యాపిల్స్‌లా నిగనిగలాడాయి. పద్మంమీద వాలే భ్రమరంలా అతను ఆమె ముఖంపై తనముఖం ఆనించి ఆమె పెదవులను అందుకున్నాడు తన పెదవులతో. అతనిలోని కోరిక వేడికి ఆమె వెన్నలా కరిగింది. వారి సరాగాలు చూస్తూ కాలం స్తంభించిపోయింది.

ఈ సంఘటన జరగడానికి కొన్ని నెలల ముందు ఆ ఊరిలో ఏమయిందో తెలుసుకోవడానికి మనం గతంలోకి వెళ్ళాల్సిందే!

మహీపాల్ అగ్రికల్చర్ ఇంజనీరింగ్ చదివాడు. ఆ చదువు పూర్తికాగానే అతనికి పెద్ద బ్యాంక్‌లో ఆఫీసర్ ఉద్యోగం వచ్చింది. రెండేళ్ళు అక్కడ పనిచేసి రైతుల కోసం ప్రభుత్వం చేపట్టే ఎన్నో మంచి పథకాలు రైతులకు అందవలసిన విధంగా అందటంలేదని గ్రహించాడు అతను.

పల్లెలను పట్టణాలకు దీటుగాచేయాలనే సంకల్పంతో ఉద్యోగానికి రాజీనామాచేసి స్వంతఊరిలో వ్యవసాయం చేపట్టాడు. అప్పటివరకు వాళ్ళ ఊరిలో వ్యవసాయం అంటే లాభమొస్తుందో, నష్టమొస్తుందో తెలియని జూదంలాంటివ్యసనంగా భావించేవారు. ఐతే మహీపాల్‌వచ్చినతర్వాత ఆ పరిస్థితిమారింది.

అతను సాధించిన విజయాలతో స్ఫూర్తిపొందిన మరింతమంది చదువుకున్న యువకులు వ్యవసాయం బాటపట్టారు. పల్లెల్లో పట్టణవసతుల రూపకల్పన అంటూ అబ్దుల్ కలాం కన్న కలలు కూడా సాధించి చూపాడు మహీపాల్.

అందువలనే అతన్ని ఆ ఊరి సర్పంచ్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు ఆ గ్రామప్రజలు. ఆ ఊరి భూస్వామి రామకృష్ణారావు తన ఒక్కగానొక్క కూతురు ధరణిని మహీపాల్‌కి ఇచ్చి పెళ్ళి చేయాలనుకున్నాడు. మహీపాల్ తల్లిదండ్రులతో మాట్లాడి పెళ్ళిచూపులు ఏర్పాటు చేశాడు.

తొలిచూపులోనే ఒకరికొకరు నచ్చారు. తొందరలోనే మంచిముహూర్తం చూసి వాళ్ళిద్దరికి కళ్యాణం జరిపించాడు రామకృష్ణారావు.

సంప్రదాయం పేరుతో నవదంపతులను విడదీసే ఆషాఢంరానేవచ్చింది. చిలకా గోరింకల్లా లోకం మరిచి ఆనందిస్తున్న నవజంటమధ్య ఎడబాటు కలిగించింది. తప్పనిసరి పరిస్థితిలో ధరణి పుట్టింటికి వెళ్ళింది. ఆ రోజంతా ఆమె వియోగంలో సలసలా కాగాడు మహీపాల్.

కనీసం ఫోన్లు ఉన్నాయి కాబట్టి వాటిలో మాట్లాడుకుందామనుకున్నా, ఆ పల్లెటూరిలో సిగ్నల్స్ సరిగా అందక ఆ సదుపాయం కూడా పూర్తిగా అందలేదు ఆ జంటకి. భార్య గుర్తుకువస్తుంటే, ఆమెనుచూడడం కోసం వాళ్ళ ఇంటికివెళ్ళే అవకాశం లేక చాలా ఇబ్బందిపడ్డాడు మహీపాల్.

ఇక మనసు ఆపుకోలేక మూడోరోజే మావగారి ఇంటికి వెళ్ళాడు తన భార్యను కలుసుకోవడానికి. అతను ఇంటికి అంత దూరంలో ఉండగానే చూసిన అతనిఅత్తగారు, పరుగునవెళ్ళి ధరణి తండ్రికిచెప్పింది "ఏమండీ అల్లుడుగారు వచ్చేస్తున్నారు. ఇంట్లోకి రాకుండా ఆపండి. మీరేం చేస్తారో నాకు తెలియదు" అంటూ బయటికి తరిమింది.

బుల్లెట్ మావగారి ఇంటి ముందు ఆపి, లోపలికి వెళ్ళబోతున్న మహీపాల్‌ని చూసి గబగబా బయటికి వచ్చాడు.

"అరే అల్లుడుగారూ మీరా, ఏంటి ఇలా వచ్చారు" అంటూ ఎదురెళ్ళి భుజంమీద చేయివేసి పలకరించాడు రామకృష్ణారావు.

"నమస్తే మావయ్యగారు. ఎలా ఉన్నారు. అంతా బాగున్నారా?" అన్నాడు మహీపాల్ మొహమాటంగా నవ్వుతూ. అతని గొంతు విని బయటకు ఒక్కపరుగున రాబోయిన ధరణిని, ముందే అలాంటి పరిస్థితి వస్తుందని పసిగట్టిన ఆమె తల్లి గుమ్మంలోనే అడ్డుకుని ఆపేసింది "నువ్వు లోపలికి పదవే" అంటూ.

"ఏమీలేదు, ఊరికినే" అంటూ నీళ్ళు నమిలాడు మహీపాల్.

"సరే, అలా వెళ్ళొద్దాం పదండి" అంటూ అల్లుడి భుజంమీద చేయివేసి అతన్ని బుల్లెట్ దగ్గరికి తీసుకెళ్ళి దాన్ని స్టార్ట్ చేయించి తాను అల్లుడి వెనక కూర్చుని, "పొరుగూరికి వెళ్ళాలి అని అనుకుంటున్నా, సమయానికి మీరొచ్చారు పదండి" అన్నాడు.

మావగారిని పొరుగూరికి తీసుకెళ్ళి అంతా తిప్పి మళ్ళీ ఆయనను ఇంటి దగ్గర దింపేటప్పుడైనా ధరణి దర్శనం అవుతుందేమో అని ఆశపడ్డాడు.కానీ తిరిగి వచ్చేటప్పుడు, "మీ ఇంటికి పదండి అల్లుడుగారూ, బావగారిని కలిసి చాలా రోజులైంది" అంటూ దారితప్పించాడు రామకృష్ణారావు.

మావగారు తనకు సైంధవుడిలా అడ్డుపడుతున్నవిషయం అప్పటికి అర్థమయింది మహీపాల్‌కి. కానీ చేసేది లేక గుండెల్లో బాధను గుండెల్లోనే అదిమి

గొర్లి శ్రీనివాసరావు
సెల్: 91633 40600



పెట్టుకున్నాడు. ఎలాగో ఈ ఏకాంతాన్ని భరించక తప్పేదిలేదు అనుకున్నాడు మహీపాల్.

ఇక తన దృష్టంతా వ్యవసాయం పనుల ప్లానింగ్ పైన పెట్టాడు. రోజులు నిస్సారంగా గడవసాగాయి. ఒక్కోరోజూ ఒక్కోయుగంలా గడిచింది. అలా రెండు యుగాలు గడిచాక ఒక మధ్యాహ్నం రెండుగంటల వేళప్పుడు ఒక అమ్మాయి మహీపాల్ పొలంపక్కన రోడ్డుపై వెళ్తూ మహీపాల్ బుల్లెట్ దగ్గర ఆగింది.

దూరంనుంచి ఆమెను చూసిన మహీపాల్ 'ఎవ రీమె' అనుకున్నాడు. ధరణి కనబడక ఒక వారం అయింది అప్పటికే. ఎవరిని చూసినా ఆమే గుర్తుకి వస్తోంది అతనికి. అందుకే ఆ వచ్చిన అమ్మాయి కూడా ధరణిలాగా అనిపించింది అతనికి.

బుల్లెట్ దగ్గర నుంచున్న అమ్మాయి లూజ్‌గా ఉన్న పంజాబీ డ్రెస్ వేసింది. ముఖం చుట్టూ చున్నీ చుట్టింది. ఆమె ముఖంలో ఆమె కళ్ళు తప్ప మరేమీ కనబడడం లేదు. చెయ్యెత్తి మహీపాల్‌ని పిలిచింది. మహీపాల్ ఆమె దగ్గరికి వెళ్ళాడు.

ఆమె దగ్గరకి వెళ్ళాక 'ఎలా ఉన్నారు?' అన్న ఆమె ప్రశ్న విని వచ్చింది తన ప్రేయసి అని తెలిసింది అతనికి. ఆనందంపట్టలేక ఆమెను కౌగిలిలో బిగించాడు. ఆమెకు కూడా అతని కౌగిలిలో ఒదిగిపోవాలని ఉన్నా ఎవరైనాచూస్తే ఏమనుకుంటారో అన్న భయంతో పెనుగులాడింది.

“మీరు ఇలా చేస్తే నేను వెళ్ళిపోతాను” అని బెదిరించింది. వినలేదు మహీపాల్. ఆమెను బిగికౌగిలిలో బంధించి చున్నీతో చుట్టి ఉన్న ఆమె ముఖాన్ని ముద్దులతో ముంచెత్తాడు.

తనపై ప్రేమను అలా వ్యక్తపరుస్తున్న మహీపాల్‌ను తన గుండెకు హత్తుకుంది ఆర్తిగా!

కొద్దిసేపు అలా లోకాన్ని మరిచి గాఢపరిష్వంగనంలో గడిపారు ఇద్దరూ. ఆమె ముఖానికి ఉన్న చున్నీని తొలగించబోతుంటే “వద్దు, వద్దు. ఎవరైనా చూస్తారు” అంటూ ఆపేసింది. కానీ అతను కౌగిలి సడలిస్తున్నప్పుడు అతన్ని విడవలేక మళ్ళీగట్టిగా అతన్ని గుండెలకు హత్తుకుంది.

“వదులు మహీ నిన్ను కలుసుకోవడానికి ఇప్పటికి వీలుపడింది. ఈ విషయం మా ఇంట్లో వాళ్ళకు తెలిసినా, మీ ఇంట్లో వాళ్ళకు తెలిసినా బాగుండదు” అంది. “ఎవరేమనుకుంటే మనకేమిటి. నిన్ను వదలడానికి మనసొప్పడం లేదు” అన్నాడు.

“అలా అంటే ఎలా ఇంతకాలానికి మనం కలుసుకునే అవకాశం దొరికింది. చూద్దాం భగవంతుడు మనకో అవకాశం తప్పక ఇస్తాడులే” అంది ఆమె.

“ఏమో ఏం ఇస్తాడో? ఇచ్చిన ఈ అవకాశం సద్వినియోగం చేసుకుందాం. ఈ షెడ్‌లో మనం ఏంచేసినా ఎవరికీ తెలియదు” అన్నాడు మహీపాల్.

“వద్దు, వద్దు. నా మాట విను. ఈసారి వచ్చినప్పుడు నీ ఇష్టం” అంది.

“సరే.. కనీసం ఆ ముఖమన్నా ఒకసారిచూడనివ్వు. మనసారాచూస్తే నువ్వు మళ్ళీ కనిపించేవరకు నా

## ఎన్నోసార్లు ఆశ్చర్యం

ప్రేక్షకులు చూపించే అభిమానం తననెంతో ఆకట్టుకున్న విషయం అంటున్నది అనుపమా పరమేశ్వరన్. "మంచి సినిమా చేస్తే ఇంతగా ఆదరి స్తారా అనుకుంటూ ఆశ్చర్యపడిన సందర్భాలు అనేకం ఉన్నాయి. నా పనితీరు నచ్చేవాళ్ళు నచ్చిం తగా అభిమానిస్తున్నప్పుడు మరింత కష్టపడి వాళ్ళను ఇంకా మెప్పించాలని అనిపిస్తుంటుంది.

అందుకేనేమో, తొలి సినిమా చేస్తున్నప్పుడు నాలో ఏ భయాలూ లేవు. కాని విజయాలు అందు కున్నాకే గందరగోళపడ్డాను.

ఎలా ఏది ఎంచుకోవాలి, ఎవరితో మాట్లాడాలి, ఎవరితో మాట్లాడకూడదు వంటి విషయాలు అర్థం అయ్యేవికావు. ఇప్పుడిప్పుడు అన్నీ తెలుస్తున్నా యనుకోండి" అని చెప్పింది.

కళ్ళకుశాంతి,మనసుకి శాంతిఉంటుంది" అన్నాడు.

"ప్లీజ్ మహీ, నా మాట విను. ఇప్పటికే లేటయింది. ఎవరైనా చూశారో, నా పరువుపోతుంది. నీకేం మగ వాడివి, హ్యాపీగా తిరుగుతావు" అంది ఆమె.

మళ్ళీ వస్తానని ఒట్టు పెట్టించుకున్నాక ఆమెను వదిలిపెట్టాడు మహీపాల్. అతన్ని వదలలేక, వదల లేక వదిలింది. కదలలేక కదలలేక కదిలింది.

ఆమెను కలిసిన తర్వాత చాలా ఉత్సాహంగా అనిపించింది.అన్నిపనులు చక్కగా చేసుకోగలిగాడు. అతని కింద పనిచేసేవాళ్ళు, అతని సహచరులు అతనిలో కనిపిస్తున్న నూతనోత్సాహానికి కారణం తెలియక తబ్బిబ్బుపడ్డారు.

కాని దూరం నుంచి అతను ఆ అమ్మాయిని కలుసుకోవడం ఆ ఊరివాళ్ళు చూశారు. వాళ్ళకు మహీపాల్ ఒక పంజాబీ డ్రెస్ వేసుకున్న అమ్మాయితో చాలా చనువుగా గడిపాడని తెలిసింది, కాని ఆమె ఎవరు అన్న విషయం తెలియలేదు.

ఇలా రెండు మూడు రోజులకు ఒకసారి ఆ అమ్మాయి ఏదో ఒక సమయంలో వచ్చి మహీ పాల్‌ని కలవడం వెళ్ళడం జరుగుతూ ఉంది.

ఆమె ఎవరో కనిపెట్టాలనుకుని చూసేవాళ్ళకి ఆశాభంగం కలుగుతూనే ఉంది. ఒక్కోసారి ఒక్కో వాహనంమీద వస్తుండేది. కానీ ఎప్పుడు ముఖం తెలియకుండా చున్నీ చుట్టుకుని వచ్చేది. ఆమె కళ్ళు తప్ప మరేమీ కనిపించేవికావు. మహీపాల్ ఎవరో అమ్మాయిని కలుస్తున్నాడు.అన్న విషయం ఒక హాట్ టాక్ ఆఫ్ ద టౌన్ అయిపోయింది.

ఒకరోజు రామకృష్ణారావు ఊరిలో లేనప్పుడు అతని ఇంటికి కొందరు ఇరుగు పొరుగు ఆడవాళ్ళు వచ్చారు.

"లక్ష్మక్కా, మీ ధరణి ఏం చేస్తుంది" అని ధరణి తల్లిని కలిసి అడిగారు.

"ఈమధ్య ఏమీ తోచడంలేదని



కాసేపు తనగదిలో కూర్చుని పుస్తకాలు చదువుకుం టుంది, తర్వాత నిద్రపోతుంది" అని చెప్పింది.

"మీకో విషయంచెప్పాలి లక్ష్మక్కా. బావగారు లేకుండా చూసి చెప్దామని ఇన్నిరోజులు ఆగాము. అమ్మాయికి తెలిస్తే కూడా బాగుండదు" అంది పక్కింటి రాధ.

"ఏంటది. ఏమన్నాసమస్యా? అయినా ధరణివింటే ఎందుకు బాగోదు" గబగబా అడిగేసింది లక్ష్మి.

"అంటే ఆ సమస్య ముఖ్యంగా ధరణికే కదా! అందుకే ఆ విషయం ఆమె వినేలా చెప్తే బాగుండ దని..." నసుగుతూ అంది రాధ.

"ధరణికి సమస్యా! ఏం సమస్య?" అడిగింది లక్ష్మి కంగారుపడిపోతూ.

"మీ అల్లుడుగారి దగ్గరకు ఈమధ్య పక్కఊరు నుంచి ఒక అమ్మాయి వస్తోందని చూసినవాళ్ళు చెప్పారు అక్కా. వచ్చిన ప్రతిసారి గంటలు గంటలు పంప్ షెడ్ దగ్గర గడుపుతున్నారట. ఈ వ్యవహారం ఎంతదూరం వెళ్తుందో అక్కా" అంది రాధ.

అందరు ఆడవాళ్ళు ఆందోళన లను ప్రతిఫలించారు తమతమ ముఖాలలో. లక్ష్మికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ధరణికి ఈ విషయం తెలిస్తే ఎలా తట్టుకుంటుంది, పాపం. దాని కాపురం ఎంతో బాగుందని మురిసిపోతుంది తను.

ఈ అల్లుడిగారికి ఇదేమి మాయరోగం. ఇంట్లో అందమైన భార్యఉండగా బయట ఎవరితోనో సరసా లాడడానికి సిగ్గు లేదా అని కోపం తెచ్చుకుంది.

ఇంతలో కిర్రుమంటూ ధరణి గదితలుపులు తెరుచుకున్నాయి. కళ్ళు నులుముకుంటూ బయ టకు వచ్చింది ధరణి. అక్కడ ఉన్న ఆడవాళ్ళను చూసి నవ్వింది.

"మనం గట్టిగా మాట్లాడుతుంటే ధరణికి మెలు కువ వచ్చేసినట్లుంది" నొచ్చుకుంటూ అంది రాధ.

"ఏమయిందమ్మా.... అందరూ సీరియస్‌గా ఉన్నారు" అంది ధరణి.

అందరూ ముఖముఖాలు చూసుకున్నారు. చివ రికి లక్ష్మి అంది, "ఏం చెప్పమంటావమ్మా, నీ అదృష్టం అలా ఉంది" అంది కళ్ళు తుడుచుకుంటూ.

"ఊరుకో అక్కా, అవన్నీ తనతో ఎందుకు?" అంది రాధ.

"లేదులే రాధా. తెలిస్తే అదైనా అదుపుచేసుకుం టుంది. చెప్పండి" అంది లక్ష్మి.

మహీపాల్ ఎవరో అమ్మాయినితరచుగా కలుసు కోవడంగురించి మళ్ళీ వివరించారు ఆడవాళ్ళంతా.

"నో, నేను నమ్మను మీరంతా కూడా నమ్మకండి. ఆయన బంగారం. మీకు తెలుసుగా?" అంది.

"అవునమ్మా, మాకుతెలుసు మీ ఆయన బం గారం. అందుకే జాగ్రత్తపడితే మంచిది. బంగారాన్ని కాపలా కాసుకోకపోతే ఎవరైనా కొట్టే యొచ్చు"అంది కొత్తలాపాయింట్ లాగుతూరాధ.

"ఏం చేద్దాం చెప్పు రాధా" అంది లక్ష్మి.

"ఒకసారి మాట్లాడిచూస్తే మంచిదేమో అక్కా, అయినా బావగారి చెవిని వెయ్యి" అన్నారు వాళ్ళు.

"అమ్మా, దీన్ని పెద్దది చెయ్యకు. ఆయనకు ఈ విషయాలు తెలిస్తే హర్ట్ అవుతారు. నాకు ఇష్టంలేదు. మీరు నాన్నకు చెప్తే నామీద ఒట్టు" అంది ధరణి.

"అయ్యో అంతమాట అనకు" అన్నారు ఆడ వాళ్ళు. ధరణి తన గదిలోకి వెళ్ళిపోయి తలుపులు వేసుకుంది.

ఏం చేద్దాం అంటే ఏం చేద్దాం అనుకున్నారు అం దరూ. ఒకపక్క ధరణి చెప్పింది కూడా సబబే అని పించింది. ఒకవేళ నిజంగానే ఏమీ లేకపోతే ఆ విష యాన్ని ప్రచారం చేసినందుకు అల్లుడుగారు హర్ట్ అవ్వొచ్చు కూడా అంది లక్ష్మి.

అయినా ధరణి కాపురానికి సంబంధించిన విషయం కాబట్టి కాస్త ఆచితూచి అడుగువేస్తే మంచిది అనుకున్నారు అందరూ. నిప్పు లేకుండా పొగరాదు కాబట్టి, ఏదో ఉండే ఉంటుందనే గుబులుతో దిగులుపడ్డారు అందరూ.

కొద్దిరోజులు అలాగే గడిచాయి. మహీపాల్‌ని కలవడానికి వచ్చే



నాకంటూ సొంత కలలంటూ కలిగిన అమ్మాయిగా నేను ఎదిగాను... ఇప్పుడు నాకు మారాల్సిన అవసరం లేదు. -స్మృతి ఇరానీ, కేంద్రమంత్రి

అమ్మాయి నాలుగైదు రోజులపాటు కనబడలేదు. ఊరంతటికి తెలిసిపోవడంతో ఆ అమ్మాయి మహీపాల్‌ని కలవడానికిరావడంలేదు అనుకుని హమ్మయ్య అనుకున్నారు, ధరణి సంసారం సజావుగా సాగాలి అని కోరుకుంటున్న ఇరుగు పొరుగువాళ్ళు.

ఎప్పటికప్పుడు తమకు తెలిసిన సమాచారాన్ని వాళ్ళు లక్ష్మికి చేరవేస్తూనే ఉన్నారు. కానీ ఆ అమ్మాయి రావడం లేదని బాధపడే గ్రూప్ కూడా ఒకటి ఆ ఊరిలోనే ఉంది.

ఈ లోగా ఆషాఢం ముగిసిపోయింది ధరణి అత్త గారింటికి చేరుకుంది. అన్నిరోజుల విరహం తర్వాత కలయికలోని మాధుర్యాన్ని తనివి తీరా అనుభవించారు కొత్తజంట.

అన్యోన్యంగా కనిపిస్తున్న నవజంటను చూసి ధరణి తల్లి మనసు శాంతించింది. ఒకవేళవేరే అమ్మాయితో అల్లుడికి ఏమైనా సంబంధం ఉన్నా ఇకముందు అది కొనసాగకూడదని కోరుకుంది ఆమె.

అయితే ధరణి కాపురానికి తిరిగి వచ్చిన తర్వాత ఒక వారం రోజులకు మళ్ళీ ఆ ముసుగు అమ్మాయి మహీపాల్‌ని కలుసుకోవడానికి వచ్చింది. "ఏమయిపోయావు ఇన్నిరోజులు? నిన్ను కలుసుకోకపోతే నాకు ఏమీ బాగోలేదు తెలుసా" అన్నాడు మహీపాల్?

"నిన్ను కలుసుకోకపోతే నాకు మాత్రం బాగుంటుందా చెప్పు. కానీ మనం కలుసుకుంటున్న విషయం ఊరిలో అందరి నోళ్ళలోనూ నానుతుంటే విషయం బయటికి పొక్కితే బాగుండదని మనసు అదుపుచేసుకున్నాను" అంది అతని విశాలమైన ఛాతిపై తన ముఖం ఆనించి అతన్ని చుట్టేస్తూ.

అలాగే ఆమెని పొదివి పట్టుకుని ఆమె ముఖంపై ముద్దులుపెట్టాడు.

"ఈ ముసుగు అలాగే ఉంచాలా? ఇకనైనా ఈ తెర తీయగ రాదా" అన్నాడు.

"తీస్తేనేం, తీయకపోతేనేం. ఎవరికి తెలియకుండా మనం కలుసుకోవడానికి ఇదే సరైన పద్ధతి" అంది. ఆ రోజు చాలాసేపు ఉండి వెళ్ళిపోయింది ఆమె. ఆ షెడ్‌లో ఏకాంతంగా ఆమెతో గడిపిన ఆ క్షణాలు అతనిలో నూతనోత్తేజాన్ని నింపాయి ఎప్పటిలాగానే!

మళ్ళీ ఆ పొరుగూరి అమ్మాయి తమ అల్లుడు దగ్గరకు వస్తుందని తెలిసి కోపంతో ఊగిపోయింది లక్ష్మి. విషయాన్ని రామకృష్ణారావుతో చెప్పింది.

అప్పటికే అతను కూడా ఆ విషయం అక్కడక్కడా విన్నాడు. కానీ తన అల్లుడుకి ఊరిలో మంచి పేరు ఉంది కాబట్టి కిట్టని వాళ్ళు అతని పేరు చెడగొట్టడానికి ఏదో పన్నాగం పన్ని ఉంటారని అనుకున్నాడు.

కానీ భార్య అన్ని విషయాలు విడమరచి చెప్పే సరికి ఈ విషయాన్ని కాస్త లోతుగా పరిశోధించాల్సిందే అనుకున్నాడు.

ఆ అమ్మాయిని కనిపెట్టాలని చూసిన వాళ్ళకి ఆశాభంగం కలిగేది. ఆమె ఎప్పుడు అతన్ని కలుసుకోవడానికి వస్తుందో ఎవరికీ తెలిసేది కాదు. ఒక్కోసారి షెడ్ దగ్గర కలుసుకున్నా, కొన్నిసార్లు జీడి మామిడి తోపులోను, మరికొన్నిసార్లు జొన్న చేనులో మంచె మీద కనిపించే వాళ్ళు, కనిపెట్టేలోపుగా మాయమయిపోయేది.

ఈలోగా మళ్ళీ సర్పంచ్ ఎన్నికలు వచ్చాయి. మహీపాల్‌కి వ్యతిరేకంగా నిలబడ్డ ప్రత్యర్థికి మహీపాల్‌తో పోటీపడేంత సీన్‌లేదు.

కానీ అతని బలహీనతఏమిటో అతనికి తెలుసు. ఆ ధైర్యంతోనే అతనిపై పోటీకి వచ్చాడు.

"ఊరికి మహీపాల్ ఎంత మేలు చేశాడో మనందరికీ తెలుసు. అతన్ని పోయినసారి ఏకగ్రీవంగా ఎన్నుకున్నాం. ఇప్పుడు నువ్వు పోటీకి వచ్చావేంట్రా బాబు" అన్నారు కొందరు పెద్దలు మహీపాల్‌పై పోటీకి వచ్చిన ప్రత్యర్థితో.

"మీరు పెద్దలు, మీ మాటకు ఎదురొచ్చాను అని కాకుండా, ఒక్క విషయం ఆలోచించండి. ఊరికి లాభం చేశాడు అనేది అలా ఉండనివ్వండి.

ఊరి ముందు దోషిలాగ నిలబడే పనిచేసినప్పుడు అతన్ని ఎంపిక చేయడం అంటే మన ఊరి మర్యాదకి భంగం కదా!" అన్నాడు ఆ ప్రత్యర్థి.

అతని మాటలో అంతర్లీనంగా మహీపాల్‌పై అతను చేస్తున్న ఆరోపణ వినబడింది అక్కడ సమావేశమైన వాళ్ళకి. అయితే ఏం చేద్దాం అన్నట్లు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"మహీపాల్, నువ్వేమైనా చెప్పాలనుకుంటున్నావా" అన్నారు సమావేశానికి వచ్చిన పెద్దలు. వాళ్ళల్లో రామకృష్ణారావు కూడా ఉన్నాడు.

"లేదు. నేను ప్రత్యేకంగా చెప్పడానికి ఏమీ లేదు" అన్నాడు మహీపాల్.

"అదే నేను చెప్పేది. అందుకే నన్ను ఈసారి ఎన్నుకోండి. మన ఊరి పరువు కూడా చెడకుండా పని చేస్తాను" అన్నాడు ప్రత్యర్థి.

అంతలో అక్కడ కలకలం చెలరేగింది. మహీపాల్‌ని కలుసుకోవడానికి వచ్చే అమ్మాయి ఎన్నికలు జరిగే వేదిక దగ్గరకు వచ్చేసింది. ఎప్పటిలాగే ఆమె పంజాబీ డ్రెస్ వేసుకుని, ముఖం కనబడకుండా చున్నీ చుట్టుకుంది. ఆమె కళ్ళు మాత్రమే బయటికి కనిపిస్తున్నాయి. ఆమెను చూడగానే మహీపాల్ కళ్ళు మెరిశాయి. ముఖం ప్రకాశవంతం అయింది.

"ఇదిగో, మన ఊరిపరువు ఇలా చెడకుండా నేను కాపాడుతాను" అన్నాడు ప్రత్యర్థి ఆమె వైపు చేయి పెట్టి చూపిస్తూ.

తన ముఖానికి ఉన్న చున్నీ మెల్లగా తొలగించింది ఆమె. అందరూ ఆమె ముఖాన్ని చూసి ఆశ్చర్యపోయారు. రామకృష్ణారావు ఆనందంగా అరిచాడు. "అమ్మాయీ నువ్వా?! మరెందుకు ఇలా చాటుగా కలుసుకున్నావు మీ ఆయనను" అని అడిగాడు కుతూహలం ఆపుకోలేక.

"క్షమించండి నాన్నా, ఆషాఢంలో విడిగా ఉండలేక అలా కలుసుకునేవాళ్ళం. కానీ ఆయనకు నన్ను అలా కలుసుకోవడం వెరైటీగా ఉండీ బాగా నచ్చింది. దాంతో అదే కొనసాగించడం జరిగింది. మిమ్మల్ని ఇబ్బందిపెట్టినందుకు క్షమించండి" అంది ధరణి చేతులు జోడించి అందరివైపూ చూస్తూ.

"నేను పోటీ నుంచి విరమించుకుంటున్నాను" అన్నాడు ప్రత్యర్థి. మహీపాల్ మళ్ళీ ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడు ఆ ఊరి సర్పంచిగా!

## సౌందర్య పోషణ

కన్నడ 'కిరిక్ పార్టీ'లో నటించిన రెండేళ్ళకు అదే సినిమా తెలుగు రీమేక్‌లో నటించింది సంయుక్త హెగ్డె. "ఒకే పాత్ర చేసి ఓ నటిగా అప్పటికీ ఇప్పటికీ మెరుగయ్యానా? లేదా? అని పరిశీలించుకోవాలన్న ఉద్దేశ్యంతోనే తెలుగులోనూ అదే పాత్ర చేశాను. నాకు తెలుగు రాదు.

కాని మూడు నెలల్లో నేర్చుకుని నా లైవ్ డబ్బింగ్ కూడా చెప్పగలిగాను. బోల్డన్ని పొడవాటి డైలాగులున్నాయి. అవి చెప్పడం అంత సులువు కాలేదు. కాని కష్టపడి నేర్చుకున్నాను. నటిగా మా రూపాన్ని కాపాడుకోవడానికి మేమెంతో ప్రయత్నించాల్సి వుంటుంది. స్కూలు రోజుల్లో టామ్‌బాయ్‌లా వుండే నేను ఇప్పుడు సౌందర్య పోషణ చేసుకోవాల్సి వస్తున్నది" అంటూ నవ్వేసింది.



# అంతా రాజకీయమే

## ఓటుకు ఆధార్

ప్రతి చిన్నదానిని ఆధార్ కార్డుకు ముడిపెడుతున్న ప్రభుత్వం ఓటర్ కార్డుని ఆధార్‌కి ఎందుకు అనుసంధానం చెయ్యదు?

ఆ ప్రశ్న సరైనదేనని ఎన్నికల సంఘం నేడు అంగీకరించింది. గతంలో చీఫ్ ఎన్నికల కమిషనర్‌గా ఉన్నవారంతా ఆధార్-ఓటర్ కార్డ్ లింక్ స్వచ్ఛందమేనని, నిర్బంధం కాదని అనేవి.

కాని ఇప్పుడు నరేంద్రమోడీ ప్రభుత్వం నియమించిన ప్రధాన ఎన్నికల కమిషనర్ ఎ.కె.జోత ఎన్నికల సంఘం తరపున కొత్త అభిప్రాయాన్ని సుప్రీమ్‌కోర్టుకు తెలియచెప్పాడు.

ఆధార్ కార్డ్‌ని అనుసంధానం చెయ్యటంవల్ల ప్రభుత్వ సంక్షేమ పథకాలు అనుభవిస్తున్న బోగస్ వ్యక్తులు బయటపడ్డారు. తద్వారా ప్రభుత్వానికి 65 వేలకోట్ల రూపాయలు ఆదా అయ్యాయి.

ఇక ఇప్పుడు ఆధార్ కార్డును ఓటరు కార్డుకు అనుసంధానం తప్పనిసరి చేస్తే ఎన్ని కోట్ల బోగస్ ఓటర్లు దొరికిపోతారో!

ప్రజాస్వామ్యంలో బోగస్ ఓటింగ్‌ని తొలగించాల్సిన అవసరం ఉంది. కాని, బోగస్ ఓటింగ్‌తో గెలిచే రాజకీయ పార్టీలు మాత్రం ఓటర్ కార్డు-ఆధార్ అనుసంధానం కోరవు. ◆

## అహంకారం స్పష్టం

**2014** ఎన్నికల్లో గెలుపుతో నరేంద్రమోడీలో ఆత్మవిశ్వాసం వస్తే ఆ తర్వాత వరసగా రాష్ట్రాలలో లభించిన గెలుపు అహంకారం పెంచిందనేది స్పష్టం. ప్రస్తుతం వీడియో కెమేరాలు నేతలను వెంటాడుతూ, ప్రతి సెకండ్‌ని కవర్‌చేస్తున్నాయి. తప్పిదాల నుండి నేతలు తప్పించుకోలేరు.

త్రిపురలో కమ్యూనిస్టులను ఓడించిన బిజెపిలో ఆ అహం మరింత స్పష్టమైంది. బిజెపిలోని ఒకనాటి అగ్రనేతలంతా నేటి నేత నరేంద్రమోడీకోసం వేచివుండటం ఆ పార్టీ క్రమశిక్షణకు నిదర్శనమైతే, వేదికమీదున్న నేతలదగ్గరికి వచ్చిన నరేంద్రమోడీ అగ్రనేత అద్వానీ పెట్టిన నమస్కారానికి ప్రతి నమస్కారం చెయ్యకుండా వెళ్ళటం మోడీలో పెరిగిన అహంకారానికి దర్పణం.

అద్వానీ లేకుంటే నరేంద్రమోడీ రాజకీయ జీవితం లేదు. పార్టీ వేదికలమీద అవసరమైనప్పుడు విమర్శించాడు మోడీ. మద్దతు పలికాడు ఎల్.కె. అద్వానీ. పెద్దరికంలో బాధ్యతగా అద్వానీ చేసిన వాటిని మోడీ వ్యక్తిగతంగా తీసుకుని, ప్రతి నమస్కారంకూడా చెయ్యకుండా ప్రదర్శించిన నిర్లక్ష్యం బిజెపిలోని అహంకార ధోరణికి నిదర్శనం. ఇది పార్టీకి, మోడీకి కూడా మంచిది కాదు. ◆

## హరీష్ రెడీనా!

**టి.**ఆర్.ఎస్. రెండు వర్గాలుగా అంతర్గతంగా చీలిందని, అందులో ఒక వర్గం బి.జె.పి. అధ్యక్షుడు అమిత్‌షాతో టచ్‌లో ఉన్నారన్న సందేహం టి.ఆర్.ఎస్. అధినేత మనసులో ఉందట.

అందుకే ఆయన జాతీయ ప్రత్యామ్నాయ ప్రకటన చేసి బిజెపికి చెక్‌పెట్టే యత్నం మొదలు పెట్టాడు. టి.ఆర్.ఎస్. లోని ఒక వర్గం హరీష్ రావుని తిరుగుబాటుకు రెచ్చగొడుతోంది.

నాలుగేళ్ళు దాటినా ఎటువంటి పదవి దక్కని ఎమ్.ఎల్.ఎ.లు దాదాపుగా 40 మందిదాకా హరీష్ రావు వెనక నిలబడేందుకు సిద్ధంగా ఉన్నారు. ఆ నలభైమంది ధైర్యంగా నిలబడితే వచ్చే ఎన్నికల సమయానికి మిగతా తతంగం నేను నడిపిస్తా కదా అంటూ అమిత్‌షా హామీ ఇస్తున్నాడు.

బి.జె.పి.కి ఉన్న ఆర్థికబలం తిరుగుబాటు వర్గానికి అండగా నిలబడుతుంది. హైదరాబాద్ సిటీ, ఇతర పట్టణ ప్రాంతాలలో బి.జె.పి.కి ఉన్న బలం టి.ఆర్.ఎస్. తిరుగుబాటు వర్గానికి బదిలీ చెయ్యగలమన్నది ఢిల్లీ వర్గాల ధీమా. ◆

## తర్వాత ఏమిటి!

**బి.**జె.పి.ని ఆంధ్రులకు అన్యాయం చేసిన పార్టీగా చూపించి ఆంధ్రుల మనసుల్లోని ఆగ్రహాన్ని తనకు అనుకూలంగా మలచుకోగలమని చంద్రబాబునాయుడు అనుకుంటున్నాడు.

చంద్రబాబునాయుడు సంవత్సరం ముందే తెగతెంపులు ప్రకటించి తమకు కోలుకునే అవకాశమిచ్చాడని బి.జె.పి. భావిస్తున్నది.

ఇక ఇప్పుడు టి.డి.పి. మీద పూర్తిస్థాయిలో విరుచుకుపడగల నాయకత్వం బి.జె.పి.లో చురుకుగా వ్యవహరిస్తుంది. చంద్రబాబు ప్రత్యేక హోదా విషయం మార్చిన స్వరాలమీద ప్రచారం చేస్తారు. అయితే రాజకీయ ఎత్తుగడలలో ఆరితేరిన చంద్రబాబు బి.జె.పి.కి ప్రజలలో స్వేచ్ఛగా తిరిగే అవకాశం ఇస్తాడా అనేది సందేహమే.

ఆ పార్టీని ఎక్కడ నొక్కాలో అక్కడ నొక్కుతా కదా అని తన పార్టీవాళ్ళకు చెపుతున్నాడట. అయితే ఆంధ్ర ఎన్నికల్లో బి.జె.పి.కి పొయ్యేది ఏదీ లేదు. టి.డి.పి.కే ఇబ్బంది. ◆

## బయటకొస్తున్నాయి

**అ**మెరికాలోని విశ్వవిద్యాలయ విద్యార్థులతో రాహుల్‌గాంధీ మాట్లాడుతున్నప్పుడు 2009 ఎన్నికల్లో విజయంతర్వాత కాంగ్రెస్ పార్టీ వారిలో అహంకారం పెరిగి పార్టీని దెబ్బతీసిందని చెప్పాడు. ఇప్పుడు సింగపూర్‌లో విద్యార్థులతో మాట్లాడుతూ కాంగ్రెస్ ఓటమికి మరో రెండు కొత్త కారణాలు చెప్పాడు రాహుల్‌గాంధీ.

అందులో ఒక కారణం పాత, కొత్త తరం వారికి మధ్య ఎత్తుగడల విషయంలో విభేదాలు ఉన్నాయన్నాడు. కాంగ్రెస్ ప్రభుత్వంలో అవినీతి పెరిగిపోవటం కూడా ఓటమికి కారణమట.

ఇక సోనియాగాంధీ మరో అడుగు ముందుకు వెళ్ళి తమ పార్టీని ముస్లిమ్‌ల కొమ్ముకాసే పార్టీగా బి.జె.పి. ప్రజలలో ప్రచారం చేసి ఒప్పించి కలిగినందున ఓడిపోయామని అన్నది.

కాంగ్రెస్ పెద్దలకు ఓటమి కారణాలు తెలుసు కాని వాటిని చక్కదిద్దే ఆలోచన కనిపించకపోవటమే కాంగ్రెస్ కార్యకర్తలకు అర్థంకాని విషయం. ◆

## ఎన్నికల స్నేహాలు

ప్రతిపక్ష పార్టీలు 2019 ఎన్నికలకు రిహార్సల్స్ మొదలుపెట్టాయి. ఆ ఎన్నికల్లో బి.జె.పి.ని ఎదుర్కొని ఓడించకుంటే తమ రాజకీయ మనుగడ కష్టమవుతుందని భావించిన పార్టీలన్నీ ప్రస్తుత రాజ్యసభ ఎన్నికలను తమ ప్రయోగాత్మక వేదిక చేసుకుంటున్నాయి.

ఉత్తరప్రదేశ్‌లో బి.ఎస్.పి., ఎస్.పి. పార్టీలు చేతులు కలపటం ఊహకు అందని విషయం. అటువంటిది లోక్‌సభ ఉప ఎన్నికలో ఒకరికొకరు సహకరించుకుని ఆ సహకారాన్ని రాజ్యసభ ఎన్నికలకు తీసుకువెళ్ళారు.

బెంగాల్‌లో మమతాబెనర్జీ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి మను సింఘ్వీని గెలిపించే బాధ్యత తీసుకుంది. అందుకోసం వామపక్షాలను దూరంగా పెట్టటానికి తృణమూల్ కాంగ్రెస్, కాంగ్రెస్‌లు ఏమాత్రం మొహమాటపడలేదు.

ఇటువంటి ప్రతిపక్ష ఐక్యతనే దాదాపుగా అన్ని రాష్ట్రాలలోని బి.జె.పి. వ్యతిరేక పార్టీలు ప్రదర్శిస్తున్నాయి. ఎలాగైనా బి.జె.పిని ఓడించాలన్నదే ఈ ఎన్నికల స్నేహానికి మూలం.



## రామచంద్ర ప్రార్థన

మాతా రామో మత్పితా రామచంద్రః
స్వామీ రామో మత్సఖా రాఘవేశః।
సర్వస్వ మ్మే రామచంద్రో దయాలుః
నాన్యం దేవం నైవ జానే న జానే॥

తల్లిలా, తండ్రిలా, యజమానిలా, స్నేహితునిలా పరమదయతో నన్ను నిరంతరం రక్షిస్తూ ఉండే రామచంద్రుడే నా సర్వస్వం. ఆ కారణంగా మరో దైవం నాకు తెలియదు-అవసరంలేదు కూడ! □

## హనుమంతుడి చోటు

యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర
కృతమస్తకాంజలిమ్।
బాష్పవారి పరిపూర్ణ లోచనం మారుతిం
నమత రాక్షసాంతకమ్।

ఎక్కడెక్కడ రాముని గురించి కీర్తించబడుతూ ఉంటుందో అక్కడక్కడ ఆనందబాష్పాలతో హనుమ ఉంటాడనేది దీనర్థం.

దీన్ని విని- 'రామభజన ఎక్కడ సాగినా అక్కడ హనుమ ఉంటాడన్నమాట!' అనుకోకూడదు.

ఆ రామ భజన నా హృదయంలోనే సాగిన పక్షంలో నా హృదయంలోనే హనుమని ఉంచుకో వీలవుతుంది గదా!' అని భావించాలి. అలా ప్రయత్నించి సాధించుకోవాలి. □

## సహనవతులు

సంతానాన్ని కని ఆమె తల్లిగా, ఆయన తండ్రిగా అయినా ఆడపిల్లలకిమాత్రం తల్లి లక్షణాలే సంపూర్ణంగా వస్తాయి. (మాతర మంగనాః) సీతమ్మకి అంతటి ఓర్పు రావడానిక్కారణం సహనానికి మారుపేరైన భూదేవి కూతురు కావడంవల్లనే.

అలానే కురుక్షేత్ర యుద్ధమే సరైనది తప్ప శాంతి పూర్వకమైన సంధిని చేసుకోవడం సరికాదని ద్రౌపది చెప్పడానిక్కారణం ఆమె యజ్ఞంలోని అగ్నికుండం (శౌర్య ప్రతాప సాహస బుద్ధి శక్తులకి ప్రతీక) నుండి పుట్టింది కావడంవల్లనే.

వివాహాన్ని చేసుకోదలిచిన వరుడు తనకి కాబోయే అత్తగారి లక్షణాలని గమనించుకోగలిగితే చాలు తన భవిష్యత్తు తెలుస్తుంది తనకి. □

## తప్పు పాండురాజుదే!

తన అన్న అయిన ధృతరాష్ట్రుడు గుడ్డివాడైన కారణంగా రాజ్యార్హత లేకపోయిందని గ్రహించాడు తమ్ముడైన పాండురాజు.

అన్నమీది గౌరవంతో 'సింహాసనంమీద నువ్వే ఉండు! రాజ్యాన్ని నేను ఏలుతూ విస్తరింపజేస్తూ ఉంటా'నన్నాడు పాండురాజు.

మొదట్లో 'సరికా'దని భావించిన ధృతరాష్ట్రుడు, కొంతకాలానికి 'బాగా ఉంది' అనుకుని, మరి కొంత కాలానికి ఇలా వచ్చిన సింహాసనాన్ని ఎందుకు ఖాళీ చేయాలని అనుకుని, చివరికి తన పుత్రులకే అందించాలని భావించాడు.

ఫలితంగా నూరుగురు పిల్లల్నీ తన కళ్ళ ఎదురుగా చనిపోయేలా చేసుకున్నాడు.

తనదైన సింహాసనాన్ని అన్న అయితే కావచ్చుగాని, ధృతరాష్ట్రునికి కట్టబెట్టడమనేది పాండురాజు చేసిన తప్పే ముమ్మాటికీ. □

## నిజమైన దీవెన

కౌత్సుడనే పేరున్న వేదవిద్యార్థి తన గురువుకి 14 కోట్ల బంగారు నాణాలు గురుదక్షిణని ఈయ వలసివచ్చాడు. ఆ కాలంలో రాజ్యం చేస్తున్న రఘు మహారాజు రాజసూయయాగాన్ని చేసి తన సంపద మొత్తాన్ని దానంచేసేసి ఉన్నాడు.

కౌత్సుడా రాజుని చూస్తూనే వెళ్ళిపోబోతుంటే రఘు మహారాజు ఆ కౌత్సుణ్ణి తన భవనంలోనే ఉంచుకుని కుబేరుని నుండి ఆ సొమ్మును రప్పించుకుని కౌత్సునికిచ్చేశాడు.

ఆ సమయంలో కౌత్సుడు- రాజా!

ఇంతటి సహాయాన్ని చేసిన నీకు కృతజ్ఞతగా ఏం ఆశీస్సుని ఇయ్యాలి?

రూపం, సంపద, అధికారం... అన్నీ నీకు న్నాయి కాబట్టి- ఇంతటి సత్పుత్రుణ్ణి నీ తండ్రి ఎలా కన్నాడో అలా నీకూ అంతటి సత్పుత్రుడూ కలగాలని ఆశీర్వదిస్తున్నాను. ఇదే నిజమైన దీవెన.

{ అహింసయే శ్రేష్ఠమైన ధర్మం. }

# ఈ తరం అమ్మాయిలు

సమాజంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా ఆలోచనలు, అలవాట్లు, పద్ధతులు వుంటాయి. ఇవి ఆడ,మగలకు వర్తించే సూత్రాలు. అయితే ఆడ వారిలో వచ్చే మార్పు సమాజంమీద అధిక ప్రభావం చూపుతుంది. మొత్తం కుటుంబాన్ని ప్రభావితం చేస్తుంది. ఆడవారిలో మార్పువస్తే సమాజంలో మార్పు వచ్చినట్లన్నది నానుడి.

మరి 21వ శతాబ్దపు అమ్మాయిల ఆలోచనలు ఎలా వున్నాయి. సమాజం ఎంతగా మారిందని అను కున్నా ఎప్పటికీ నిలిచేవి వ్యక్తిగత, ఆర్థిక సంబం ధాలు. అటువంటి సంబంధాలలో ఎటువంటి మార్పు వచ్చింది. ఆ విషయం నేరుగా వారి నోటినుండే తెలుసుకుంటే బాగుంటుంది కదా అనే ఆలోచనతో చేసిన ఒక సర్వేలో ఆడవారి అభిప్రాయాలు స్పష్ట మయ్యాయి. మార్పు వున్నది వారిలో.

అలాగని సాంప్రదాయాన్ని కాదనుకోవటంలేదు. కట్టుబాట్లు అవసరం అనుకున్నచోట పాటిస్తున్నారు. ఆర్థికస్తోమతకు విలువ ఇవ్వటం లేదు. భావోద్వేగాలను చూసి అర్థంచేసుకుని అండగా నిలిచే వాడు, అన్ని సందర్భాలలో తనకు ప్రాధాన్యత నిచ్చి, నలు గురిలో మర్యాదను కాపాడే వాడు, సంసారసుఖంలో లోటు రానివ్వనివాడు మొగుడుగా రావాలన్నది వారి కల.

కేవలం 14-15% మంది మాత్రమే మొగుడు సంపన్నుడై వుండాలని అనుకుంటూండగా కేవలం ఒక్కశాతం అమ్మా యిలు అందగాడిని పక్కన కావాలనుకుంటున్నారు.

అయితే ప్రేమలో పడటం, ప్రేమించినవాడిని పొందటంలో



## శారీరక, మానసిక ఆనందం అందించే మొగుడు కావాలి — స్పష్టమైన ఆలోచనల్లో

స్వేచ్ఛను హరించేవాటిని ధిక్కరిస్తున్నారు. ప్రేమ, పెళ్ళి, సెక్స్ అంశంలో కొత్త ఆలోచనలు చేస్తున్నారు. డబ్బు విషయంలో అవగాహన పెరిగింది.

ఉద్యోగం ఏది అయినా రెడీ అంటున్నారు. ఇది నిజంగానే మారిన తరం. 21వ శతాబ్దపు అమ్మాయిలు దాపరికం లేకుండా చెప్పిన నిజాలు.

### ప్రేమ

ప్రేమమీద మక్కువ పెరిగింది ఈ తరానికి. తమకు కావాల్సినవాడిని తాము ఎంచుకోగలమన్న ధైర్యం వుంది. అంతేకాదు ప్రేమలో కొంతకాలం హాయిగా గడిపిన తర్వాతే పెళ్ళివైపు అడుగులు వేస్తా మంటున్నారు. అటువంటివారిలో దాదాపుగా 50% మంది తిరిగి ఎటువంటి తోడు అనే దగ్గర గందర గోళానికి గురవుతున్నారు.

తాము కోరుకుంటున్న భాగస్వామిలో వుండాల్సిన లక్షణాల విషయంలో స్పష్టత వుంది. అయితే అది పెద్దలు కుదిర్చిన సంబంధంలోకన్నా భిన్నమైనది కాదు. తమ అమ్మాయిని ఎలా చూసుకుంటాడో కుర్రాడు అనేదానికే ఆడపిల్లల తల్లిదండ్రులు విలువనిస్తారు. అమ్మాయిని సుఖపెట్టేవాడు అల్లు డిగా రావాలని కోరుకుంటారు. అమ్మాయిలు కూడా తాము కోరుకునే విషయాలు అవేనని చెప్పారు.

దాదాపు 84% మంది అమ్మాయిలు తమ శారీరక, మానసిక సుఖాలను తీర్చగలిగిన మొగుడు కావాలని కలలుకంటున్నారు. అందానికి విలువ నివ్వటంలేదు. చొరవచూపలేకపోతున్నారు. బంధువులు, స్నేహితుల ద్వారా పరిచయమైనవారిలో తగిన వరుడిని ఎంచు కుంటామని 50% అమ్మాయిలు చెప్తారు.మరో 48% మంది జీవితభాగస్వామి ఎంపిక పెద్దలకు వదిలివేస్తు న్నారు. నలుగురైదుగురిని చూపించి అందులోతమకు నచ్చినవాడిని ఎంచుకోమని పెద్దలు స్వేచ్ఛ ఇవ్వాలే కాని ఫలానావాడిని చేసుకో అని బలవంతం చెయ్య కూడదు అనేది అమ్మాయిల అభిప్రాయం.

తన వ్యక్తిత్వం తాను కాపాడుకుంటూ, భార్య వ్యక్తిత్వానికి భంగం రానివ్వని భర్త దొరకటం ఒక అదృష్టమని అమ్మాయిలు భావిస్తున్నారు.

వెబ్‌సైట్స్‌ద్వారా, మాట్రిమోనియల్, సోషల్ మీడియాలద్వారా ఎంచుకునే మగవాడి విషయంలో ఆ తర్వాతి కాలంలో నిరుత్సాహం మిగులుతుందన్న భయం అమ్మాయిలది.

అందుకే 20% తప్పించి ఎక్కువమంది సోషల్ మీడియాద్వారా ప్రేమ, పెళ్ళికి మొగ్గుచూపటంలేదు. తాము ప్రేమలోపడిన విషయం, తాను ఎంచుకున్న భాగస్వామి వివరాలను వెనువెంటనే తెలియచెప్పేం దుకు అమ్మాయిలు అంతగా ఇష్టపడటంలేదు.

స్త్రీపురుషసంబంధాలు గోప్యంగానే వుండి తీరా లన్నది వారి అభిప్రాయం. అందుకే 78% అమ్మా యిలు తమ ప్రేమ, ప్రియుడి వివరాలు కాని, అత నితో గోప్యంగా చేసే పనులను ఎవరితో పంచుకోవ టానికి ఇష్టపడటంలేదు. తమ ప్రేమలోని కష్టాలు, సుఖాలు రెండూ తమకే సొంతం. బయటపెట్టుకుంటే లోకువ అవుతామన్న సాంప్రదాయ ఆలోచనలోనే అమ్మాయిలు వున్నారు.

### పెళ్ళి

పెళ్ళి చేసుకోవాలా వద్దా! పెళ్ళితో తమకు కలిగే లాభం ఏమిటి! నష్టంఏమిటి! అనే అంశాలమీద ఈ తరం అమ్మాయిలలో ఒక స్పష్టమైన అభిప్రాయం లేదు. అయితే ఒకింత సంశయం మాత్రం వుంది. అమ్మాయిలు చదువులో ఎదిగారు. సామాజికంగా ఎదిగారు.వృత్తిలో ఎదుగుతున్నారు. కాని ఆలోచనల్లో సాంప్రదాయాలకే విలువ ఇస్తున్నారు.

పాతదంతా తప్పుకాదు, కొత్తదంతా గొప్పది కాదు అన్నదే భారతీయ యువత మాట. సాంప్ర దాయాలను, కట్టుబాట్లను ఎప్పటికప్పుడు సవరించు కుంటూ, అవసరమైతే ఛేదించుకుంటూ, తనకు అవసరమైన మేర సరిచూసుకుంటూ ముందుకు వెళ్ళటమే సరైన జీవితం అంటున్నారు.

వివాహ వ్యవస్థలో లోపం లేదు. వివాహ బంధం పవిత్రమైనదే. వివాహ జీవితంలో ఎదురయ్యే ఒడు దుడుకులను తట్టుకుని ముందుకు వెళ్ళలేని అమ్మా యిలు, అబ్బాయిలదే లోపం అన్నది నేటి మగువల మాట. అందుకే 42% మంది అమ్మాయిలు నేటి వివాహ వ్యవస్థవైపే మొగ్గుచూపారు. ఐతే ప్రతి నలు గురిలో ఒకమ్మాయి వివాహవ్యవస్థ అనేది అర్థంలేని దని అది ఎంతత్వరగా అంతమవుతే అంత మంచి దని అంటున్నారు. కాని దాదాపుగా 33% మంది

అటూఇటూ కాని అభిప్రాయంలో వున్నారు.

అవన్నీ వారి వ్యక్తిగత జీవితాలలో, కుటుంబ సభ్యులు లేదా స్నేహితుల జీవితాలలో విన్నా లేదా చూసిన చేదు అనుభవాలనుబట్టి అటూఇటూగా వుంటున్నాయి. సరైన తోడు దొరికితే వివాహ జీవితం


Courtesy : Unishkuri

మధురం లేకుంటే ఇబ్బంది కాబట్టి ఏమీ చెప్పలేమన్నది వారన్నమాట.

టీనేజ్ నుండి 25 ఏళ్ళలోపు ఇల్లు వదిలి, తల్లిదండ్రులకు దూరంగా వుండాలని 58% అబ్బాయిలు భావిస్తున్నారు. పాతిక, 30 ఏళ్ళ మధ్య పుట్టింటినుండి బయటపడటం బాగుందని 27% మంది అమ్మాయిలు అనుకుంటున్నారు.కాని వీరంతా కూడా తల్లిదండ్రులంటే తమకు బాగా ఇష్టమేనని చెప్పారు.

## సెక్స్ సంబంధాలు

ప్రేమ, పెళ్ళి ఆపైన సెక్స్ తప్పనిసరి. ఇది ఒక వర్గం అమ్మాయిల అభిప్రాయమైతే, ఆ రెండింటికీ ఆవల సెక్స్‌కి సిద్ధమే అని మరోవర్గం అంటున్నది.

అయితే వివాహానికి ముందు సెక్స్ అనుభవానికి సిద్ధంకారని దాదాపు 80%అమ్మాయిలు స్పష్టంచేశారు. 20% మంది మాత్రమే ఏమవుతుంది ఒకసారి సెక్స్ అనుభవంపొందితే అనేఅభిప్రాయం వెలిబుచ్చారు.

తమ శరీరంమీద హక్కు తమది.అందులో సెక్స్ విషయం కూడా. ఎలా సెక్స్‌ని అనుభవించాలనేది తమకు ఎవరూ చెప్పనవసరంలేదని, తమంత తాము నిర్ణయాలు తీసుకోగలమనిచెప్పినా, విచ్చలవిడి సెక్స్‌కి మాత్రం అమ్మాయిలు సిద్ధంగా లేరు.

కారణం ఏదైనా ఎవరితో పడితే వారితో సెక్స్ సంబంధాలకు వారు సిద్ధంకారు. అబ్బాయిల సెక్స్ ఆరోగ్యం తమకు చాలా ముఖ్యం అని దాదాపు 90% అమ్మాయిలు చెప్పారు. విచ్చలవిడి లైంగిక సంబంధాల అబ్బాయిల్తో కలిసి తమ ఆరోగ్యాన్ని చెడగొట్టుకోలేమని కరాఖండిగ చెప్పారు.

తనవాడిని మరొక మగువతో పంచుకోవటం కుదరనే కుదరదు. మొగుడనేవాడు తనకే సొంతం అయివుండాలి. ఆ విషయంలో రాజీలేదని 87%అమ్మాయిలు చెప్పారు.

అదే సమయంలో తమకు ఒక మగాడితో సంబంధం చాలని, అన్నీ భర్తతోనే అని కూడా 87% మంది చెప్పారు.

## ఉద్యోగం, డబ్బు

అమ్మాయిలు చదువుకున్న తర్వాత తగిన ఉద్యోగం కావాలని కోరుకోవటంలో ఎటువంటి తప్పులేదు. తమకు బాగా ఇష్టమైన ఉద్యోగం దొరికితే చాలా బాగుంటుందని 72% మంది అమ్మాయిలు భావిస్తున్నారు. అటువంటి ఉద్యోగం దొరికేవరకు ఏదో ఒక ఉద్యోగం చేస్తామన్నారు.

తాము పనిచేసేచోట వుండే వాతావరణానికి, జీతానికి సమప్రాధాన్యతనిస్తామని చెప్పగా, ఉద్యోగ బాధ్యతకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తామని చెప్పారు.

ఉద్యోగంచేసే అమ్మాయిలు ఇంటిని పట్టించుకోరు అనేమాటల్ని అమ్మాయిలు కొట్టిపారేస్తున్నారు. తమ బాధ్యతలు తమకు తెలుసని, ఆ బాధ్యతలు, ఉద్యోగాలను జాగ్రత్తగా చేసుకోగలమన్న ధైర్యం దాదాపుగా 68% మంది అమ్మాయిల్లో వుంది.

ఆర్థిక ఇబ్బందులు లేకుండా జీవితం గడపాలని, ఆర్థిక స్వాతంత్ర్యం కలిగివుండాలని 96%మంది అనుకుంటున్నారు. అందుకోసం ఆదా విషయాలు తెలుసుకుంటున్నారు.

అందం పెంచే సామాగ్రిమీదకన్నా ఆకర్షణతో కనిపించే మేకప్ సామాగ్రి మీదికి తమ ఖర్చు మరలుస్తున్నారు. సొంత ఇంటికల అమ్మాయిలకు వుంది. తన ఇల్లు తనకు నచ్చినరీతిలో అలంకరించుకోవటం వారికి బాగా ఇష్టం. అందుకే ఉద్యోగంలో చేరినప్పటి నుండి ఆదా చేయటం మొదలుపెడుతున్నారు.

పాతికేళ్ళకు అటూఇటూగా ఆదా ఆలోచనను చేస్తున్న అమ్మాయిలశాతం 98గా వుంది. ఎలా పెట్టుబడులు పెట్టాలి, ఎందులో పెట్టుబడులు పెట్టాలి అనే అంశంలో సొంత ఆలోచనలకన్నా అనుభవజ్ఞులను కలిసి వారి సూచనలతో మ్యూచ్యువల్ ఫండ్స్, ఇన్సూరెన్స్, ఆరోగ్య బీమా వంటి వాటిలో పెట్టుబడులు పెడుతున్నారు.

# అమ్మాయిలు అందానికి, ఆరోగ్యానికి ప్రాధాన్యత ఆర్థిక అంశాలలో కొత్తమార్గాలు



## ఆరోగ్యం

ఆరోగ్యంమీద శ్రద్ధ పెరిగింది ఈ తరానికి. ఏదో ఒక రకమైన వ్యాయామంచేసి తమ శరీర రూపాన్ని అదుపులోపెట్టుకోవాలన్న కోరిక అందరిలో వున్నప్పటికీ సగం శాతంమంది మాత్రమే వ్యాయామం క్రమంతప్పక చేస్తున్నారు.

ఆరోగ్యంకోసం ఆహారపు అలవాట్ల విషయంలో జాగ్రత్తలు పాటిస్తున్నారు.దీర్ఘకాలిక రోగాల బారిన పడకూడదన్న ఆలోచన వుంది. అనారోగ్యాలకు, జీవన విధానానికి వున్న సంబంధం అర్థంచేసుకున్న తరం ఇది. అందుకే ఆరోగ్యకర జీవన విధానానికి ప్రాధాన్యతనిస్తున్నారు.

సాంకేతిక పరిజ్ఞానం పెరిగిన తరం కాబట్టి కొత్త కొత్త పరికరాలు ఉపయోగిస్తున్నారు. వాటిద్వారా ఫిట్‌నెస్ టెక్నిక్‌లు నేర్చుకుంటున్నారు. నిపుణులతో సంప్రదింపులు చేస్తున్నారు. తోటివారినుండి సలహాలు తీసుకుంటున్నారు. నైతికతను దిగజార్చుకోకుండా, కొత్తతరం అమ్మాయిలు హాయిగా, స్వతంత్రంగా జీవించాలని కోరుకుంటున్నారనేది స్పష్టం. తరం మారిందనే దానికి సంకేతం ఇది.

కె.సుదర్శన్

స్వాతి సపరివార పత్రిక 30.3.2018


సీరియల్

# మనిషిలో



# సూర్యదేవర రామ్మోహనరావు

E-mail: Suryadevaranovelist@gmail.com

## జరిగిన కథ (19)

తెల్లవారుఝామున మర్మయోగి కార్తికేయను లేపుతాడు. అప్పటికే మర్మయోగి తన శక్తితో అక్కడ ఉన్న కానిస్టేబుల్స్ అందర్నీ స్పృహపోయేలా చేస్తాడు.

మర్మయోగితో ఓ జీప్‌లో పర్లాకిమిడి నుంచి పారిపోతాడు కార్తికేయ.సంస్థానం లాయర్ హరి నారాయణ రాజాగారిని కలుస్తాడు.

హరినారాయణ ఇచ్చిన విల్లు చదివి నిర్ఘాంత పోతారు రాజావారు. రాజావారి తండ్రి రాజా రామచంద్ర గజపతి మహదేవ్ అయోగ్యుడైన నా కొడుకుని ఈ ఆస్తికి వారసునిగా తప్పించి నా మనుమరాలయిన మేఘనా సౌందర్యానంద సహనాదేవిని వారసురాలిగా ప్రకటిస్తున్నాను అని రాసిన విల్లు అది.

ఏదైనా కారణాలవలన సహనాదేవి మరణించినా, వివాహం కాకున్నా ఆస్తి మొత్తం కుమార శక్తిపీఠానికి చెందేటట్లు విల్లు రాస్తాడాయన.

కుమార శక్తిపీఠాధిపతి స్వామి సత్యానందను సంశయించడం మొదలుపెడతారు రాజావారు. అడవిలో అడుగు ఎత్తులో గాలిలో నిలబడి హఠయోగంలో దర్శనమిచ్చిన మర్మయోగిని చూసి విభ్రాంతి చెందుతాడు కార్తికేయ.

కార్తికేయ జీప్‌ని ఛేజ్ చేస్తుంటాడు తన మనుషులతో సాదూభాయ్. ఇక చదవండి.

---

"అవును. చాలా దగ్గరగా... ఓ పాతిక ముప్పై కిలోమీటర్ల దూరం మించదు"

"డామిట్! అడవిలోకి తప్పించుకుంటున్నాడన్నమాట. వదలను. వాడ్ని వదలను" సాదూభాయ్ మాటలు పూర్తిగాకముందే, తిరిగి పరికరంలో రెడ్ స్పాట్ సిగ్నల్ ప్రత్యక్షమయింది. చాలా స్లోగా కదులుతోంది అది. అసిస్టెంట్ చెప్పింది సరిపోయింది.

సరిగ్గా ఈ చర్చ సాగుతూండగా, పదినిమిషాలు ఆలస్యంగా, వాళ్ళని చేరుకుంది కిట్టప్పనాయుడి వర్గం ప్రయాణిస్తున్న వ్యాన్. అందరిముందు వున్న ప్రశ్న ఒక్కటే. ఇప్పుడేం చేయాలి?

సాదూభాయ్‌కయితే జీప్‌ను వెదుకుతూ అడవిలోకి వెళ్ళిపోవాలనుంది. కాని పైన చూస్తే ఆకాశం బాగలేదు. వాతావరణం ఈదురుగాలితో ఉంది. ఏ క్షణమైనా తిరిగి వర్షం పడే అవకాశం ఉంది.

దారి తెన్ను లేని అడవిలో రాత్రిపూట ముందుకు సాగలేరు. లోతట్టు అడవిలో క్రూర మృగాల సంచారం అధికం.

వీటన్నిటికీ మించి రోజంతా ప్రయాణంతో తిండి తిప్పల్లేక అలసిపోయి వున్నారంతా.

ఆకలి బాధ. అందరికోసం తన మనసు మార్చుకోక తప్పలేదు సాదూభాయ్‌కి.

అక్కడికి ఎగువన పది కిలోమీటర్ల దూరంలో ఛోటారామ్ నగర్ అనే ఊరు వుంది. అక్కడ భోజన హోటళ్ళు, లాడ్జీలు కూడా ఉన్నాయి. మందు పుష్కలంగా దొరుకుతుంది.

రాత్రికి అక్కడ స్టే చేసి ఉదయం అడవిలోకి బయలుదేరాలని నిశ్చయించుకున్నారంతా. ఆ తర్వాత వాహనాలు రెండూ ఛోటారామ్ నగర్ దిశగా శరవేగంతో పరుగుతీశాయి.

మరునాడు వేకువనే మర్మయోగివెంట బయలుదేరాడు కార్తికేయ. రాత్రంతా కుండపోతగా కురిసిన వాన అర్ధరాత్రి దాటాక ఎప్పుడో ఆగింది. ఆకాశంలో మబ్బులు కూడా పలచబడ్డాయి.

ఉదయపు చలిగాలి జివ్వున వీస్తోంది. రాత్రి నిశాకన్య ఆరవేసిపోయిన ధవళవస్త్రాలన్నట్టు తెల్లని పొగమంచు ముద్దలు వృక్షశాఖలవెంట కనిపిస్తున్నాయి. క్రూరమృగాల అరుపులు,పక్షులు పలుకుతున్న ఉషోదయ స్వాగతాలతో అడవంతా సందడిగా ఉంది.

నిన్న సాయంత్రం మూడు గంటలకి హైవే నుంచి అడవిలోకి చొరబడిన జీపు పోను పోను దుర్గమారణ్యంలోకి ప్రవేశించింది. చీకటి పడకముందే వర్షం ఆరంభించింది. దారి తెన్ను లేని అడవి.



ఇసుకనేల రాతి ప్రదేశాల ప్రాంతం గావటంతో జీపు ఏ బురదలోనో కూరుకుపోతుందన్న భయం లేదు. కాని దట్టమైన పొదలు, చెట్లుచేమల్ని దారి చూసుకొని హెడ్‌లైట్ల కాంతిలో ముందుకు సాగటం చాలా కష్టం. ఆపైన వానకి చిన్న చిన్న సెలయేళ్ళు కూడా ఉధృతంగా ప్రవహించటంతో దాటిపోవటం మరింత కష్టం.

రాత్రి సుమారు ఎనిమిదిగంటలకుగాని ఆ కొండ ప్రాంతాన్ని చేరుకోలేకపోయారు.

జీప్‌ను ఆ కొండపాదంవద్దే ఆపేశాడు కార్తికేయ. వెంట తెచ్చుకున్నవే తిని జీప్‌లోనే నిద్రపోయారు. వేకువనే లేచి బయలుదేరారు.

జీప్‌ను దట్టమైన చెట్లు పొదలవెనక వుంచి అద్దాలు లేపి లాక్ చేశాడు. ఎవరికీ జీప్ కనబడకుండా కొమ్మలు నరికి మూసేశాడు. ఆ విధంగా తగిన జాగ్రత్తలు తీసుకున్నాకే ముందుకు సాగారు.

చూస్తుంటే కొండల వరుసలో చివరి కొండలా ఉంది అది. చాలా ఎత్తుగా ఉంది. కొండ పాదంవెంట ఎడంపక్కగా చుట్టి, అలవాటయిన దారిలో చకచకా నడుస్తున్నాడు మర్మయోగి.

గుడ్డిగా అనుసరిస్తున్నాడు కార్తికేయ. చాలాసేపు నడిచి కొండ పశ్చిమ భాగానికి చేరుకున్నారు. అప్పటికి సూర్యోదయమైంది. ఎదురుగా ఒక అద్భుత దృశ్యం గోచరించింది.

అరఫర్లాంగు దూరం అర్ధచంద్రాకృతిలో ఒక పెద్ద జలపాతం ఉంది అక్కడ.

తాము చుట్టివచ్చిన కొండమీద సుమారు రెండు వందల మీటర్ల ఎత్తునుంచి ఉధృతంగా పొంగి, నీరు దిగువన మడుగులోకి దూకుతోంది.

జలపాతం హోరు దారిలో ఉండగానే, విన్పించింది. ఆ ప్రాంతమంతా అనేక ఫలవృక్షాలు, ఎన్నడూచూడని పూలజాతి చెట్లతో నిండివుంది.

కార్తికేయను సరాసరి మడుగు నీటివద్దకు తీసుకు వెళ్ళాడు మర్మయోగి. "రా నాయనా! త్వరగా స్నానాదికాలు ముగిస్తే గురుసన్నిధికి పోదాం" అన్నాడు మర్మయోగి.





ఎదురుగా అద్భుతమయిన జలపాతం, దానికి అడ్డంగా మడుగుమీదుగా ఎగిరిపోతున్న కొంగల బారులు, ఎవరో చిత్రకారుడు వేసిన సజీవ జలపాత దృశ్యంలా ఉంది. కాసేపు మైమరిచి అలాగే చూస్తూవుండిపోయాడు కార్తికేయ.

ఇరువురూ, స్నానాధికాలు ముగించుకొని శుచిగా బయలుదేరేసరికి తూర్పున వెలుగురేఖలు విచ్చుకున్నాయి. మడుగు నుంచి రాళ్ళవెంట ఎక్కి పైకి వచ్చారు. "నాతో రా నాయనా. జాగ్రత్త. అడుగులు చూసి వెయ్యి సుమా" అంటూ హెచ్చరించిన మర్మయోగి జలపాతంలోకి దారితీశాడు.

మొదట కార్తికేయకేమీ అర్థంకాలేదు. సరాసరి జలపాతంలోకి వెళితే జారి మడుగులో పడిపోతారు. అక్కడికి ఇంకా యాభై అడుగుల దిగువన ఉంది మడుగు. ఖచ్చితంగా ప్రాణాలు పోతాయి.

కొండపైకో, ఏ కొండ గుహలోకో తీసుకువెళతాడనుకుంటే జలపాతంలోకి దారితీస్తున్నాడు. ఏమిటీ విచిత్రం. ఏమైతే అయిందని ధైర్యంగా మర్మయోగిని అనుసరించాడు.

అక్కడ ఏదో రహస్యం ఉంది. అదేమిటో ఆయన చెపితేగాని అర్థంగాదు. క్రమంగా జలపాతాన్ని చేరుకున్నాక కార్తికేయ సందేహాలకు సమాధానం లభించింది. అక్కడ జాలువారుతున్న జలపాతం వెనకనుండి కేవలం ఆరు అడుగుల వెడల్పున లోపలికి దారి ఉంది. దగ్గరకు వచ్చి పరిశీలిస్తేగాని ఆ దారి కన్పించదు. ఆ దారంతా నీళ్ళకు పాచిపట్టి అడుగేస్తే జారిపోయేలా ఉంది. కాని నడవడానికి అనువుగా గుంటలు ఉన్నాయి.

ఆ దారిని ఎవరో ఉపయోగిస్తున్నారు. గుంటల్లో పాచి లేదు. మర్మయోగి అడుగుజాడల్లో అడుగు వేస్తూ ముందుకు సాగాడు కార్తికేయ.

ఇటుపక్క పెట్టని కోటగోడలా కొండ, అటుచూస్తే జలపాతం నీరు, చెవులు దిబ్బళ్ళు వేసే జలపాతం హోరు. కార్తికేయకు అంతా కొత్తగానూ, థ్రిల్‌గానూ ఉంది. అప్పుడు కూడా మర్మయోగి తనను ఎటు తీసుకెళ్తున్నాడో, ఎంత దూరం వెళ్ళాలో కార్తికేయకు తెలీదు. తన సందేహాలను మనసులోనే దాచుకొని మౌనంగా అనుసరిస్తున్నాడు.

## మరో అవకాశం

హిందీ సోప్ ఒపెరా తార సిమ్రాన్ పరీంజ మొదటి సినిమా 'కిరాక్ పార్టీ' విడుదలకు ముందే మరో ప్రాజెక్టు పట్టేసింది. శ్రీనివాస్ చక్రవర్తి దర్శకత్వంలో నాగశౌర్య సరసన నటించనున్నది.

సిమ్రాన్ స్క్రీన్ టెస్ట్ దర్శకుడికి బాగా నచ్చిందట. దర్శకుడు తనకు మంచి పాత్రనే ఇవ్వగలడని, ఇచ్చిన పాత్రకు ఖచ్చితంగా న్యాయం చేయగలనన్న విశ్వాసాన్ని సిమ్రాన్ వ్యక్తంచేస్తున్నది.

"స్క్రిప్ట్ చాలా ఎగ్జయిటింగ్‌గా వుంది. కథ చాలా గొప్పగా ఉంది" అంటున్నది.

జలపాతం మధ్య ప్రాంతంలోకొచ్చేసరికి అక్కడ ఒక కొండపగులు కన్పించింది. సరిగ్గా అక్కడ మర్మయోగి చిరునవ్వుతో కార్తికేయను చూశాడు.

కార్తికేయ లోనకు చూశాడు. అంతా చీకటిగా ఉంది. నిలువుగా పగిలినట్టుందిగాని గుహమార్గంలా కూడా లేదు. ఒక మనిషి పోగల ఇరుకైన చోటు.

"కంగారుపడకు నాయనా. వచ్చేశాం. జాగ్రత్తగా నా వెంట రా..." అంటూ లోపలికి దారితీశాడు మర్మయోగి. అది కొండ పగిలిన చోటేగాని, నిజానికి అదో గుహ మార్గం. పొరబాటున ఎవరన్నా అటు వచ్చినా ఆ కొండ పగులుగుండా, దారి ఒక అద్భుతమైన గుహలోకి దారితీస్తుందని ఊహించలేరు.

ఒకరి వెనక ఒకరు, గోడలు పట్టుకుని జాగ్రత్తగా నడవాల్సి ఉంటుంది. మర్మయోగిని అనుసరించాడు కార్తికేయ. వెళ్ళేకొద్దీ చిమ్మచీకటి. కాళ్ళకింద అరడుగు లోతులో నీరు ప్రవహిస్తోంది.

విషకీటకాలు ఏమన్నా వుంటాయేమో తెలీదు. తడబడుతూ మర్మయోగి వెనకే నడుస్తున్నాడు కార్తికేయ. కొంతదూరం పోగానే ఆ మార్గం మలుపు తిరిగింది.

ఆ మలుపులోకి, ఎక్కడినుంచో వెలుగు వస్తోంది. అక్కడికి చేరుకుని మలుపు తిరగ్గానే అక్కడక్కడా వెలుగుతూ కొన్ని కాగడాలు. దారి కూడా నలుగురు నడిచేంత వీలుగా విశాలంగా ఉంది.

కాళ్ళకింద నీరు ఆ మార్గంగుండా ప్రవహిస్తూనే ఉంది. ఏదో కొత్త ప్రపంచం చేరుకుంటున్నట్టుంది కార్తికేయకి. అది ప్రకృతి సహజంగా ఏర్పడిన గుహో లేక మానవ నిర్మితమో అర్థంగావటంలేదు.

కాగడాల ప్రాంతం దాటి మరో మలుపు తిరగ్గానే ఆ దారి సువిశాలమైన ఒక పెద్ద గుహారామంలోకి వారిని చేర్చింది. ఒక్కసారిగా ఆశ్చర్య సంభ్రమాలతో నోట మాటరాక 'బాప్‌రే' అని అనుకొంటూ బొమ్మలా నిలబడిపోయాడు కార్తికేయ.

గొడుగులా విచ్చుకున్న అతిపెద్ద సువిశాలమైన గుహారామం అది. ఎక్కడినుంచి వస్తోందోగాని వెన్నెల వంటి స్పష్టమైన తెల్లని కాంతి అంతటా వ్యాపిస్తోంది. గుహ మధ్యలో ఆరడుగులపైగా ఎత్తుండే పెద్ద శివలింగంచుట్టూ పానవట్టంతోసహా దర్శనమిస్తోంది.

గుహ పైభాగం నుండి ఒక జలధార జాలువారుతూ శివలింగాన్ని సతతం అభిషేకిస్తోంది.

ఆ అభిషేకం నీరే తాము వచ్చినమార్గంలో బయటకి పోతోంది. ఆ నీటిలోంచే తాము నడుచుకుంటూ వచ్చారు. జీవితంలో చూడలేని చాలా అరుదైన దృశ్యం. మనసు పులకిస్తోంది. గుహలో విసిరేసినట్టు తలోచోట రాతి తిన్నెలున్నాయి.

ఆ తిన్నెలమీద నేలమీద గడ్డాలు మీసాలు పెంచి ధవళవస్త్రాలు ధరించి ధ్యానముద్రలో వున్న అనేక మంది యోగులు సిద్ధులు కన్పిస్తున్నారు.

అంతమంది వున్నా నిశ్శబ్దం రాజ్యం చేస్తోందక్కడ. కేవలం ఆరుగురు యువకులు మాత్రం శివలింగానికి పూజాదికాలు ముగించి, నైవేద్యం సమర్పించి యోగులకోసం పాలు, పళ్ళు సిద్ధంచేస్తున్నారు.

వాళ్ళంతా శిష్యులయి ఉండాలి. అదంతా చూస్తూ తననుతాను మర్చిపోయాడు కార్తికేయ. ఏదో సత్యలోకం ఉందంటారు. తాను ఆ లోకంలో ప్రవేశించాడా అన్పించింది. ఇక్కడ 'హరహర మహాదేవ' అంటూ అరుపుల్లేవు. గంట శబ్దాలు, శంఖనాదాలు లేవు.

నిశ్శబ్దం... అంతటా నిశ్శబ్దం. మర్మయోగితో బాటు తనూ, శివలింగానికి సాష్టాంగపడి మనసారా వేడుకున్నాడు కార్తికేయ. లేచి అభిషేక జలాన్ని శిరస్సున జల్లుకున్నాడు. అక్కడినుండి పక్కనే వున్న మరో చిన్న గుహలోనికి కార్తికేయను తీసుకువెళ్ళాడు మర్మయోగి.

ఆ గుహ దివ్యమయిన ప్రకాశంతో వెలిగిపోతోంది... ఆ వెలుగురేఖలు చూడలేక కొద్దిసేపు కనులు మూసుకున్నాడు కార్తికేయ.



మహిళా సాధికారత, సమాన గౌరవం అనేది ఇంటిలో మొదలవ్వాలి.
-పూనమ్ మహాజన్, బి.జె.పి. ఎమ్.పి.

అంతటితో తన డ్యూటీ ముగిసినట్టు, కార్తికేయను లోన ప్రవేశపెట్టగానే నిశ్శబ్దంగా వెనుతిరిగి, శివలింగంవైపు వెళ్ళిపోయాడు మర్మయోగి.

"అక్కడే ఆగిపోయావే.... రా నాయనా. చెంతకు రా..." అంటూ ఒక పిలుపు ఆప్యాయంగా వినబడే సరికి కళ్ళు తెరిచాడు కార్తికేయ.

ఆశ్చర్యం. ఇప్పుడా చిన్న గుహలో సాధారణ వెలుగు మాత్రమే ఉంది. ఎదురుగా ఒక తిన్నెమీద పద్మాసనంలో ప్రశాంతంగా కూచుని కనిపించాడో సిద్ధుడు. ధవళ వస్త్రాలు, నుదుట విభూదిరేఖల మధ్య కుంకుమబొట్టు, రుద్రాక్షమాలలు. చూడగానే నమస్కరించాలనిపించే దివ్యస్వరూపం. చేతులు జోడించి మూగవాడిలా చెంతకు నడిచాడు.

"స్వామీ. సర్వం తెలిసినవారు. అక్కడో జీవి ప్రాణాల కోసం పోరాడుతోంది. ఆమెకు ప్రాణభిక్ష ప్రసాదించండి. నా సంజూని కాపాడండి!" అంటూ ఆయనముందు మోకాళ్ళమీద కూచుని కన్నీళ్ళతో అర్థించాడు కార్తికేయ. బదులుగా ఫకాలున నవ్వాడా యోగిపుంగవుడు.

"న న్ను వెతుక్కొంటూ ఓ రోజు నా చెంతకు వస్తావని నాడే చెప్పితిని గదా, మరిచినావా నాయనా. గుర్తున్నానా?" నవ్వాపి ఆయన అడుగుతూంటే తృళ్ళిపడ్డాడు కార్తికేయ.

వెన్ను జలదరించి గతం గిర్రున తిరిగింది.అంటే... ఆ రోజు రాత్రి బొబ్బిలినుంచి తిరుగు ప్రయాణంలో తమ జీప్‌లో ప్రయాణించింది, సంజూకు తులసిమాలను ప్రసాదించింది మణిసిద్ధుడనే సిద్ధయోగి.

"ఆయనే నేను" కార్తికేయ మనసు చదివినట్టు వెంటనే పలికాడాయన.

"ఆ మణిసిద్ధుడను నేనే. భవిష్యత్తు గ్రహించి ముందు జాగ్రత్తగా ఆ బాలికకు రక్షాకవచంగా తులసిమాలను ప్రసాదించాను. ఒక నయవంచకుని మూలంగా ఆ మాలను పోగొట్టుకొని కష్టాలు కొనితెచ్చుకుంది. మీ రాకుమారి ఇప్పుడు ప్రాణాల కోసం పోరాడుతోంది" అన్నాడు.

"ఆమెకు ప్రాణభిక్ష ప్రసాదించండి స్వామీ. అంధకారంలో కొట్టుమిట్టాడుతున్న మాకు దారి చూపండి. ఎందుకు ఇలా అయిందో కూడా అర్థంగావటంలేదు. నా సంజూను బతికించుకునే మార్గం చెప్పండి..." అంటూ కన్నీళ్ళతో అర్థించి మణిసిద్ధుడి పాదాలచెంత కూచుండిపోయాడు కార్తికేయ.

ఒకింత జాలిగా చూసి కనులు మూసుకున్నాడు మణిసిద్ధుడు.

ఆ రాత్రికి ఛోటారామ్ నగర్‌లో స్టే చేసిన సాదూభాయ్ వర్గం మరునాడు ఉదయమే అడవిలోనికి బయలుదేరింది. అక్కడే కాఫీ, టిఫిన్లు ముగించటంతోబాటు అడవిలో ఏమీ దొరకవుగాబట్టి తగిన ఆహారపు ఏర్పాట్లు చేసుకుని మరీ బయలుదేరారు.

రూట్ ఇండికేటర్ ఆధారంగా కార్తికేయ జీప్‌ను గాలిస్తూ అడవిలో ముందుకు సాగారు.

దట్టమైన అటవీ ప్రాంతంలో, వాహనాలతోసహా ప్రయాణం కత్తిమీద సాములాంటిది.

ఆపైన చిరుతలు, ఎలుగ్గొడ్లు, అడవిదున్నల వంటి క్రూరమృగాల సంచారం కన్పిస్తోంది.

వాహనాలు వదిలేసి, కాలినడకన బయలుదేరితే ప్రాణాలకు గ్యారంటీ లేదు.

అతికష్టంమీద ఎలాగో సాయంత్రం నాలుగు గంటలకు వాళ్ళంతా కార్తికేయ జీప్‌వద్దకు చేరుకోగలిగారు. జీప్ దొరికింది. కార్తికేయ జాడలేదు.

## కల్పిత వార్తలు

పెళ్ళయ్యాక విహారాలు, షూటింగ్‌లతో బిజీగా వున్న బాలీవుడ్ సుందరి అనుష్కశర్మ ఈ మధ్య తాను చెప్పని సంగతులు చెప్పినట్టు వార్తలు రావడంపట్ల తెగ ఫీలయిపోతున్నది.

"'అసలు నాతో ఎవరూ మాట్లాడలేదు. నేనే ప్రశ్నలకూ సమాధానాలూ చెప్పలేదు. కాని, నేనేవో చెప్పినట్టు నా వ్యక్తిగత విషయాలగురించి వ్యాసాలు వచ్చాయి. అవన్నీ కల్పించి రాసినవి.

చూసి షాకయ్యా. ఇలా వ్యక్తిగతం మరొకరివల్ల ఇబ్బందిపడడం సరైన విషయం కాదు. సెన్సేషన్ కోసం నేను చెప్పని విషయాలు రాయడం సబబు కాదు" అంటూ రుసరుసలాడింది.



"ఎక్కడికి పోతావ్రా. ఇక్కడ దాక్కొని పోలీసుల నుంచి తప్పించుకోవచ్చు. కాని ఈ సాదూభాయ్ నుంచి తప్పించుకోలేడు. ఎటు వెళ్ళినా వాడు జీప్ కోసం ఇక్కడికే రావాలి. కనబడగానే కాల్చిపారేద్దాం. అలర్ట్‌గా ఉండండి. ఇక్కడే కాపు వేద్దాం" అంటూ అందరికీ అనౌన్స్ చేశాడు సాదూభాయ్.

"ఈ అనర్థాలన్నిటికీ కారణం, మీ తాతగారు రాజా రామచంద్ర గజపతి మహదేవ్ వ్రాయించిన వీలునామా. అవునా?" చాలాసేపటికి కనులు తెరిచిన మణిసిద్ధుడు అడిగాడు.

"మా సందేహం అదే స్వామీ. కాని అందులో ఏం వ్రాసుందో మాకు తెలీదు"బదులిచ్చాడు కార్తికేయ.

"చెప్తాను. కొడుకు విష్ణుచంద్ర గజపతి మహదేవ్ మీది ద్వేషంతో, విషంకక్కుతూ వీలునామా వ్రాయించాడు మీ తాతగారు.

ఆ విల్లు ప్రకారం తన మనవరాలు మేఘనా సౌందర్యానంద సహానాదేవి ఇరవై అయిదో ఏట అడుగుపెట్టకముందే, తగిన వరునితో పెళ్ళి జరగాలి. అలా చేస్తే పర్లాకిమిడి సంస్థానంలో తొంభైశాతం చర స్థిరాస్తులన్నీ ఆమెకు సంక్రమిస్తాయి. మిగిలిన పదిశాతం శక్తిపీఠానికి చెందుతాయి.

అలాగాకుండా ముప్పై ఏటలోపే రాకుమారి అవివాహితంగా మరణిస్తేఅప్పుడు సంస్థానంలోతొంభై శాతం కుమారశక్తిపీఠానికి, మిగిలిన పదిశాతంమాత్రం కొడుకు విష్ణుచంద్ర గజపతి మహదేవ్ అంటే- నీ మేనమామకు చెందేట్టు రాయటం జరిగింది" అంటూ విల్లు విషయాన్ని వివరించాడు మణిసిద్ధుడు.

అది వినగానే కార్తికేయ నోట మాట రాలేదు. రాజగురువు కృష్ణశాస్త్రి, ఎందుకు సత్యానంద స్వామీజీని అనుమానిస్తూ వచ్చాడో ఇప్పుడర్థమైంది. మణిసిద్ధుడు తన మాటల్ని పొడిగించాడు.

"ఆ వీలునామా ప్రతి మఠానికి చేరినప్పుడే, దాన్ని చదివిన స్వామీజీ మనసులో, విషబీజం నాటుకుంది. తను పీఠాధిపతి కాగానే, సంస్థానం కోసం పావులు కదుపుతూ వచ్చాడు. స్వామి సత్యానంద, స్వామి కాదు. జోగిలా కన్పించే భోగి. కపటి.

వాడిలో భక్తికన్నా రక్తి ఎక్కువ. పీఠాధిపతి బయటికి కన్పించే వేషం మాత్రమే. లోన విలాస జీవితం అనుభవిస్తున్న మోసగాడు. సంస్థానంలో తొంభై శాతం పీఠం వశంకాగానే మొత్తం ఆస్తులు అమ్మేసి వేల కోట్లు విదేశాలకు తరలించి అక్కడే స్థిరపడి, విలాసవంతమయిన జీవితం అనుభవించాలని



ప్రతిపక్ష ఓట్ల చీలికవల్లే బి.జె.పి. గెలుస్తున్నది... ఆ చీలికలను నివారించాలి.

-అభిషేక్ మను సింఘ్వీ, కాంగ్రెస్ నేత

చూస్తున్నాడు..." అంటూ కార్తికేయకు చెప్పడం ఆపాడు మణిసిద్ధుడు.

"అందుకే రాకుమారిమీద మంత్ర ప్రయోగం చేశాడా!" నమ్మలేనట్టు అడిగాడు కార్తికేయ.

"చేయించింది స్వామి సత్యానంద. ప్యాలెస్‌లో అనర్థాలన్నిటికి వాడే సూత్రధారి. చేసినవాడు, భైరవేశ్వర్ అనే మళయాళ మాంత్రికుడు. వాడు చేసింది సాధారణ ప్రయోగం కాదు.

ప్రాణ విఘాతమనే, పురాతన క్షుద్ర ప్రయోగం. అయిదుకోట్ల ఒప్పందంతో వాడీ నీచకార్యం చేశాడు. ప్రాచీన క్షుద్ర విద్యలు తెలిసిన మహా మాంత్రికుల్లో భైరవేశ్వర్‌ని చిట్టచివరివాడుగా చెప్పుకోవచ్చు.

సాధారణ మంత్రవాదులు లోకంలో చాలామంది ఉండొచ్చుకాని ప్రాచీన క్షుద్ర విద్యలు తెలిసినవాడు ప్రస్తుతం వీడు ఒక్కడే.

సత్యానంద, పర్లాకిమిడి రావటానికి మూడు మాసాలముందే వాడి మనుషులు ఇరవైమంది ప్యాలెస్ సెక్యూరిటీలో చేరారు.

ప్యాలెస్‌లో పరిస్థితులకు, ఇద్దరి హత్యలకు కూడా వాళ్ళే కారణం. ఇక వైధవ్యయోగం మిషతో తాంత్రిక క్రతువు చేయించినపుడు, రహస్యంగా రాకుమారి ఫోటోలు తీసుకున్నారు.

ఆమె ధరించే వస్త్ర భాగాలు, గాజులు, చెప్పులు, కాళ్ళకింద మట్టి ఇలా అవసరమయినవన్నీ సేకరించి పట్టుకువెళ్ళి భైరవేశ్వర్‌కి అందించాడు. వాటి ఆధారంగా భైరవేశ్వర్ ప్రాణ విఘాత ప్రయోగం చేశాడు" అంటూ వివరించాడు మణిసిద్ధుడు.



## చిలిపి



'ఈ శీర్షిక మీదే'లో ప్రశ్న, జవాబు రెండూ మీవేనా?
బహుమతి ఇచ్చేదిమాత్రం సంపాదకులు.

మనం మనం కలిస్తే?
జనం!

అద్దెకు తీసుకెళ్ళిన 'స్వాతి'లో చివరి పేజీ చింపుకొని వాపసు తెచ్చావేమయ్యా?
'ఈ శీర్షిక మీదే' అనుందని...

భార్యకూ, ప్రియురాలికీ తేడా ఏమిటి?
ఒకరు ముద్దుగా ఉన్నా రోత అనిపిస్తారు. మరొకరు రోతగా ఉన్నా ముద్దనిపిస్తారు.

పెళ్ళయితే?
ప్రక్కవారి విషయాలు బాగా తెలుస్తాయి.

మనం నవ్వితే నవ్వుతుంది! ఏడిస్తే ఏడుస్తుంది! ఏమిటో అది?
అద్దంలో ప్రతిబింబం!

జేబులో తానుంటే ఇంకొకరిని ఉండనీయనిది?
చిరుగు.

"సంజూ బ్రతకాలి స్వామీ. ఆమె లేకుండా నేను లేను. ఆమెను బ్రతికించుకునే మార్గం చెప్పండి" అంటూ వేడుకున్నాడు కార్తికేయ.

"కష్టం నాయనా. ఆమె బ్రతకదు..." అన్నాడు వెంటనే మణిసిద్ధుడు.

"స్వామీ...."

"అవున్నాయనా. ఆ భైరవేశ్వర్ చేసిన ప్రయోగం అలాంటిది. ఆమెను బ్రతికించుకోవాలంటే నీవు చాలా సాహసం చేయాలి. ఆ ప్రయత్నంలో నీ ప్రాణాలు కూడా పోవచ్చు. వెనుతిరక్కూడదు. నీవల్ల కాదు నాయనా" అన్నాడు.

### నచ్చితేనే చేస్తా

సినిమా చేయడానికి ఎవరు రిఫర్ చేసినా తనకు నచ్చితేనే చేస్తానంటూ ఇలియానా నొక్కి నొక్కి చెపుతున్నది. రైడ్' సినిమాకు అజయ్ నన్ను రిఫర్ చేసిన మాట నిజం.

టోటల్ ధమాల్ 3కి సిఫార్సు చేశాడని వస్తున్న వార్తల్లో నిజంలేదు. ఏదైనా ఓ హీరో సరసన వరసగా రెండు సినిమాలు చేస్తే చాలు పుకార్లు పుట్టుకొస్తుంటాయి. అవన్నీ నిజం కావు. ఇటువంటి పుకార్లు విన్నప్పుడు ఫన్నీగా వుంటుంది.

ఎందుకు ఇటువంటి మాటలు మాట్లాడతారో అస్సలు అర్థంకాదు" అంటూ నవ్వేసింది.

"అలా అనకండి స్వామీ. నా చెలిని బ్రతికించుకోడానికి నా ప్రాణమిస్తాను. కొండంత ఆశతో వచ్చాను స్వామీ. నన్ను నిరాశపర్చకండి"

కాసేపు కళ్ళుమూసుకుని తెరిచాడు మణిసిద్ధుడు. "ప్రస్తుతం నీ రాకుమారి ప్రాణాలు ఇక్కడ లేవు, నరక ద్వారం లోపల పట్టుచిలుక రూపంలో గాజుపంజరంలో బంధింపబడుంది. సదా నిన్ను తలచుకుని దుఃఖిస్తోంది" అన్నాడు.

"అర్థంకాలేదు స్వామీ"

"అర్థంకాదు నాయనా... ముందుగా ఈ ప్రాణ విఘాత క్షుద్ర ప్రయోగం అంటే ఏమిటో నీకు తెలియాలి. చెపుతాను విను. ఏ జీవికయినా శరీరంలో రెండు శక్తులు పనిచేస్తుంటాయి.

ముఖ్యంగా మనిషిలో ఒకటి జీవశక్తి, రెండోది ప్రాణశక్తి అన్నాడు.

జీవశక్తి అంటే జీవించటానికి అవసరమైన శక్తి. అది శరీరంలో సదా పనిచేస్తూంటుంది.

రెండోది ప్రాణశక్తి. ఆత్మ శరీరంలో ప్రవేశించాక ప్రాణశక్తి ఏర్పడుతుంది. మనిషిచేత కర్మలు చేయించేది ఈ ప్రాణశక్తే.

తల్లిగర్భంలో ఏర్పడినపిండంలోకిరెండోమాసంలో ఆత్మ ప్రవేశించాకే ప్రాణశక్తి ఏర్పడి గర్భస్థ శిశువులో కదలిక మొదలవుతుంది. అర్థమైందా?"

"అర్థంకాలేదు స్వామీ" **ఇంకా ఉంది**



పర్సనల్ ఎజెండా

# కాజల్ అగర్వాల్

'చందమామ'రోజుల్నుంచీ కాజల్ అగర్వాల్ కెరీర్ విషయంలో ఆచితూచే వ్యవహరిస్తుంది. ఏదో ఒకటిలే అని ఏది పడితే ఆ పాత్ర ఎంచుకుని చేసేసే తత్వం ఆమెకు లేనేలేదు.

ప్రతి పాత్రలోనూ మెప్పిస్తూ, తెలుగు, తమిళ పరిశ్రమల్లో తనకంటూ చక్కని స్థానాన్ని నిలబెట్టుకోగలిగింది. కెరీర్ నిర్ణయాలు, అందచందాలు గురించి ఆమె చెప్పిన కబుర్లు :

► **పరిశ్రమలో పోటీదారులు :** ఉండొచ్చు. కాని మన పరిశ్రమలో ప్రతిఒక్కరికీ స్కోప్, స్థానం వుంటుంటాయి. కాబట్టి నేను దాన్ని పోటీగా పరిగణించను

► **నా స్థానాన్ని నేను :** ఎప్పటికప్పుడు నా నైపుణ్యాన్ని మెరుగుపరుచుకోవడాన్ని నేను విశ్వసిస్తాను. నాలోని ప్రతిభకు సానపెట్టుకోవడానికి, వీలయినంతవరకు వైవిధ్యం చూపడానికి ప్రాధాన్యం ఇస్తుంటా.ఇవి చాలా ముఖ్యమన్నది నా అభిప్రాయం

► **ప్రాజెక్టుల ఎంపికలో :** పూర్తిగా నా మనస్సు చెప్పింది వింటాను. ముందుగా స్క్రిప్టును విశ్లేషించుకుంటాను. కాని, అన్నింటికంటే ముఖ్యమైనది నా పాత్ర. ప్రేక్షకులపై అది చూపబోయే ప్రభావం. నా సినిమాలు చూసే ప్రేక్షకులపై నేను ఎటువంటి ప్రభావాన్ని చూపుతానన్న విషయంలో నేను చాలా కాన్షస్‌గా ఉంటాను

► **మరోమారు బాలీవుడ్‌లో:** మంచి స్క్రిప్టు, పని దొరికితే చేస్తాను. అయితే ప్రస్తుతం నేను చేస్తున్న పని నాకెంతో సంతోషాన్ని, సంతృప్తిని ఇస్తున్నది

► **నా చర్మ పరిరక్షణ :** నిజాయితీగా చెప్పాలంటే క్లెన్సింగ్, టోనింగ్, మాయిశ్చరైజింగ్ రొటీన్‌ను అనుసరిస్తాను. సువాసనలన్నవి అత్యంత అవసరమని భావిస్తాను. మననుంచి వచ్చే పరిమళాలనుబట్టి మనను జడ్జిచేస్తారు కాని, హ్యాండ్‌బ్యాగ్‌నుబట్టి కాదని నేను విశ్వసిస్తాను

► **ఆఫ్‌స్క్రీన్‌లో సైతం :** నా రూపాన్ని నేను మెయిన్‌టెయిన్ చేస్తాను. అయితే నేను లేజీ నటిని. కేవలం మాయిశ్చరైజర్, ఫేస్‌వాష్ వంటి బేసిక్స్ అనుసరిస్తాను. వాతావరణానికి అనుకూలంగా వుండే ఉత్పత్తులకు ప్రాధాన్యం ఇస్తుంటా




Time and effort can never be managed in isolation








## Taj Mahal

Just north of Sri Lanka is India, a land full of history and people. There seem to be people everywhere!

Long ago, some Indian princesses were not allowed to go out. They stood behind the palace windows in the Palace of the Winds, looking out at the world.

## Palace of the Winds

People say that when Shah Jahan's queen died, he was so sad that his hair turned grey overnight! He built the beautiful Taj Mahal to show his love for her.



## cow

The cow is a sacred animal in India. You could be jailed for killing a cow!



During Diwali, the Festival of Lights, Hindus put pretty little lights everywhere. They also make colourful rangoli patterns on the floor to welcome others

## Diwali

If you go to the Holi festival, you will end up looking very colourful. People throw coloured water and powder at one another to celebrate the coming of spring!

## Holi



## rangoli

Come, have some curry and chapati, Chapati is a flat fried bread that is eaten with curry. Hot, spicy indian curry is liked by people all over the world!



**chapati**

**curry**

Many Hindus bathe in the Ganges River every year. It is special to them because they believe that their gods made the river flow down from heaven



**Ganges River**

**kabbadi**



In the sport of kabbadi, you must run and touch as many people as you can from the other team, while saying "kabaddi-kabaddi-kabaddi" without breathing!

**bindi**



**sari**

Would you like to try wearing a sari? Indians have worn saris for 5000 years! The dot Indian women wear on their foreheads is called a bindi



**sitar**

This lady is playing the sitar. A sitar looks like a guitar, but it has 17 strings or more.



Look at the Indian dancer? How does she keeps her balance? Do you think you can stand like that?

**Indian dancer**



**Mahatma Gandhi**

Do you know two famous peace-loving people who lived here? Mahatma Gandhi taught people to change the world peacefully, without fighting.

Mother Teresa took care of sick and dying people in India



**Mother teresa**

The Himalayan mountains stretch across India, Tibet and Nepal. Himalaya means "The Home of Snow"



**Himalayan mountains**

# అనుమాన పిశాచి

పూర్వం కర్ణాటక దేశంలో శుద్ధమతి అనే గొప్ప పండితుడుండేవాడు.

ఆయన నలభైఏళ్ళు కాశీలో చదువుకుని వచ్చిన మహా విద్వాంసుడు కావటం చేత, యాభై ఏళ్ళ వాడైనప్పటికీ ఆయనకెవరో పిల్ల నిచ్చారు.

ఆయన దగ్గర చాలామంది శిష్యులు చదువుకుంటూ ఉండేవాళ్ళు.

శుద్ధమతి ఎంత విద్వాంసుడైనా వట్టి ఛాందసుడు. ఆయన భార్య ఆయనకన్న చాలా చిన్నదీ, అమాయకురాలూనూ.

ఆమె తన శిష్యులతో సరదాగా మాట్లాడుతూ ఉండేది. ఇది చూసి గురువుగారికి భార్యమీద లేనిపోని అనుమానాలు కలగసాగాయి.

ఒకసారి అనుమాన పిశాచి చేరనిచ్చిన వాడికి మనశ్శాంతి ఉండదు. శుద్ధమతి ఎవరికీ తెలియకుండా ఇల్లు వదిలి ఒక నాటి అర్ధరాత్రి ప్రయాణమైనాడు.

తెల్లవారగానే గురువుగారు లేరని గమనించిన నలుగురువిద్యార్థులు ఆయనను వెతుక్కుంటూ బయలుదేరి త్వరలోనే ఆయనను ఒక గ్రామంవద్ద కలుసుకున్నారు.

"ఒరే, నా భార్య ప్రవర్తన మంచిది కాదని నేను వెళ్ళిపోతూంటే, మీరంతా నావెంట ఎందుకుపడ్డారు?" అని గురువు వారినడిగాడు.

విద్యార్థులు తెల్లబోయి, "గురూ గారూ, ఆవిడ మా తల్లిలాంటిది. ఆవిడ ప్రవర్తన ఎటువంటిదో మేము కనిపెట్టలేమా?

మీకీ పాపిష్టి అనుమానం ఎలా కలిగింది? మేముమటుకు మీ దగ్గరే చదువుకుంటాం. మీరెక్కడికిపోతే అక్కడికి వస్తాం" అన్నారు.

తాను పొరపడ్డట్టు శుద్ధమతి తెలుసుకుని, ఇంటికి శిష్యులతో తిరుగుప్రయాణమైనాడు.

దారిలో ఒక నగరం వచ్చింది. అప్పటికి జాము పొద్దెక్కింది. వారందరూ నడక శ్రమవల్ల ఆయాసపడుతూ వీధిలోనే ఒకచోట చతికిలబడి పైబట్టలతో విసురుకోసాగారు.

ఆ వీధి పొడుగునా ఇళ్ళ అరుగులున్నాయి కాని వారికి వాటిమీద విశ్రమించవచ్చునని తోచలేదు. కొద్దిసేపట్లో ఒక స్త్రీ చంకన బిందె పెట్టుకుని అటుగా బావికిపోతూ వీరిని చూసి "అయ్యా, మీరెవరు?" అని అడిగింది.

"అమ్మా, మేము పరదేశులం...?" అన్నారు వాళ్ళు.

"మీరు పరదేశులు కాకేం?" అంటూ ఆమె బావికి వెళ్ళిపోయింది.

వారు ఒకరి మొహం ఒకరు చూసుకుని, ఆమె బిందెతో ఇంటికి పోయేటప్పుడు,

"అమ్మా, మేం పరదేశులం కాకపోతే మార్గస్థులం" అన్నారు.

"మీరు మార్గస్థులూ కారు" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

ఆమె మళ్ళీ బిందె ఎత్తుకుని బావికి వెళ్ళేటప్పుడు, వాళ్ళు "అట్లా అయితే మేం బాటసారులమని ఒప్పుకుంటావా?" అన్నారు.

"ఒప్పుకోను" అంటూ ఆమె బావికి వెళ్ళింది. ఆమె తిరిగి వచ్చేలోగా గురుశిష్యులు తమలో తాము తర్కించుకున్నారు. ఈవిడ చాలా విద్వాంసురాలై ఉండవచ్చు. ఈవిడనడిగి తామెవరో తెలుసుకుంటే గాని తమ చదువు ఫలించదు.

అందుకని ఆమె మళ్ళీ ఇంటికి వెళ్ళేటప్పుడు, "అమ్మా, మేము పరమమూఢులం" అని ఏదో చెప్పబోయారు.

ఆమె నవ్వి, వారి మాటకు అడ్డొస్తూ, "మీరు మూఢులు కూడా కారు" అన్నది.

"అయితే దయచేసి మేమెవరమో చెప్పి మరీ వెళ్ళు" అన్నారు వాళ్ళు.

"బాగా పొద్దెక్కింది. ముందు మా ఇంటికి వచ్చి, వంట చేసుకుని భోం చెయ్యండి. తరువాత మీరెవరో చెబుతాను" అన్నదామె.

ఈమాట వినగానే వారందరికీ పరమానందమయింది. వారామెవెంట ఆమె ఇంటికి వెళ్ళారు. ఆమె వారికి వంట ఇల్లు చూపించి, "అయ్యా, నా భర్త రాజుగారింట పురాణ పఠనం చేసి సరిగా రెండు జాముల వేళ ఇల్లు చేరుతారు.

ఆయన అసలే అనుమానం మనిషి. అందుచేత ఆయన వచ్చేలోగా మీరు స్నానం, జపం, వంటా ముగించుకోండి. లేకపోతే చాలా చిక్కు వస్తుంది"

అని హెచ్చరించింది.

ఆ ఛాదస్తపు బ్రాహ్మణులు సరే నన్నారేగాని, వాళ్ళ స్నానాలూ, జపాలూ, గీతాపారాయణలూ మొదలైన కర్మ కాండ ఎంతకీ పూర్తికాలేదు. ఈలోగా ఇంటి యజమాని రానేవచ్చాడు.

ఆయన భార్య చెప్పినట్టు ఆయన తగని అనుమానం మనిషి.

తన భార్య చాలా దుర్మార్గురాలనీ, ఎట్లాగైనా ఆవిడ దుర్మార్గాన్ని రుజువు చెయ్యాలనీ ఎంతకాలంగానో చూస్తున్న ఆ బ్రాహ్మణుడు వంట ఇంట్లో ఈ ఛాందసులను చూసి వెంటనే ఆ గదికి తాళంపెట్టి, తనభార్య ఏ గదిలో ఉన్నదీ చూసి, ఆ గదికి కూడా తాళంపెట్టి నేరుగా రాజుగారి దగ్గరికి వెళ్ళాడు.



పురాణంచదివే బ్రాహ్మడు అంత లోనే తిరిగి రావటం చూసిన రాజు ఆశ్చర్యపడ్డాడు.

"మహారాజా, నా భార్య దుష్టురాలు, దండించమని నేను తమర్ని ఎన్నోసార్లు కోరాను. కాని తమరు రుజువు కావాలన్నారు. వంట ఇంట్లో అయిదుగుర్ని దాచింది. కళ్ళారా చూద్దురుగాని, దయచెయ్యండి" అన్నాడు బ్రాహ్మడు.

రాజు కంగారుపడుతూ ఆయన వెంట వచ్చాడు. బ్రాహ్మడు వంట ఇల్లు తలుపు తాళంతీసేసరికి ఐదుగురు బ్రాహ్మలు, విభూతి, పెండెకట్లు ధరించి కనబడ్డారు. వారిని చూసి ఆశ్చర్యపోతూ "అయ్యా, మీరెవరు?" అన్నాడు రాజు.

"అది తెలుసుకోవటానికే కద, మేమీ ఇంటావిడ వెంట వచ్చి ఇక్కడ వంట చేసుకుంటున్నాం?" అన్నారు వాళ్ళు.

వాళ్ళు చెప్పినదంతా విన్నాక రాజుకు ఆ ఇంటావిడ నిర్దోషి అని తెలిసిపోయింది.

కాని, ఆవిడ ఈ బ్రాహ్మలను చూసి, వారు పరదేశులుగాని, మార్గస్థులుగాని, బాటసారులుగాని, మూఢులుగాని కారని ఎందుకన్నదో రాజుకు అర్థం కాలేదు. ఆయన ఇంటావిడ ఉన్న గది తాళం కూడా తీయించాడు.

"అమ్మా, నీవల్ల తప్పేమీ లేదని నాకు తెలిసింది. కాని ఈ బ్రాహ్మలు నీ దృష్టిలో ఎవరో చెప్పు. వారు పరదేశులమంటే కాదని ఎందుకన్నావు?" అని రాజు అడిగాడు.

"అయ్యా, వారు నీడలో అరుగులుండగా వాటి మీద కూచోక ఎండలో, వీధిలో దర్భాసనాలు పరిచి కూర్చుని ఉండటం చూశాను.

వారి ఛాందసం చూసి జాలి కలిగి, వారిని ఇంటికి పిలిచి స్నాన భోజన సౌకర్యాలు చూపుదామని పలకరించాను. మీరెవరంటే పరదేశులమన్నారు.

మనం మాట్లాడే భాషే మాట్లాడేవారు మనకు పరదేశులెట్లా అవుతారు? అందుకని కారన్నాను" అన్నది ఇంటావిడ.

"మరి మార్గస్థులు కారని ఎందుకన్నావు?" అని అడిగాడు రాజు.

"అయ్యా, మార్గస్థులు విశ్రాంతి తీసుకునే చోట విశ్రాంతి తీసుకుంటారు. బాటసారులు బాటను నడవటానికి ఉపయోగిస్తారు.

కాని వీరలా చేయక బాటను సత్రంలాగా విని యోగించుకున్నారు.అదిచూసిన నేను, వారు మార్గస్థులు కారనీ, బాటసారులు కూడా కారనీ అన్న మాట నిజమే!" అన్నది ఇల్లాలు.

"నిజమే.కాని, వారుతాము మూఢులమని ఒప్పుకున్నా, కాదని ఎందుకన్నావు?" అన్నాడు రాజు.

ఈ ప్రశ్నకు ఆ ఇల్లాలు వెంటనే సమాధానం ఇవ్వకపోవటం చూసి రాజు, "చెప్పమ్మా! నేనుండగా నీకు భయమెందుకూ?" అన్నాడు.

"పట్టపగలు మిట్టమధ్యాహ్నం అయిదు గురిని తన భార్య ఇంట చేర్చిందని నమ్మే భర్తనూ, అటువంటివాడు చేసిన ఫిర్యాదును నమ్మి కళ్ళారా చూడవచ్చిన న్యాయపాలకుణ్ణి మూఢులనటం చెల్లుతుందిగాని, ఛాందసులైనంత మాత్రాన చదువుకున్న విద్వాంసులు మూఢులౌతారా మహారాజా?" అని అడిగిందా ఇల్లాలు.

ఆమె భర్తా, రాజు కూడా ఏమీ అనలేక తలలు వంచుకున్నారు.

"అనుమాన పిశాచిని చేరనిచ్చిన నాకు తమరు సరి అయిన శిక్ష విధించాలి!" అన్నాడు పురాణాల బ్రాహ్మడు.

ఈమాట వినగానే శుద్ధమతి ముందుకు వచ్చి "మహారాజా, నేనుకూడా అనుమాన పిశాచిని ఆదరించినవాణ్ణే. ఈ బ్రాహ్మడికి ఏ శిక్ష విధిస్తారో అదే శిక్ష నాకు కూడా దయచేయించండి" అంటూ తన కథ అంతా చెప్పాడు.

రాజు వారిద్దరినీ ఓదార్చి "ఇకముందైనా మీ భార్యలను గౌరవంగా చూసుకోండి" అని సలహా చెప్పాడు. శుద్ధమతి శిష్యులతో ఇంటికి తిరిగి వెళ్ళాడు.

ఆర్. శివరావు



కామెడీ కథ

# ఆదాయం 2 వ్యయం 102

పినిశెట్టి శ్రీనివాసరావు



"ఎదురింటి ఇంజనీరు నటరాజన్ ఫ్యామిలీతో తిరుపతి వెళ్ళొచ్చాడట, లడ్డు ప్రసాదం పంపారు... తినండి" అంటూ చేతిలో చిన్న లడ్డు ముక్క పెట్టింది శ్రావణి. ప్రసాదం నోట్లో వేసుకున్నాడు సుమంత్. తియ్యగా బాగుంది.

"ఇంజనీరుగారు ఫ్యామిలీతో ఏటా చక్కగా తిరుపతి వెళ్ళొస్తాడు. వెళ్ళిన ప్రతిసారి రెండోమూడో లడ్లు పంచుతారు.కనుకనే వారికి ఐశ్వర్యం, అదృష్టం అలా కలసివస్తోంది. దేవుడిపట్ల భక్తి విశ్వాసాలు కల్గిన వారిని ఆ దేవుడు చల్లగాచూస్తాడు"అంది శ్రావణి.

"మనమూ వెళ్ళాం కదా ఒకసారి తిరుపతికి"

"అప్పుడెప్పుడో క్రీస్తుపూర్వంవెళ్ళాం. ఆ క్యూల్లో గంటలకొద్దీ నిలబడి, అష్టకష్టాలుపడి... ముందు వెనుకనెట్టేస్తే.... 'అంతర్యామి అలసితిసొలసితి' అనుకుంటూ బైటకొచ్చిపడ్డాం. అదే ఇంజనీరుగారి ఫ్యామిలీ అయితే కనీసంఐదునిమిషాలైనా ఏతోపుళ్ళు లేకుండా శ్రీవారి దర్శనం చేసుకుంటారట. అదీ డబ్బు పవర్ అంటే" అంది శ్రావణి.

సుమంత్... శ్రావణిల మధ్య కాసేపు మౌనం రాజ్యమేలింది. ఆతర్వాత సుమంత్ నోరంతా చేదుగా అనిపించింది. లడ్డు తీపి ఏమయ్యిందో ఏమో!

'ఏటా తిరుపతికి వెళ్ళొచ్చిన వాళ్ళకి ఐశ్వర్యం, అదృష్టం కలిసొస్తాయని' శ్రావణి అన్నమాటలు సుమంత్‌కి నవ్వు తెప్పించాయి.

"నిజమే... ఐశ్వర్యం, అదృష్టం కవలపిల్లలు"

"అందుకనేనేమో ఇంజనీరుగారికి ఊళ్ళో రెండిళ్ళున్నాయి. నెత్తిమీద రెండు సుళ్ళున్నాయి. ఏటా తిరుపతికి ఒకటికాదు, రెండుసార్లు వెళ్ళొస్తుంటారు. ఒకసారి పెద్దింటి ఐశ్వర్యంతో, రెండోసారి చిన్నింటి అదృష్టంతో... అలియాస్ 'లక్స్'పాపతో.

మరోవారం తర్వాత, మళ్ళీ లడ్డు ప్రసాదం వచ్చింది. ఈసారి శ్రావణి.... "ప్రసాదం టేబిల్ మీద ఉంది, మింగండి" అంది. భాషలో మార్పు... తిరస్కార ధోరణి అర్థంచేసుకున్న సుమంత్ బాధపడ్డాడు. ఇలా తరచూ ఎవరో ఒకరు తిరుపతి వెళ్ళొచ్చి లడ్డు ప్రసాదం ఇచ్చినప్పుడల్లా శ్రావణి హాట్‌హాట్‌గా మాట్లాడటం, సుమంత్ 'హర్ట్' అవటం జరుగుతూనే ఉంది.

సుమంత్ లడ్డుమాత్రమే తింటున్నాడు. శ్రావణి లడ్డుతో కలిపి సుమంత్‌ని తింటోంది. తిరుపతి లడ్డు సుమంత్- శ్రావణిల సఖ్యతకు అడ్డుగా మారింది.

"ఇది నీకు న్యాయమా లడ్డు దేవరా?" అని హాల్లో గోడకు వ్రేలాడుతున్న వెంకన్న పటం ముందు హెడ్డు వంచి మొరపెట్టుకున్నాడు సుమంత్.

అగ్నికి ఆజ్యం తోడైనట్లు మరో వార్త సుమంత్‌ని కుదిపేసింది. "వాళ్ళ అపార్టుమెంటు వాచ్‌మెన్ ఫ్యామిలీతోసహాతిరుపతివెళ్తున్నాడట"

"వాడూ ఇప్పుడే వెళ్ళాలా? వెళ్ళిన వాడు లడ్డుప్రసాదం తెస్తాడు...ఇస్తాడు, అంటేతనకు మళ్ళీకష్టాలు తప్పవన్నమాట... వెంకన్నా నన్నెందుకయ్యా ఇలా లడ్డూతో కొడ్తున్నావు?" అని మొత్తుకున్నాడు సుమంత్.

లార్డ్ వెంకన్న సుమంత్ మొరవిన్నాడో లేదోకాని, వాచ్‌మెన్ తిరుపతి వెళ్ళొచ్చేశాడు. ఓ లడ్డుపీస్ ఇచ్చేశాడు. ఊహించినట్లుగానే శ్రావణి సుమంత్‌కి 'పీస్' లేకుండా చేసింది.

అయితే "బ్లెస్సింగ్ ఇన్ డిస్‌గైజ్"లా, వాచ్‌మన్ వెళ్ళొచ్చింది ద్వారకా తిరుమలకి.. అంటే చిన్న తిరుపతికి, పెద్ద తిరుపతికి కాదు. ఇదేదో షార్టుకట్‌లా ఉందేఅనుకుని "మనమూవెళ్తున్నాం తిరుపతికి. అదే చిన్నతిరుపతికి" అన్నాడు సుమంత్ శ్రావణితో.

"మనది వాచ్‌మెన్ లెవల్ అన్నమాట"అంది శ్రావణి. సుమంత్‌కి చెంప ఛెళ్ళుమనిపించినట్లయింది. 'కూల్‌డౌన్' అనుకుంటూ మౌనంగా ఉండిపోయాడు. కారణం...ఈ సంవత్సర రాశిఫలాల్లో తనరాశికి రాజపూజ్యం రెండు, అవమానం నాలుగుగాఉంది.

కనుక ఎవరేమన్నా అవహేళన చేసినా... విలంబి నామ సంవత్సరం వెళ్ళేంతవరకూ 'లైట్'తీసుకోవాలనుకున్నాడు. అలాగే మొన్నొకరోజు వాళ్ళ అపార్టుమెంటు బయటనుంచున్నాడు సుమంత్. ఎదురుగానే ఇంజనీరుగారి ఇల్లుంది. "అక్కడెందుకు దిష్టి బొమ్మలా... అలాంటి వాళ్ళ ఇంటిముందు నుంచునే అర్హతకూడలేదు మనకు" అంది శ్రావణి.

"పోనీ కూర్చుంటాలే" అన్నాడు సుమంత్.

"దారిన పోయేవాళ్ళు చిల్లరపైసలు వేస్తారు" అంది శ్రావణి. సుమంత్‌కి తలకొట్టేసినట్లయింది. 'ఆహా! విలంబీ... నీ గురించి భరిస్తున్నాను తప్పిస్తే...' అనుకుంటూ పిడికిళ్ళు బిగించాడు.

సుమంత్ లోపలికొచ్చాక "అసలు మానాన్న నన్ను ఒక ఇంజనీరుకిచ్చి పెళ్ళిచేద్దామనుకున్నారు. కానీ అప్పుడు అంత కట్నకానుకలు ఇచ్చే స్తోమతలేక... మీ ఉద్యోగం చిన్నదైనా, డిపార్టుమెంటులో పై సంపాదన బాగా ఉంటుందంటే మీకిచ్చి కట్టబెట్టారు. తీరా చూస్తే మీకు జీతం తప్ప గీతంలేదు. ఉన్నా పుచ్చుకోవటం చేతకాదు... పప్పు దప్పళం" అంది శ్రావణి.

శ్రావణిని ఏమీ అనలేక, 'విలంబీ... రాజపూజ్యం లేకపోతే లేకపోయింది. అవమానం అంటే మరీ ఇంత అవమానమా? ఐనా ఎదురింటి ఇంజనీరు తమిళతంబి అంటేనే నీకు ఇష్టం కదూ విలంబీ!' అని ఒకింత అసూయకు లోనయ్యాడు సుమంత్

"ఏనిముషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరూ!" కదా? ఈ మధ్యనే చిన్న తిరుపతికి వెళ్ళొచ్చిన మా వాచ్‌మెన్‌కి లాటరీలో లక్షరూపాయలు



వచ్చింది. ఎక్కడో స్విచ్‌వేస్తే మరెక్కడో లైటు వెలిగినట్లు, శ్రావణి అర్జంటుగా చిన్నతిరుపతి ప్రయాణం పెట్టింది. ఇంటికొచ్చాక "స్వామివారిని ఏం కోరుకున్నావేంటి?" అని అడిగాడు సుమంత్.

"రెండు కార్లు, రెండిళ్ళు, బంగారం, వెండి, ఇళ్ళ స్థలాలు, భారీగా బ్యాంకు బేలన్స్" అంది శ్రావణి.

"కార్లు, ఇళ్ళు రెండేసి ఎందుకు. ఒక్కొక్కటి చాలదా?" అన్నాడు సుమంత్.

"రెండడిగితే కనీసం ఒక్కటైనా ఇస్తాడుకదా! అడిగేటప్పుడు మొహమాటం లేకుండా అడగాలి. మీలా అన్నిటికీ మొహమాటపడ్తే... ఇదిగో ఇలానే ఉంటాం. కార్యందగ్గర, కాసుల దగ్గర అస్సలు మొహమాటం పనికిరాదు" అంది శ్రావణి.

"అవునా?" అని... మరి ఇవన్నీ కావాలంటే తగిన ఆదాయం ఉండాలికదా?మనంకూడాఓవంద లాటరీ టిక్కెట్లు కొందామా?" అన్నాడు సుమంత్.

"అదే మరి... మళ్ళీ వాచ్‌మెన్‌లానే ఆలోచిస్తున్నారు. ఇన్నిఅడిగినదాన్ని అవి నెరవేరే మార్గం కూడ అడగనా ఏమిటి? అందుకే 'మావారికి రెండు చేతులా సంపాదన ఉండేలా చూడుస్వామీ' అని వేడుకున్నాను" అంటూ "ఇలా దగ్గరకురండి" అని సుమంత్ చెవిలో రహస్యం చెప్పినట్లు "స్వామివారి పర్సెంటేజి హుండీలో వేసేద్దాంలెండి... సరేనా?" అంది.

సుమంత్ అయోమయంగా చూస్తుంటే "అవన్నీ నేను చూసుకుంటానుగా, మీరు నిశ్చింతగా ఉండండి" అనికూడ అంది శ్రావణి.

"మరి నీ కోరికలన్నీ తీరాలంటే, రెండు చేతుల సంపాదన సరిపోతుందంటావా? పనిలోపనిగా నాకు మరో రెండు చేతులిమ్మని అడగాల్సింది... అప్పుడు నాలుగుచేతులా సంపాదనుండేదిగా?" అన్నాడు.

"వెటకారమా?"అంది శ్రావణి.

"నాకు అంత సాహసమా?" అన్నాడు భయం నటిస్తూ.

'ప్రేయర్' అయిపోయింది. ఇప్పుడు 'ప్లాన్‌ఆఫ్ యాక్షన్' కావాలి. రాత్రి పడుకోబోయే ముందు, సుమంత్ ప్రక్కన చేరి... "నా మెడ ఎలా బోసిగా ఉందో చూడండి... చేతులు మొండిగా, నడుమేమొ ఖాళీగా... ఇవన్నీ నిండుగా ఉండాలంటే నెక్లెస్‌లు, గాజులు, వడ్డాణం వగైరావగైరా వద్దా చెప్పండి?

'నువ్వు బంగారానివి' అని ఊరికే అంటే సరిపోతుందా... బంగారు ఆభరణాలు అమర్చాలా వద్దా?" అంటూనే...

"మీ మౌనం అర్ధాంగీకారం అని నాకు అర్థమయ్యిందిలెండి, కనుక ఇక నడుం బిగించండి, బోడి జీతం ఉంటే ఏంటి, లేకపోతే ఏంటి? అసలుకంటే వడ్డీ ముద్దు... అవునా, మీ కాంట్రాక్టర్లను పిండండి. పై సంపాదన తిరుపతి లడ్డూలాంటిది.

ఆ రుచి మరిగితే, మామూలు బూందీలడ్డులాంటి జీతం... ఆఫ్ట్రాల్ అనిపిస్తుంది. మీకు భయమైతే... వాళ్ళని ఇంటికి పంపండి... నేను డీల్ చేస్తాను.

శ్రావణిమాటలువింటున్నసుమంత్ ఏదో 'హర్రర్' సినిమా చూస్తున్నట్లు చేష్టలుడిగి ఉండిపోయాడు.

కొంతసేపటికి తేరుకొని -

"నువ్విలా నన్ను భయపెడ్తేఎలా? ఈ టాపిక్ఇక్కడితో ఆపేసి, ప్రస్తుత కార్యాచరణలోకి దిగుదాంరా" అంటూ శ్రావణిని మీదకు లాక్కున్నాడు.

చెప్పినట్లుగానే శ్రావణి రంగంలోకి దిగింది. కాంట్రాక్టర్లంతా సుమంత్ ఇంటిదారి పట్టారు. 'డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు'... వద్దంటే డబ్బు... లాకర్లునిండిపోతున్నాయి. రెండేళ్ళు తిరిగేసరికి సుమంత్- శ్రావణి పెద్ద 'విల్లా'లాంటి ఇంట్లోకి మారారు. మూడో సంవత్సరాంతానికి మరో 'విల్లా' కొన్నారు. ఇంటిముందు కార్లు, ఇంట్లో నౌకర్లు.

సిటీలో బిగ్‌షాట్స్‌తో పరిచయాలు... సుమంత్‌కి కంట్రీ క్లబ్‌లో మెంబర్‌షిప్ ఉమెన్స్ ఆర్గనైజేషన్స్‌లో శ్రావణి యాక్టివ్‌పార్ట్.శ్రావణి ఒళ్ళంతా బంగారమే. మూడునెలలకొకసారి ఫ్లైట్‌లో తిరుపతికి రాకపోకలు... విఐపి బ్రేక్‌దర్శనాలు... శ్రీవారి షేర్ క్రింద హుండీలో బంగారు లడ్లు సమర్పణ.

"మీరెందుకూ రావటం అంతదూరంనుంచి శ్రమపడి... నేనే వచ్చేవాడినిగా మీ దగ్గరకు మీరు అంతగా చూడాలనుకుంటే" అని శ్రీవారు అన్నారని, తన ఫ్రెండ్స్ సర్కిల్‌లో శ్రావణి చమత్కారాలు.

తరచూ దుబాయ్, సింగపూర్ టూర్లు, నగరంలోని బిగ్‌షాట్స్‌తో గెట్ టు గెదర్... ఏ ఫంక్షనులో చూసినా సుమంత్ - శ్రావణిలే సెంటర్ ఆఫ్ ఎట్రాక్షన్... 'మేడ్ ఫర్ ఈచ్ అదర్'గా గుర్తింపు.

సుమంత్ - శ్రావణి, ఎవరి పనుల్లో వాళ్ళు బిజీ బిజీ, ఎవరెక్కడున్నారో తెలీనిస్థితి. ఇద్దరూ కలుసుకోనటం ఏ అర్ధరాత్రిదాటాకో బెడ్‌రూంలో, సుమంత్‌కి మందు, పొందు కొత్త అలవాట్లు. హైక్లాస్ సొసైటీలో అవన్నీ మామూలే అంటూ శ్రావణి సమర్థింపు.

## ఆయనే మెంటర్

షార్ట్‌ఫిల్మ్‌నుంచి 'దర్శకుడు'తో వెండితెరకు చేరిన పూజిత పొన్నాడకు మరోమారు సుకుమార్‌తో కలసి పనిచేసే అవకాశం లభించింది. 'రంగస్థలం'లో ఓ కీలకపాత్ర పోషిస్తున్నది.

"దర్శకుడు సుకుమార్‌గారితో ఇది నా మూడో వెంచర్. నేనెప్పుడూ ఆయన్ను నా మెంటర్‌గానే భావిస్తుంటాను. 'రంగస్థలం' పాత్రగురించి అంతగా తెలియకుండానే సుకుమార్‌గారి చిత్రం కాబట్టి సంతకాలుచేసేశా. రామ్‌చరణ్, ఆది వంటి నటులతో పనిచేయడం గొప్పగా వుంది.

హ్యాపీ వెడ్డింగ్'లో, మరో చిత్రంలోనూ నటిస్తున్నాను. విభిన్న పాత్రలు. బాగా ఎగ్జయిట్ అవుతున్నా" అని చెప్పింది.



## చిన్నచిన్న సంతోషాలు

వర్కవుట్లతో వినూత్నంగా వుండేందుకు ప్రయత్నిస్తుంది పొడగరి కృతీసనన్. కొన్నాళ్ళ గ్యాప్ తర్వాత మళ్ళీ ఆరంభించిన కృతి చాలా కష్టపడుతున్నదట. వర్కవుట్ల విషయాన్నలా వుంచితే, దైనందిన జీవితంలోని చిన్నచిన్న విషయాలే చెప్పలేనంత సంతోషంగా వుంటాయంటున్నది.

"సాధారణ జీవితం అంటే చాలామందికి ఇష్టం వుండదు. ఉత్తమ జీవితాన్ని కోరుకుంటాం. అయితే సాధారణ జీవితంలోని చిన్నచిన్న విషయాలే ఎంతో సంతోషాన్ని ఇస్తాయి.

అటువంటి సంతోషాన్నిచ్చే క్షణాలను తప్పనిసరిగా ఆస్వాదించాలి" అంటున్నది.



కిట్టీ పార్టీలు, కాస్ట్లీ షాపింగులు, ఉమెన్స్ క్లబ్‌లో పేకాటలు... శ్రావణి బిజీనే, సుమంత్ - శ్రావణి, ఎవరికార్లు వారివి, ఎవరి లైఫ్ వాళ్ళది.

ఆదివారం ఉదయం ఎనిమిదిగంటలు. శ్రావణి ఇంకా నిద్రలేవలేదు. ప్రక్కనున్న మొబైల్ ఫోను రింగైంది. మెలకువవచ్చి "హల్లో" అంది బద్ధకంగా. "మేడమ్...మైసెక్యూరిటీ బాత్‌కర్ రహాహు"

"యూ బ్లడీ ఫెలో... బంగారంలాంటి నా నిద్ర పాడుచేశావ్... నిన్ను ఇప్పుడే పనిలో నుంచి బర్తరఫ్ చేస్తున్నాను" సెక్యూరిటీ మీద విరుచుకుపడింది.

"మాఫ్‌కీజియే మేడమ్, ఇంజనీరు నటరాజన్ సాబ్, ఆయన బీబీ మిమ్మల్ని కలిసేందుకు వచ్చారు. ఇక్కడ గేటుబయట నుంచున్నారు.

ఆ సాబ్ ఫోను చేయమంటే మీకే ఫోను చేశాను" అన్నాడు సెక్యూరిటీ అజిత్‌సింగ్.

"నాన్సెన్స్... ముందుగా అప్పాయింట్‌మెంట్ లేందే కలవటానికి వీల్లేదనిచెప్పలేదా వాళ్ళకు? మరెందుకు ఫోనుచేశావ్ 'బేవకూఫ్'" తిట్టి మొబైల్ స్విచాఫ్ చేసింది శ్రావణి. ఆ తర్వాత ఎంతకీ నిద్రపట్టలేదు శ్రావణికి. రాత్రి క్లబ్ నుంచి వచ్చి పడుకునేటప్పటికి రెండయ్యింది. ఇంకా నిద్రపోవాలని ఉంది. కానీ సెక్యూరిటీ ఫోన్ చేయటంతో డిస్టర్బ్ అయ్యింది.

'అయినా ఆ నటరాజన్‌కు బుద్ధుండొద్దూ... పెద్ద వాళ్ళింటికి వెళ్ళేముందు అప్పాయింట్‌మెంట్ లేకుండా వెళ్ళకూడదని... డబ్బుండగానే సరిపోతుందా... మేనర్స్‌లేకపోతే ఎలా? అని తిట్టుకుంటూనే 'ఇంటర్‌కామ్'లో "స్ట్రాంగ్ కాఫీ పంపించు" అంటూ కిచెన్‌లోవున్న కుక్‌కి చెప్పింది.

క్షణాల్లో కాఫీవచ్చింది. లేచికూర్చుని కాఫీ సిప్‌చేస్తూ స్మార్టు ఫోనులో 'వాట్సప్ మెసేజ్'లు చూస్తోంది.

కమీషనరుగారి మిస్సెస్ తెలుగులో కొన్ని జోక్స్‌పంపింది. మొదటిది... 'ఏమండీ స్వర్గంలో భార్యాభర్తల్ని కలిపి ఉండనివ్వరట' అని భార్య అంటే, 'ఓసి పిచ్చిదానా, అందుకనేకదా దాన్ని స్వర్గంఅన్నారు' అన్నాడట భర్త. శ్రావణికి నవ్వొచ్చింది. రెండోది... ఒక ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర కారు ఆగింది. కార్లో ఉన్నావిడ అక్కడ అడుక్కుంటున్న బెగ్గర్‌తో 'నీ ఫేస్ ఎక్కడో చూసినట్లుందే' అంటే మనం 'ఫేస్ బుక్ ఫ్రెండ్స్' అన్నాడట.

'ఓర్నాయనో... టెక్నాలజీ ఏ లెవల్‌కి వెళ్ళిందో! అనుకుంటూ ముక్కున వేలేసుకుంది శ్రావణి.

ఇంకో జోక్‌లో ఒకావిడ ప్రక్కింటావిడతో చెప్తోంది. "టీరా సీరియల్ అయిపోయాక మా ఆయన్ని ఆసుపత్రికి తీసుకువెళ్తే... పావుగంట ముందు వచ్చుంటే బ్రతికేవారన్నారు. నా తప్పేమైనా ఉందా చెప్పువదినా... అయినా ఈయనకు ప్రతిదీ తొందరే" అంది.

మరొకావిడైతే వాళ్ళాయన ఆత్మహత్య చేసుకోవటానికి వెళ్తున్నానంటే, 'ఈ సంచి వెంట తీసుకెళ్ళండి... ఒకవేళ మనసు మార్చుకుంటే, తిరిగొచ్చేటప్పుడు పళ్ళు,కూరగాయలు తెద్దురుగాని' అందిట. ఇంకా ఇలానే మరికొన్ని జోకులు...

నవ్వుకుంటూలేచి, అద్దంలో తన సోయగం చూసుకుని, బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని...

"ఈ ఐదేళ్ళలో లైఫ్ ఎంతగా మారిపోయింది? డే అండ్ నైట్ బిజీనే, టైమ్‌కి భోజనం, నిద్ర కరువైంది. ఒకరకంగా ఇదివరకటి లైఫ్‌స్టైల్ బాగుందనిపిస్తుంది. నెలనెలా వచ్చేజీతం అవసరాలకు సరిపోయేది. కొద్దో గొప్పో మిగిలేది.

ఏదో కోపంవచ్చినప్పుడు ఆయన్ని తను ఒకమాట అన్నా ఆ తర్వాత మళ్ళీ అంతా మామూలే, ఇద్దరం కలిసే భోంచేసేవాళ్ళం. కలిసే సినిమాలకి వెళ్ళేవాళ్ళం. పగలు గొడవపడ్డా, రాత్రుళ్ళు కలిసిపోయేవాళ్ళం.

ఒకరిగురించి ఒకరు పట్టించుకునే వాళ్ళం. ఆయనకు తను, తనకు ఆయన అంతే. మరి ఇప్పుడో? పబ్లిక్ రిలేషన్స్ పెరిగాయి.

ఎవరిదారి ఎటో! 'ఏ దారెటుపోతుందో ఎవరికి ఎరుక?' అన్నట్లు మా జీవితం మా స్వాధీనంలో లేకుండాపోయింది. ఎందుకో ఆ పాత రోజులే బాగున్నాయనిపిస్తోంది.

ఈ ఉరుకుల పరుగుల జీవితం నాకొద్దు. నాకు పిచ్చెక్కిపోతుంది... పిచ్చెక్కిపోతోంది" అని శ్రావణి గట్టిగా అరుస్తుంటే, ప్రక్కనే పడుకునివున్నసుమంత్... "ఏయ్, శ్రావణీ...ఏమైంది? ఎందుకలా అరుస్తున్నావు, లే... లే..." అంటుంటే ఉలిక్కిపడి లేచిన శ్రావణి "నేను ఎక్కడ ఉన్నాను? మన బంగళా, పనివాళ్ళు" అంటూ వెర్రిగా చూస్తుంటే...

"నువ్వు కలగన్నట్లున్నావు" అంటూ శ్రావణిని దగ్గరకు తీసుకున్నాడు సుమంత్.

"వద్దండీ... మనకా లైఫ్ వద్దండీ... మనం ఇప్పుడున్నట్లే ఉందాం" అంటూ సుమంత్‌ని హత్తుకుపోయింది శ్రావణి.

కాలింగ్ బెల్ మోగితే సుమంత్ లేచివెళ్ళాడు. వెనుకనే శ్రావణి అనుసరించింది. ఎదురుగా అపార్టుమెంట్ వాచ్‌మెన్. సుమంత్ ప్రక్కగా వచ్చి "సార్, ఎదురింటి ఇంజనీరు గారింట్లో గవర్నమెంటోళ్ళువచ్చి సోదాలు చేస్తున్నారట.

పొద్దున్నే నాలుగుకార్లలో ఆఫీసర్లొచ్చారు సార్... చాలా గందరగోళంగా ఉంది" అన్నాడు వాచ్‌మెన్. సుమంత్, శ్రావణి ఆశ్చర్యపోతూ అలానే ఉండిపోయారు. ఆరోజు, ఆ తర్వాత రెండురోజుల వరకూ... టీవీలో అన్ని ఛానెళ్ళలో

"ఫలానా ఇంజనీరు నటరాజన్ ఇంట్లో అవినీతి నిరోధకశాఖ సోదాలు... ఇంకా అతని బంధువుల ఇళ్ళల్లో, బ్యాంకు లాకర్లలో... మొత్తం ఏభైకోట్లపైనే ఆస్తులు..." అంటూ వార్తలు వస్తూనే వున్నాయి.

"ఏమిటండీ ఇదంతా?" అంటూ శ్రావణి, సుమంత్‌చేయిపట్టుకుని అడుగుతుంటే... "బహుశా 'విలంబి'లో అతని ఆదాయం 2, వ్యయం 102 అయ్యుంటుంది. దీంతో ఉన్నదంతా ఊడ్చిపెట్టుకుని పోయుంటుంది" అన్నాడు సుమంత్.

"అదంతా నాకేంతెలీదు. నాకు ఏ ఆస్తులు, ఆర్భాటాలు వద్దు. మీరే నాదేవుడు..నా నా బంగారం, నా బంగారు బాతు గుడ్డు... కాదు కాదు నా తిరుపతి లడ్డు" అంటూ సుమంత్‌ని అల్లకు పోయింది శ్రావణి.



విమర్శలకు భయపడకూడదు... విమర్శలలోని సందేశాలను అందుకోవాలి. -నిర్మల సీతారామన్, కేంద్రమంత్రి

# SEX AND సైకాలజీ



డా॥జి. సమరం

The basic premise behind sex worship is that every man and woman holds a spark of divine essence within



ఆర్. కావలి

నాకు ముగ్గురు పిల్లలు ఉన్నారు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకోవాలంటే నాకొక రకం భయం ఉంటే, మావారికి మరొక రకం భయం ఉంది. మావారు ఆపరేషన్ చేయించుకుంటే సెక్స్ బలహీనత వస్తుందని, ఆయన చేయించుకోనని అంటారు. నన్నే చేయించుకోమంటారు.

ఆడవాళ్ళు కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకుంటే లావు అయిపోతారని అంటారు కదా, నేను సన్నగా నాజూకుగా ఉంటాను. నేను ఆపరేషన్ చేయించుకుంటే ఒళ్ళు వచ్చేసి పిప్పళ్ళబస్తాలాగా మారతానని భయంగా ఉంది. అందుకని ఆపరేషన్ లేకుండా పిల్లలు కలగని మార్గం చెప్పండి.

స్త్రీలు కుటుంబ నియంత్రణ ఆపరేషన్‌చేయించుకుంటే లావు అవ్వరు. ఒళ్ళు రాదు. ఎవరైనా స్త్రీలు కుటుంబ నియంత్రణ ఆపరేషన్ తర్వాత లావు అయితే వాళ్ళు ఏ పనీ చేయకుండా, అతిగా తినడం వల్లే లావు అవుతారుతప్ప ఆపరేషన్‌వల్ల కాదు. మీరు నిరభ్యంతరంగా ఆపరేషన్ చేయించుకోండి.

ఆపరేషన్‌వల్ల మీలోని నాజూకుతనం ఏమాత్రం పోదు. అందంగానే ఉంటారు. మగవాళ్ళు కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకుంటే సెక్స్ బలహీనత వస్తుందనే మాటలో ఎటువంటి నిజంలేదు.

ఆర్.ఎల్. గుంటూరు

ఇటీవల మా ఫ్రెండు తన కూతురికి పెళ్ళిచేయాలని అనేకమంది అబ్బాయిలని చూశాడు. అబ్బాయిలు అందంగా ఉన్నప్పటికీ, మంచి పొజిషన్‌లో ఉన్నప్పటికీ జాతకాలు కలవలేదని ఆ సంబంధాలన్నీ వదులుకున్నాడు. తర్వాత భేషైన సంబంధం అనీ, జాతకాలు ఇద్దరివీ ఎంతో చక్కగా కుదిరాయి అని తన కూతురిని ఇచ్చి ఘనంగా పెళ్ళిచేశాడు.

పెళ్ళి అయిన ఆరునెలలకే అమ్మాయికి కడుపు వచ్చింది. తాను తాతను కాబోతున్నందుకు నాఫ్రెండ్ ఎంతో సంతోషించాడు. కడుపు వచ్చిన తన కూతురికి డాక్టరమ్మ రొటీన్‌గా హెచ్.ఐ.వి. టెస్ట్ చేయగా అందులో హెచ్.ఐ.వి వచ్చిందని తేలింది.

అల్లుడికి కూడా టెస్ట్‌చేస్తే అతనికికూడా హెచ్.ఐ.వి ఉంది. దాంతో అతని గుండె పగిలిపోయింది. గుండె పోటుతో హాస్పటల్‌లో చేరాడు.

Courtesy : THE MAN

ఇంజక్షన్ మందు ఉండే గ్లాసు వయల్ లాంటి ఒక గ్లాస్ వయల్‌ని ప్యాకింగుల్లో నుండి బయటకు తీశాడు. దాని ఒక చివర రెండు వైర్లు బయటకు వచ్చి ఉన్నాయి.

"ఇది డిటనేటర్" దాన్నికూడా టేబుల్‌మీద పెడుతూ అన్నాడు. అడుగున్నర బారుండి భారీగా ఉన్న స్టీల్ సిలెండర్, సీల్ చేసి ఉన్న ఒక చిన్న స్టీల్ బాక్స్‌లాంటి టైమర్ డివైజ్ కూడా టేబుల్‌మీదకు వచ్చాయి.

# వేట

పుట్టగంటి గోపీకృష్ణ





ఆ డివైజ్ నుండి ఒక పాజిటివ్, ఒక నెగిటివ్ వైర్లు బయటకు వచ్చి ఉన్నాయి. ఆఖరుగా అతి జాగ్రత్తగా ప్యాక్‌చేసిన ఒక అయిదంగుళాల మెటల్‌రాడ్ బయటకుతీశాడు. రెండంగుళాల చుట్టుకొలత ఉన్న అది దాదాపు ఐదుకిలోల బరువు ఉంది. "ఇది యురేనియమ్ 235" చెప్పాడు వినోద్ నాయక్.

తరువాత ఒక బంతి లాంటి ఆకారాన్ని బయటకు తీశాడు. దాని మధ్యలో ఈ చివర నుండి ఆ చివర వరకు ఒక రంధ్రం ఉంది.

## గతసంచికలో ప్రారంభమైన 'వేట' సీరియల్ జరిగిన కథ

ఒక ప్రముఖ ఇంగ్లీషు దినపత్రికలో ఓ మూల కార్ల ప్రకటన ఒకటి వస్తుంది. కేవలం ఆరుగురు వ్యక్తుల్ని ఆ ప్రకటన ఆకర్షించింది. వాటి రిజిస్ట్రేషన్ నెంబర్లతో తమదగ్గరవున్న కవర్లలోని నెంబర్లతో పోల్చుకుంటారు వారు.

ఆ ఆరుగురు వివిధ రాష్ట్రాలకు చెందిన వారు.ఒకరికొకరు ఏమాత్రంపరిచయంలేదు.

ఢిల్లీలోని ఓ అపార్ట్‌మెంట్ పెంట్‌హౌస్‌లో వుండే వినోద్‌నాయక్ వద్దకు కార్ల ప్రకటన చూసిన మిగిలిన ఐదుగురు వారివారి రాష్ట్రాల నుండి ప్రయాణంచేసి వచ్చి అతన్ని కలుస్తారు. కొచ్చిన్ నుండి నారాయణకుట్టి, నాగాలాండ్ నుంచి లిమ్మెన్, మధుర నుండి పూరన్‌సింగ్, హైదరాబాద్ నుండి వెంకటేష్, కలకత్తానుండి సుమిత్ బోస్ వరుసగా ఒకరితర్వాత ఒకరు అక్కడికి చేరుకుంటారు.

తమకు అందిన ఆదేశాల ప్రకారం ఆ ఆరుగురు కొన్నివస్తువులను తీసుకువస్తారు. వాటిలో కొన్ని ప్రమాదకరమైన ఎక్స్‌ప్లోజివ్స్ కూడా వుంటాయి. వాటన్నింటిని వినోద్‌నాయక్ తీసుకుని అక్కడున్న డైనింగ్ టేబుల్‌మీద పెడుతుంటాడు. తర్వాత జరిగింది చదవండి.

"ఇది ప్యూర్ యురేనియమ్..." చెప్పాడు.

అవన్నీ వింటున్న సుమిత్‌బోస్, "ఇవన్నీ ఎందుకు?" అన్నాడు గొంతెండిపోతుంటే.

"ఇంకెందుకు? న్యూక్లియర్ బాంబ్ తయారు చేయడానికి" నవ్వుతూ చెప్పాడు వినోద్ నాయక్.

"జోక్ చేస్తున్నావా?" అడిగాడు వెంకటేష్.

"ఎదురుగా అన్నీ పెట్టుకుని ఇంకా నమ్మకపోతే మీరు జోకర్లవుతారు" తన పని తాను చేస్తూ అన్నాడు వినోద్ నాయక్.

"న్యూక్లియర్ బాంబ్ అంటే ఇంత సులువుగా



చేయవచ్చా?" అడిగాడు నారాయణ కుట్టి.

"చెప్తాను వినండి. ఈ బంతి లాంటి ఆకారం పదిహేను కిలోల యురేనియం ముద్ద. కానీ ఇది పేలాలంటే సరిపోయే క్రిటికల్ మాస్ దీనికిలేదు.

ఆ స్థాయికి ఇది చేరాలంటే... ఇదుగో, ఈ బంతి మధ్యలో రంధ్రం ఉంది చూశారా?? దానిలోకి ఈ యురేనియం రాడ్ వెళ్ళాలి.

ఊరికినే రాడ్ అక్కడ పెడితే రేడియేషన్ పొల్యూషన్‌తప్ప ఎప్పటికీ అది పేలదు. ఎందుకంటే పేలుడు సంభవించాలంటే ఇనిషియేటర్ ఉండాలి.

ఆ రెండు డిస్కులు కనిపిస్తున్నాయి చూశారా... లిథియమ్, పొలోనియమ్. అవి రెండూ ఒకదానికొకటి గుద్దుకుంటే వాటిమధ్య రియాక్షన్ వస్తుంది.

అది ఈ యురేనియానికికలిస్తే అప్పుడు పేలుడు సంభవిస్తుంది" ఆ మాటలు వింటున్న ఎవరిలోనూ ఇది ఎంతప్రమాదానికి దారితీస్తుందో, ఈ పేలుడు వలన ఎన్నిలక్షలమంది చనిపోతారో అన్న సానుభూతి అసలులేదు. వారందరూ దానిని ఒక మామూలు రొటీన్ పనిలా చూస్తున్నారు.

అంతగా కరుడు కట్టుకుపోయారు వారు.

"ఆ రెంటినీ ఎవరు కలుపుతారు?" అడిగాడు పూరన్‌సింగ్.

"ఎవరూ కలపరు. ఈ రెండు అర్థ చంద్రాకారపు డిస్కులను చూశారా. వీటిలో ఈ యురేనియంముద్దని పెట్టి స్ప్రూల ద్వారా రెండు అర్థ చంద్రాకారాలను కలుపుతాం. అలా తయారయిన యురేనియంగోళాన్ని ఈ సిలెండర్లో పెట్టి ఒకవైపు ఈ పోలోనియమ్ డిస్క్, మరోవైపు లిథియమ్ డిస్క్ పెడతాం.

మరో చివర యురేనియమ్ రాడ్ ఉంచి దానిని పేలుడు పదార్థంతో డిటనేట్ చేస్తాం. ఆ రాడ్ సూటిగా దూసుకువచ్చి ఈ గోళంలో ఉన్న యురేనియంలో దూరుతుంది. అలా దూరుతున్నప్పుడు ఆ గోళానికి రెండువైపులా ఉన్న పొలోనియమ్, లిథియమ్‌లను కలుపుతుంది. అప్పుడు సంభవిస్తుంది... మీరు ఎదురుచూసే పేలుడు"

"మరి మన పరిస్థితి? మనం మాత్రం మాడి మసి అయిపోమూ.." సందేహం వెలిబుచ్చాడు లిమ్చెన్.

"అక్కర్లేదు. పేలుడు వెంటనే సంభవించకుండా ఈ టైమర్‌వాడుతాం..."నాలుగు బ్యాటరీలను వరుసగా కలిపి టైమర్‌కు జతచేస్తూ అన్నాడు వినోద్ నాయక్.

"దీనిలో టైమర్ మూడు గంటల తరువాత పేలేటట్లు సెట్ చేశాను. రాత్రి ఒంటిగంటకు దీనిని ఆన్ చేసి మనం బయటకు వెళ్ళిపోతే తెల్లవారుజామున నాలుగింటికి పేలుడు సంభవిస్తుంది. ఈలోపు మనం ప్రమాదం లేని ప్రదేశానికి వెళ్ళిపోతాం"

"మన గురించిన ఆచూకీ తెలిసే అవకాశం లేదుగా?" అడిగాడు నారాయణ కుట్టి.

"ఇంకెక్కడి ఆచూకీ? సగం ఢిల్లీ మసి బొగ్గులా మారిపోతుంది" నవ్వుతూ చెప్పాడు వినోద్‌నాయక్.

వారితోమాట్లాడుతూనే ఒక కార్డియాలజిస్ట్ గుండె ఆపరేషన్ చేసినంత జాగ్రత్తగా తన పని చేసుకుపోతున్నాడు వినోద్‌నాయక్.అతని పనితనాన్ని అబ్బురంగా చూస్తున్నారు మిగిలినవారు.

ఎట్టకేలకు తన పని ముగించాడతను.

"దీనిని ఎక్కడ పెడతాం?" అడిగాడు కుట్టి.

"ఎక్కడ పెట్టినా ఒకటే! ఇది మామూలు ఆర్డీఎక్స్ బాంబ్ కాదు, తీసుకువెళ్ళి చంపదలచుకున్న వారి సీటుకింద పెట్టటానికి, న్యూక్లియర్ బాంబ్. ఇది ఎక్కడ పెట్టినా, పేలినా ఒకటే..."

"ఈ బిల్డింగ్ మొత్తం తునాతునకలయిపోతుందా?" అడిగాడు కుట్టి.

"ఒక్క ఈ బిల్డింగే కాదు. ఈ బిల్డింగ్‌కు చుట్టుపక్కల కిలోమీటర్‌దూరంలోని చెట్లు, పుట్టలు సహా ఏ వస్తువూ మిగలదు. లోహాలు కూడా కరిగిపోయేలా ఉష్ణోగ్రత వందమిలియన్ సెంటిగ్రేడ్‌లకుచేరుతుంది. కన్నుమూసి తెరిచేలోపు పదిలక్షల మంది ఛామ్మంటారు. మిగిలిన వారు నెమ్మదిగా రేడియేషన్ కారణంగా ఛస్తారు" చెప్పాడు వినోద్‌నాయక్.

ఆ మాటలు చెప్తుంటే అతనికళ్ళలో ఒక వెలుగు. ఒక ఆనందం కనిపించాయి.అతను చెప్తున్న మాటలు

అవగాహన చేసుకున్న వారిలో ఎలాంటి బెరుకూలేదు. వారు ఆలోచిస్తుందల్లా ఆ ప్రమాదం నుండి తాము ఎలాతప్పించుకోగలమా అనే... సమయం చూశాడు లిమ్బెన్. పన్నెండుదాటింది. "టైమర్ సెట్ చేస్తే ఇక మనం బయలుదేరదాం..." అన్నాడతను.

వినోద్ నాయక్ తెల్లవారుజాము నాలుగింటికి పేలేలా టైమర్ సెట్ చేశాడు. తరువాత పెంట్‌హౌస్ నుండి బయటకు వచ్చి తాళం వేశాడు.

అందరూ అక్కడనుండి కిందకు బయలుదేరుతుంటే ఒక వాన నీటి చుక్క పూరన్‌సింగ్ మీద పడింది. తలెత్తి పైకి చూశాడతను.గుంపులు గుంపులుగా నల్లటిమబ్బులు పడమటి దిక్కు ఆకాశం నుండి దూసుకువస్తున్నాయి. సన్నటి మెరుపులు ఆ మబ్బుల మధ్య మెరుస్తూ కనిపించాయి.

"ఈరోజుల్లో ఈ మబ్బులేమిటి?" అన్నాడు అతనితోపాటు తలెత్తి పైకిచూసిన వెంకటేష్.

అదే సమయంలో గాలిలో కూడా వేగం పెరిగింది. ఈదురుగాలి మొదలయింది. "వాన వలన మన పని చెడిపోదు కదా..." అన్నాడు సుమిత్ బోస్.

"మనం తలపెట్టిన పనికి వాన అడ్డుకాదు. కానీ ఆలస్యం చేస్తే మనం ఈ ప్రదేశం నుండి దూరంగా వెళ్ళటానికి ఆటంకంకావచ్చు. మూవ్ క్విక్..." అని వారికి చెప్పూ లిఫ్ట్‌లోకి దారి తీశాడు వినోద్ నాయక్. అందరూ గ్రౌండ్‌ఫ్లోర్ చేరుకుని అక్కడ ఉంచిన తమ తమ వాహనాల్లో ఎవరిదారినవారు వెళ్ళిపోయారు. యాక్టివేట్ చేసిన అణుబాంబ్ పెంట్‌హౌస్‌లో ఒంటరిగా సమయంలెక్కించుకుంటోంది.





సాదాసీదాగా ఢిల్లీలో ఒక మారుమూల ఉండే ఆ భవనం రీసెర్చ్ అండ్ అనాలిసిస్ వింగ్ (RAW) ఆఫీసు అంటే ఎవరూ నమ్మరేమో.

ఆఫీసుకు ముందు ఎటువంటి బోర్డూ లేదు.

ఇద్దరు సెక్యూరిటీ మనుషులు మాత్రం వచ్చిపోయే వాహనాలను పరిశీలించి వాటి నెంబర్లు నోట్ చేసుకుని భవనంలోపలకు పంపుతున్నారు.

ఆఫీసులోపల కొంతమంది ఉద్యోగులు కంప్యూటర్ల ముందు కూర్చుని పనిచేసుకుంటున్నారు.

దేశవ్యాప్తంగా అనుమానాస్పదంగా, దృష్టిలోకి వచ్చిన ఫోన్‌కాల్స్, మెయిల్స్ ఇక్కడ నుండే మానిటర్ చేయబడతాయి. సీనియర్ ఎనలిస్ట్ అవినాష్ తన ఆఫీసు సీటులో విశ్రాంతిగా వెనక్కివాలి కళ్ళు మూసుకుని ఉన్నాడు.

ఒక అర్జంటు మెసేజ్ అతనికి అందజేయటానికి వచ్చిన కుమార్ ఏమిచెయ్యాలో అర్థంకానట్లు అయోమయంగా నిలబడిపోయాడు.

'మెసేజ్ ఇవ్వకుండా వెనక్కివెళ్తే ఒక తంటా, ఈయన్ని డిస్టబ్‌చేస్తే ఒక తంటా...' అనుకున్నాడు కుమార్ మనసులో.

"అంటేనేను నిద్రపోతున్నానని ఫిక్సయ్యావన్నమాట..." నిటారుగా కూర్చుంటూ అన్నాడు అవినాష్, కళ్ళు మూసుకుని ఉన్నా తను వచ్చినట్లు ఎలా తెలిసిందో అర్థంకాలేదు కుమార్‌కి.

> ప్రతి మతం శాంతి, ప్రేమలనే బోధిస్తాయి. అయితే వాటిని వివరించే తీరులో తేడాలుంటాయి.
>
> -సలీమ్‌ఖాన్, సినీ రచయిత

అవినాష్ ఆరడుగుల ఎత్తు ఉంటాడు. అతని కంటిచూపు... తీక్షణంగా ఎదుటి మనిషి అంతరంగంలోకి తొంగిచూస్తున్నట్లు ఉంటుంది. రోజుకు రెండుగంటలు అతను పెట్టే శ్రమకు ఫలంగా శరీరం చూడచక్కగా తీర్చిదిద్దినట్లు ఉంది.

ఐతే అతను వేసుకున్న లూజ్‌షర్ట్ అతని ఫిట్‌నెస్‌ను బయటకు తెలియనివ్వటంలేదు. మామూలుగా ఆ డిపార్టుమెంట్లో పనిచేసేవారికి శారీరక దారుఢ్యంతో పని ఉండదు.

కానీ అవినాష్ రెండు సంవత్సరాల క్రితం బ్లాక్ క్యాట్ కమాండోలయూనిట్ నుండి ట్రాన్స్‌ఫర్ అయివచ్చాడు. అందుకే అతని ఫిట్‌నెస్ అత్యున్నత స్థాయిలో ఉంటుంది.

"ఏదేం లేదు సార్! మెడిటేషన్‌చేసుకుంటున్నారేమో అనుకున్నాను" చిలిపిగా అన్నాడు కుమార్. ఆ ఆఫీసులో అవినాష్‌తో కాస్త చనువుగా మాట్లాడే ధైర్యం చేయగలిగింది కుమార్ ఒక్కడే.

తీక్షణంగా కుమార్‌వైపు చూసినట్లు నటించబోయి ఫక్కున నవ్వేశాడు అవినాష్.

తనుకూడా నవ్వేసి, "సర్! ఒక అర్జంట్..!" అంటూ తనువచ్చిన పనిగురించి చెప్పబోయాడు కుమార్.

చెయ్యెత్తి అతని మాటల్ని మధ్యలో ఆపాడు అవినాష్. "ఆ సితార ఇంపోర్ట్స్ అండ్ ఎక్స్‌పోర్ట్స్ ఫైల్లో కోడ్‌లాంగ్వేజ్ డెసిఫర్ అయ్యిందా?"

"లేదు సర్! మన ఇంజినీర్లు ఇంకా ఆ పనిమీదే ఉన్నారు" చెప్పాడు కుమార్. ప్రస్తుతం అవినాష్ ఆ కేసు మీదే పనిచేస్తున్నాడు. సితార ఇంపోర్ట్ ఎక్స్‌పోర్ట్ కంపెనీలో పనిచేసే ఒక ఎంప్లాయీ డేవిడ్.

అతను తన కంపెనీ తరుపున రోజూ కొన్ని వందల మెయిల్స్ పంపుతుంటాడు. అతను పంపే

## మళ్ళీ కేరింతలు

తెలుగులో 'కేరింత' కొట్టి, 'నందిని నర్సింగ్ హోమ్' సినిమాతో ప్రేక్షకులను మెప్పించిన నిత్యా నరేష్ ఆ తర్వాత మాలీవుడ్ చెక్కేసింది.

మళ్ళీ ఇప్పుడు మరో తెలుగు అవకాశం పొందింది. 'కేరింత' సినిమాలో నిత్య సహజ నటనకు మెచ్చిన అదే చిత్ర దర్శకుడు ఇప్పుడీ కొత్త సినిమాకు నిత్యకు ఓటేశాడు. ఇప్పటికే ఈ అమ్మాయి సినిమా సెట్స్‌లోకి చేరిపోయింది. ఈ పాత్ర తనలోని ప్రతిభను తెలియజెప్తుందని, కెరీర్‌లో తన స్థానాన్ని పెంచగలదని విశ్వసిస్తున్నానంటున్నది. ఆల్ ది బెస్ట్ నిత్యానరేష్.

మెయిల్స్ అన్నీ మామూలుగా ఉన్నా, అందులో ఒక మెయిల్ మాత్రం కోడ్ లాంగ్వేజ్‌లో ఉంటోంది.

ప్రతి శుక్రవారం పంపే ఆ మెయిల్ దుబాయ్‌లోని తమ కంపెనీ బ్రాంచి ఆఫీసుకు పంపుతున్నాడతను. అక్కడ నుండి ఆ మెయిల్ కతార్‌లోని ఒక పర్సనల్ మెయిల్‌కు చేరుతోంది.

అక్కడ నుండి క్రైస్ట్ చర్చ్‌లోని మరో ఐ.పి. అడ్రస్‌కు చేరుతుంది. అలా ఆ మెయిల్ డెన్మార్క్, మనీలా, ఢాకాలకువెళ్ళి ఆఖరుగా పాకిస్తాన్‌లోని క్వెట్టాచేరుతోంది. ఐతే ఎన్నిఅడ్రస్‌లు మార్చినా ఆ మెయిల్ RAW ఏర్పాటు చేసుకున్న సోఫిస్టికేటెడ్ నెట్‌లోనుండి తప్పించుకోలేకపోయింది.

అసలు డేవిడ్‌కి పాకిస్తాన్‌కి ఉన్న సంబంధం ఏమిటి? అతను ఆ మెయిల్స్‌లో ఏ రహస్య సమాచారం పంపుతున్నాడు?... అన్న ప్రశ్నలు ప్రశ్నల్లా కాకుండా వాటి జవాబులు బయటకు రావాలంటే ఆ మెయిల్స్‌లో ఉన్న కోడ్ డెసిఫర్ కావాలి.

ఆ రహస్యం ఛేదించబడాలి. కానీ అదే జరగటం లేదు. ఎంతమంది ప్రయత్నించినా ఆ కోడ్ కొరుకుడుపడటం లేదు. అలాంటి పరిస్థితుల్లో అవినాష్ ఆ కేస్ టేకప్ చేశాడు. పూర్తిగా అంకెల్లోఉంది ఆ మెయిల్. అది కోడ్ లాంగ్వేజ్ అని అర్థమవుతూనే ఉంది. కానీ దానిని డీకోడ్ చేయటంలో నిష్ణాతులయినవాళ్ళు కూడా డీకోడ్ చేయలేకపోయారు.

రోజులు ఆలస్యం అయ్యేకొద్దీ, డేవిడ్ పంపే మరి కొన్ని మెయిల్స్ శత్రుదేశానికి చేరే అవకాశం ఉంది. ఒకవేళ అతన్ని పట్టుకున్నా... ఆ మెయిల్‌లో ఉన్న కంటెంట్ తెలియకుండా అతనిమీద పెట్టిన కేస్ నిలవదు. పైగా శత్రువులు అప్రమత్తమయి మరింత జాగ్రత్తపడతారు. అందుకే ఆ కేసు RAW కి ప్రయారిటీ కేసయింది. అందరూ మిగిలిన పనులు మాని ఆ కేసును సాల్వ్‌చేసే పనిలోపడ్డారు.

మరోసారి తనువచ్చిన పని గుర్తుచేయబోయాడు కుమార్. ఇంతలో అవినాష్ అతన్ని మాట్లాడవద్దని సైగ చేసి ఆపెయ్యటంతో ఆగిపోయాడు కుమార్.

"అంకెలతో కోడ్ ఎలా పంపుతారో నీకు తెలుసా?" అడిగాడు అవినాష్.

"అదేంటి సార్ అలా అడుగుతారు? RAW లో పనిచేస్తూ ఆ మాత్రం తెలియదా?"

"అయితే ఆ కోడ్ ఎలా ఉంటుందో చెప్పు"

"చిన్న పిల్లలకు కూడా తెలిసిన అంకెల కోడ్ ఒకటి ఉంది. ఇంగ్లీష్ అక్షరం A కి బదులు ఒకటో నెంబరు, B కి బదులు రెండో నెంబరు... ఇలా ఇరవై ఆరు అక్షరాలకు ఇరవై ఆరు నెంబర్లు ఇస్తారు.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| L | M | N | O | P | Q | R | S | T | U | V |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| W | X | Y | Z | | | | | | | |
| 23 | 24 | 25 | 26 | | | | | | | |

పది దాటిన నెంబరు ఉందనుకోండి, ఆ రెండు అంకెలకు కలిపి ఒక గీత గీస్తారు. అంటే, M అని రాయాలంటే, 13 అని రాస్తారు. BABY అని రాయాలంటే, 21225 అని రాస్తారు..."



"అది సులువయిన పద్ధతి అని నువ్వే చెప్తున్నావ్. మరి ఈ డేవిడ్ వాడిన కోడ్ ఎలాంటిది?"

"సరిగ్గా తెలియకేగా సాల్వ్ చేయలేకపోతోంది? అయినా ఈ నెంబర్ కోడింగ్‌లో రకరకాల పద్ధతులు ఉన్నాయి. అన్నిట్లోకి కాంప్లికేటెడ్ పద్ధతి చెప్తాను.

పంపేవాడూ, అందుకుంటున్న వాడూ వారి దగ్గర ఒకే రకం పుస్తకం పెట్టుకుంటారు. కోడ్ పంపేవాడు పుస్తకంలో ఒక పేజీని సెలక్ట్‌చేసుకున్నాడనుకుందాం. ఆ పేజీలో ఒక లైను కూడా సెలక్ట్ చేసుకున్నాడనుకుందాం. అంటే ఉదాహరణకి ఈ టెలిఫోన్ డైరక్టరీ చేతిలోకి తీసుకుని అన్నాడు కుమార్.

"దీంట్లో 173 పేజీలో ఆరవ లైను మొదటి అక్షరం ఏముంది? S అని ఉంది. అప్పుడు అతను రాసే మెసేజ్‌లో S కి ఒకటో నెంబర్ ఇస్తాడు. ఆ తరువాత మిగిలిన అక్షరాలకి వరుస క్రమంలో నెంబర్లు ఇచ్చుకుంటూ పోతాడు. అంటే T అక్షరానికి 2 U అక్షరానికి 3... అన్నమాట.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| S | T | U | V | W | X | Y | Z | A |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| B | C | D | E | F | G | H | I | J |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| K | L | M | N | O | P | Q | R | |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | |

అప్పుడు అదే BABY పదాన్ని 109107 అని రాస్తారన్న మాట"

"ఈ కోడ్ స్పెషాలిటీ ఏమిటి?"

"దీన్ని ఎట్టి పరిస్థితుల్లో డీకోడ్ చేయలేం. అలా చేయాలంటే మన దగ్గర కూడా వారిద్దరూ వాడుతున్న పుస్తకం ఉండాలి. అప్పుడు కూడా పెద్ద ఉపయోగం ఏమీ ఉండదు. ఆ బండ పుస్తకంలో వారు రోజుకొక పేజీని సెలక్ట్ చేసుకోవచ్చు.

ఒకవేళ పేజీ మార్చకపోయినా ఆ పేజీలో కూడా ఏ లైన్ సెలక్ట్‌చేసుకుంటారోతెలియాలి. అప్పుడు కానీ ఆ కోడ్ డీకోడ్‌కాదు. సింపుల్‌గా కనిపించే ఈకోడ్ అంతకాంప్లికేటెడ్" చెప్పాడుకుమార్.

"కాబట్టి ఇండియా నుండి మెసేజ్ పంపుతున్న అనుమానితుడు డేవిడ్ దగ్గర, పాకిస్తాన్‌లో మెసేజ్ అందుకుంటున్న వ్యక్తి దగ్గర ఒకే పుస్తకం ఉండాలి. అవునా?" "అవును"

"కుమార్! నీకు ఇన్ని విషయాలు తెలుసు కదా... ఆ డేవిడ్ ఇంట్లో ఏమేమి పుస్తకాలున్నాయో ఒకసారి చూసి రాకూడదూ..."

"అది ఇల్లీగల్ కదాసార్. అందులో మన డిపార్ట్‌మెంట్‌కు అలాంటి అధికారం కూడా లేదు"

"కానీ రాత్రి నాకు డేవిడ్ ఇంటికి వెళ్ళే అవకాశం వచ్చిందోయ్" "ఎలా సార్?"

## గొప్ప మనసు

పిన్న వయస్సులోనే హన్సిక విశాల హృదయంతో ముప్ఫైమంది పిల్లలకు అమ్మ అయింది.

ఈ లోకంలోకి రాగలిగిన అదృష్టం తన జీవితమని, తనకున్నదాన్ని పదిమందికీ పంచడానికి తానెప్పుడూ సిద్ధంగానే వుంటానని మరింత విశాలంగా చెప్తోంది హన్సిక.

"కంటేనే పిల్లలు కాదు. వీళ్ళంతా నా కడుపున పుట్టకపోయినా అందరూ నా పిల్లలే. వాళ్ళకు నేనే అమ్మను. మా అమ్మ వాళ్ళకు అమ్మమ్మ. అనాథలన్న భావన అస్సలు వారికి రానీయను.

కేవలం డబ్బు ఇచ్చేసి ఊరుకోను.వీలయినప్పుడల్లా వారితో గడుపుతుంటాను.

నాకు ఇంకా చాలా చేయాలని వుంది. సీనియర్ సిటిజన్లకోసం ఓ భవనం నిర్మించాలని అనుకుంటున్నాను" అంటూ తాను చేయాలనుకున్న పనుల గురించి చెప్పుకొచ్చింది.

విధేయతను మొదట అలవర్చుకోండి.
సేవకుడిగా వుండటం నేర్చుకుంటే
నాయకుడయ్యే యోగ్యత
లభిస్తుంది.

"ఆ దారెమ్మటవెళ్తుంటే వాడిఇల్లు కనిపించింది. దగ్గరకువెళ్ళి చూస్తే ఇంట్లో ఎవరూలేరు.తాళంచూస్తే చాలా వీక్‌గా కనిపించింది. చెయ్యివేయగానే తెరచుకుంది. లోపలికి వెళ్ళి ఇల్లంతా వెతికాను"

"అయ్యబాబోయ్! అలా చెయ్యటం తప్పుకదండీ. అసలు వాళ్ళు మీరు వెళ్ళిన టైముకి ఇంట్లో లేకుండా ఎక్కడికి పోయారో?"

"వాళ్ళంతట వాళ్ళు ఎక్కడికీ వెళ్ళే రకాలుకాదోయ్. కాకపోతే ఆ రోజు ఏదో లాటరీ తగిలి కొత్తగా రిలీజ్ అయిన సినిమా టిక్కెట్లు ఫ్రీగా ఇచ్చారంట. అందుకని సెకండ్‌షో సినిమాకి వెళ్ళారు"

"అదేం లాటరీ అండీ. అలాంటి లాటరీలు కూడా ఉంటాయా?"

"లాటరీనా నీ బొందా? అయిదొందలుపెట్టి రెండుటికెట్లుకొని, వంద రూపాయలు కొరియర్ వాడికి ఇచ్చి నేనే పంపాను"

"తప్పు కదండీ..." జాలిగా అన్నాడు కుమార్.

ఇంతలోనే కుతూహలం ఆపుకోలేక "తరువాత ఏం జరిగిందండీ?"

"వాడి ఇంట్లో ఉన్న పుస్తకాలన్నీ పరిశీలించాక ఈ పుస్తకాన్ని వాడు కోడ్ పంపటానికి వాడుతున్నాడని అనుమానం వచ్చిందోయ్" ఒక లావుపాటి పుస్తకంచూపిస్తూ అన్నాడు అవినాష్.

"అందుకని ఆ పుస్తకం ఎత్తుకొచ్చారా?" "నేనంత పిచ్చివాడిలా కనిపిస్తున్నానా? పుస్తకం కనపడకపోతే వాడికి అనుమానం రాదూ.

అందుకని బజారుకివెళ్ళి సేమ్ పుస్తకం కొనుక్కొచ్చాను"

"కానీ ఏరోజు ఏ నెంబర్ పేజీ తెరుస్తాడో మనకి ఎలా తెలుస్తుంది?"

"వాడి ఇంటి గోడకి తగిలించి ఉన్న క్యాలెండర్ మీద కొన్ని రోజులకి సున్నాలు చుట్టి ఉన్నాయోయ్. కొద్దిగా ఆలోచించిచూస్తే అవి అతను మెయిల్ ఇచ్చిన రోజు తేదీ, నెల కలిపితే వచ్చే నెంబరే ప్రైమరీ కోడ్ అని ఒక అభిప్రాయానికి వచ్చాను" ఆ తరువాత అవినాష్ చెప్పేమాటలు వినకుండా పరుగెత్తుకుంటూ వెళ్ళిన కుమార్, డేవిడ్ ఇచ్చిన ఒక మెయిల్ పట్టుకొచ్చాడు.

అది పంపిన రోజు 28, నెల నవంబర్. "సో ప్రైమరీ కోడ్ 2811" అన్నాడు కుమార్. ఆ తరువాత హడావుడిగా ఆ పుస్తకంలోని 281వ పేజీ తీసి 1వ లైను చూశాడు. ఆ లైను W అక్షరంతో మొదలయింది.

చకచకా Wకి ఒకటో నెంబర్, ఆ తరువాత అక్షరాలకి తరువాతినెంబర్లు ఇచ్చుకుంటూపోయాడు. మరో అరగంట కుస్తీపడి పట్టరాని ఆనందంతో "సార్! మీరు చెప్పింది నిజమే. అదే

> **2022 నాటికి రైతుల ఆదాయం రెట్టింపుఅవ్వాలంటే దేశంలో సమర్థ నీటి వినియోగవ్యవస్థ అవసరం.**
> *-నితిన్ గడ్కరి, కేంద్రమంత్రి*



కోడ్...ఆ మెయిల్‌లో మనడిఫెన్స్‌రహస్యాలు పంపుతున్నాడు" చెప్పాడు.

"సరే! ఆ డేవిడ్ వివరాలు, కోడ్ వివరాలు అందచేయాల్సిన వాళ్ళకి అందచెయ్యి. మిగిలింది వాళ్ళే చూసుకుంటారు"

"అదేంటి సార్. ఇంత చేసిన మీరు స్వయంగా ఈ విషయం డైరెక్టర్ గారి దగ్గరకు వెళ్ళి తెలియచేస్తే ఆయన ఎంతో సంతోషిస్తారు"

"నా ఉద్యోగం ఆయన్ని సంతోషపెట్టటంకాదుగా కుమార్.ఆ పని మీలో ఎవరో ఒకరు చేయండి"

"ఇంత కష్టపడి కృషి చేసిన మీకు ఈ కేసులో ఏ క్రెడిట్టూ దక్కకపోవటం అన్యాయం సార్! అయినా అనుకునేది ఏముంది? మన ఉద్యోగాలే అలాంటివి. మీరు చెప్పినట్లే చేస్తాను.

మనం ఇచ్చిన క్లూలను బట్టి, రేపో మాపో ఎవడో ఒక అనామక ఇన్‌స్పెక్టర్ డేవిడ్‌ను అరెస్ట్ చేసి ప్రెస్ మీట్ పెట్టి ఘనత అంతా తనదే అన్నట్లు బిల్డప్ ఇస్తాడు. ఇన్ని చేసే మనకి ద్రోహులని అరెస్ట్‌చేసేపవర్‌కూడా ఇవ్వవచ్చుగా"

ఇంకా ఉంది

# నేనెవరో తెలుసా!

మనిషి జీవితంలో 37 ఏళ్ళ వయసు అంటే అంత గొప్ప వయసు కాదు. నిజానికి జీవితాన్ని బాగా హుషారుగా గడిపే వయసు. ఆ విషయం మామూలు మనుషులకు వర్తిస్తుందేమో కాని క్రీడాకారులకు కాదు. క్రీడాకారులకు సంబంధించినంతవరకు 35-40 మధ్య వయస్సు రిటైర్‌మెంట్ గురించి ఆలోచించే వయసు.

వయసుమీదపడుతున్నా ఆటమీద ఇష్టతతో ఆటలో కొనసాగేవారు వుండవచ్చు. కాని వయసు మీద పడుతున్నా ఆటలో అదే నేర్పు ప్రదర్శిస్తూ ప్రపంచంలో నెంబర్ ఒన్ స్థానాన్ని నిలబెట్టుకోవటం అంత సులభమైన విషయం కాదు.

అటువంటిది వరసగా 237 వారాలపాటు ప్రపంచంలో నెంబర్ ఒన్ టెన్నిస్ ఆటగాడిగా రికార్డు సృష్టించాడు ఒక ఆటగాడు.

మొత్తంమీద 303 వారాలపాటు నెంబర్ ఒన్‌గా నిలిచిన ఘనత ఆ ఆటగాడిది. బాల్యంలో ప్రతి ఒక్కరికి ఏవేవో కలలుంటాయి. ఈ స్విస్ కుర్రాడికి ఆటలే కలలు. ఒకే ఆట కాదు, పలు ఆటలుమీద ఆ కలలు ఉండేవి. మొదటి కల ఫుట్‌బాల్.

ఆ తర్వాత బ్యాడ్మింటన్, బాస్కెట్ బాల్ కలలు కన్నాడు. కేవలం కలలు కనటమే కాదు, ఆ యా ఆటలు ఆడాడు కూడా. అయితే హఠాత్తుగా ఆరేళ్ళ వయసులో టెన్నిస్ రాకెట్ చేతిలో పట్టుకున్నప్పుడు ఏదో కొత్త అనుభవం, కొత్త కల.

చేతిలోని రాకెట్‌తో బంతిని బలంగా గోడకేసి కొడితే అది తిరిగి వెనక్కి వస్తోంది. అలా ఎంతసేపు అయినా ఆ బంతిని ఆడించవచ్చన్న విషయం ఆ కుర్రాడికి అర్థమైంది. ఇక అక్కడినుండి కొత్త కల మొదలైంది. అది టెన్నిస్ కల. ఒక్కసారి టెన్నిస్ కల మొదలయినతరువాత మిగిలిన కలలన్నీ వెనక్కి పోయాయి. అయితే ఆ బాలుడు వున్న ప్రదేశం అతనికి పలు భాషలతో పరిచయం తెచ్చింది.

జర్మన్, ఫ్రెంచ్, స్విస్, ఇంగ్లీషు, ఇటాలియన్, ఆఫ్రికానాస్ భాషలన్నీ చక్కగా మాట్లాడగలగటం నేర్చుకున్నాడు. తల్లి దక్షిణాఫ్రికా నుండి వచ్చినావిడ కావటంతో ఆఫ్రికానాస్ తన 'తల్లి భాష' అంటుండేవాడు. చాలామంది ఆటగాళ్ళు తమ సీనియర్స్ ఆడుతున్నప్పుడు చూసి నేర్చుకుంటుంటారు.

క్రికెట్‌లో బౌండరీ దాటివచ్చిన బంతులను తిరిగి ప్లేయర్స్‌కి అందించేందుకు బాల్ బాయుస్‌ని అధికారికంగా నియమిస్తారు. అలా బాయ్‌గా పనిచేసినవాడు టెండూల్కర్. ఆటను దగ్గరగా చూసే అవకాశం వారికి కలుగుతుంది అలా. అదే పద్ధతిలో టెన్నిస్ ఆటలోకూడా బంతులందించే కుర్రాళ్ళుంటారు.

సరిగ్గా భవిష్యత్తులో ప్రపంచ నెంబర్ ఒన్ అయ్యే ఆ టెన్నిస్ ఆటగాడి జీవితం బాల్ బోయ్‌గానే ప్రారంభమైంది. అన్నిరకాల భాషలు నేర్చుకోవటంవల్ల లోకాన్ని చూసే తీరు, మనుషులను అర్థంచేసుకునే పద్ధతి మెరుగైందని, పలురకాల ఆటలు ఆడటంవల్ల కంటికి, చేతికి మధ్య 'కోఆర్డినేషన్' బాగా పెరిగి టెన్నిస్ ఆడే తీరు మెరుగైందని ఆయనెప్పుడూ చెపుతుంటాడు.

జూనియర్ స్థాయిలోనే గెలుపులు అతన్ని వరించాయి. 17 ఏళ్ళ వయసులో వింబుల్డన్ టోర్నమెంట్‌లో సింగిల్స్, డబుల్స్ రెండింటిలో అనేక బాయస్ విభాగంలో కప్ గెలుచుకున్నాడు.

అమెరికన్ ఓపెన్‌లో ఫైనల్‌లో ఓడిపోయినా ఆ వయసులోనే ప్రపంచంలోనే నెంబర్ 1 జూనియర్ టెన్నిస్ ప్లేయర్ అనిపించుకున్నాడు.

21వ శతాబ్దపు టెన్నిస్ నాదే అంటూ ప్రకటించకపోయినా ఆ మాట పదిమందితో అనిపించే స్థాయిలో టెన్నిస్ రంగంలోకి దూకాడు. 19 ఏళ్ళ వయసులో వింబుల్డన్ ఆడుతూ అంతకుముందు నాలుగు సార్లు ఆ టోర్నమెంట్ గెలుచుకున్న పిట్ సాంప్రాస్‌ని ఓడించి సంచలనం సృష్టించాడు.

2003 తర్వాత అతనికి తిరుగులేదు. తొలిసారిగా వింబుల్డన్ గెలిచాడు. మరుసటి సంవత్సరం మూడు గ్రాండ్ స్లామ్ సింగిల్స్ టైటిల్స్ గెలుచుకున్నాడు.

2005 నాటికి ఇక తనకు తిరుగులేని స్థానాన్ని సంపాదించుకున్నాడు. మధ్యలో కొన్ని ఓటములు ఎదుర్కొన్నా అతనిలోని ఆటగాడికి అంతర్జాతీయ గుర్తింపు వచ్చింది. 2006 అతనికి తిరుగులేని సంవత్సరం. తిరుగులేని అతని కెరీర్‌లో టెన్నిస్ చరిత్రలో మరే ఆటగాడు గెలవని రీతిలో 20 గ్రాండ్ స్లామ్ టైటిల్స్ గెలుచుకున్నాడు. ఏ టోర్నమెంట్ తీసుకున్నా అందులో అతనిదే రికార్డు.

ఎనిమిదిసార్లు వింబుల్డన్ గెలిచిన చరిత్ర మరే ఆటగాడికి లేదు. ఆరుసార్లు ఆస్ట్రేలియన్ ఓపెన్ గెలుచుకుని మరో ఆటగాడితో కలిసి రికార్డు పంచుకున్నాడు. పదిసార్లు వరసగా వింబుల్డన్ ఫైనల్స్‌కి చేరుకోవటం రికార్డే. 30 గ్రాండ్ స్లామ్ టైటిల్స్ గెలవటం రికార్డే. ఇప్పటికి 97 కెరీర్ టైటిల్స్‌ని గెలుచుకున్న అతగాడి రికార్డును టెన్నిస్ చరిత్రలో అందుకోగల్గిన మరో ఆటగాడు రాగలడా అనేది సందేహమే!

టెన్నిస్‌లో రకరకాల కోర్టులు వుంటాయి. గ్రాస్ కోర్ట్, హార్డ్ కోర్ట్, క్లే కోర్ట్ అనే రకాలలో ఒక్కొక్క ఆటగాడు ఒక తరహా కోర్టుమీద బాగా ఆడగలుగుతాడు. అటువంటి ప్రత్యేక తరహా శిక్షణే తీసుకుని స్పెషలిస్టులవుతుంటారు. కాని ఈ ఒక్క ఆటగాడికి మాత్రమే కోర్టుతో సంబంధం లేదు.

ఎటువంటి కోర్టు అయినా ఒకటే. అతని నేర్పు అటువంటిది. టెన్నిస్ కోర్టులో కూడా కొందరు బేస్ లైన్ స్పెషలిస్టలు, సర్వీస్ స్పెషలిస్టులు వుంటారు. కాని ఈ ఆటగాడు ఆల్‌రౌండర్.

కోర్టులో అతను వేగంగా కదిలే తీరు చూస్తే ఒక సింహం వేగంగా సంచరిస్తున్నట్టుంటుంది. ఏ మూల నుండి ఏ మూలకైనా బంతిని నైపుణ్యంగా పంపగలిగిన సత్తా వున్నటువంటి టెన్నిస్ ఆటగాడు.

ఒలెంపిక్స్‌లో పతకం, డేవిస్ కప్‌ని తన దేశానికి సాధించిపెట్టడం అతని ఘనత.

టెన్నిస్ ఆటద్వారానేకాక తన సామాజిక సేవల ద్వారా కూడా పేరు సంపాదించాడు. ఆయన భార్య ఒకనాటి టెన్నిస్ ప్లేయర్. గాయంతో వైదొలగి పూర్తిగా భర్త బాగోగులు చూసుకుంటున్నది.

అవసరంలో వున్న పిల్లలకు విద్య, క్రీడలలో ప్రోత్సహించే ఆర్థిక సహాయ సంస్థను స్థాపించాడు. దక్షిణాఫ్రికా - స్విస్ బంధాలు బలపడేందుకు ఆ రెండు దేశాల పిల్లలకు స్కాలర్‌షిప్‌లిస్తున్నాడు.

ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు ఆ యా దేశాల్లో సహాయ కార్యక్రమాలకోసం టెన్నిస్ ప్రదర్శనలు నిర్వహించి లక్షలాది డాలర్లు సేకరించి అందిస్తున్నాడు. అతనికి రెండుసార్లు కవల పిల్లలే పుట్టటం కూడా మెడికల్ రంగంలో చిత్రమే.

**తొలిసారి ఇద్దరు అమ్మాయిలు, ఆరేళ్ళతర్వాత ఇద్దరు అబ్బాయిలు. ఇదికూడా ఒక రికార్డ్ అంటూ తన రికార్డులమీద తానే జోక్ వేసుకోగలిగిన టెన్నిస్ స్టార్ అతగాడు. అతగాడు రెండు దేశాలలో పౌరసత్వం కలిగివున్నాడు. రెండవది అమ్మ ద్వారా వచ్చినది, వదులుకోనంటూ తల్లిమీద ప్రేమను వెల్లడించాడు. ఇంతకీ...**

***1. ఎవరు ఆ టెన్నిస్ ఆటగాడు? 2. అతని పౌరసత్వం కలిగిన దేశాలు ఏవి?***

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు
ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు
31 మార్చి 2018 తేదీలోగా పంపించండి.
కరెక్టు సమాధానాలు రాసినవారిలో
లాటరీ పద్ధతిద్వారా ఒకరిని విజేతగా
ఎంపిక చేసి ₹ 500/-
నగదు బహుమతిని అందజేస్తాం.

16.3.2018 సంచికలో ప్రచురించబడిన
'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :
1. టి.బాలసరస్వతి, 2. సత్యజిత్‌రే
₹ 500/- బహుమతి పొందిన విజేత :
ఎస్.ప్రసాద్, A-3, I ఫ్లోర్, 29,
మూసా స్ట్రీట్, టి.నగర్, చెన్నై-600 017

# విలువలు

## గొల్లపూడి బాలసుబ్రహ్మణ్యం



“అమ్మా...నాకో సందేహం...అమ్మంటే ఎవరమ్మా?” అడిగాడు కేశవ్.

“ఏరా! ఒక పక్కన నన్ను అమ్మా అని పిలుస్తూ మళ్ళీ అమ్మంటే ఎవరమ్మా అని నన్నే అడుగుతున్నావ్! ఏమిటీ అల్లరి?” సుతారంగా మొట్టికాయ వేస్తూ అన్నది కళ్యాణి.

“అదే నా సందేహం! నేను నిన్నే అమ్మా అని ఎందుకు పిలుస్తున్నాను? వేరేవాళ్ళని అలా ఎందుకు పిలవడంలేదు?” మళ్ళీ అడిగాడు కేశవ్.

“ఆరోక్లాసుకి వస్తున్నావ్..ఇప్పుడు వచ్చిందా నీకా సందేహం? ఐనా ఇంత ఉన్నట్టుండి ఏమిటా ప్రశ్న?” కంచంలో అన్నం కలుపుతూ అన్నది కళ్యాణి.

“అబ్బా..చెప్పమ్మా..”గారంగా అడిగాడు కేశవ్.

“సరే... ఇలా రా” అని తన కొడుకు చెయ్యి తన పొట్టమీద పెట్టుకొని “ఇదిగో ఈ పొట్టలో నుంచి పుట్టావు కాబట్టి నీకు అమ్మను అయ్యాను” అని చెప్పింది కళ్యాణి.

“ఓహో... అయితే నువ్వు అమ్మగారిని ‘అమ్మగా రండి’అనిపిలుస్తావ్ కదా! అంటే ఆవిడ నీకు అమ్మా? ఐతే నువ్వు ఆవిడ దగ్గర ఉండాలి కదా! మనం ఈ గుడిసెలో ఎందుకుంటున్నాం?ఆ ఇంట్లోనే ఉండొచ్చు కదా?” మరో ప్రశ్న వేశాడు కేశవ్.

“నోర్మూయ్యిరా! ఏమిటా వాగుడు? వాళ్ళు మన యజమానులు... మనం వాళ్ళింట్లో పనిచేసేవాళ్ళం అనసూయమ్మగారు మనకి అన్నంపెడుతున్న దేవత. మనకి గుళ్ళోదేవత ఎంతో, ఈవిడా అంతే!

ఆ దేవతని ‘అమ్మా’ అని పిలిచినట్లు ఈవిడనీ పిలుస్తాను. ఎందుకో పెద్దయ్యాక నీకు అర్థమవుతుందిలే” అన్నం ముద్దలు కలిపి నోటికి అందిస్తూ అన్నది కళ్యాణి.

ఆ తరువాత తనూ అన్నం తినేసి, గిన్నెలు తోముకొని, వంటగదిసర్దుకొని వచ్చి కొడుకు పక్కన పడుకుంది కళ్యాణి జోకొడుతూ.

గుడివాడలో వ్యవసాయ కూలీలుగా పని చేసే అమ్మా-నాన్న తనకి ఇష్టంలేనిబావతో పెళ్ళిచేస్తామని పట్టుపట్టడంతో ఇంటి నుంచి పారిపోయి బందరు దగ్గర మంగినిపూడి చేరింది.

తన స్నేహితురాలు రుక్మిణి సహాయంతో అవతారంగారి స్కూల్‌లో ఆయాగా చేరింది.

అదే స్కూల్ రెండో అంతస్తు కట్టడానికి వచ్చిన మేస్త్రీ నరసింహంతో ప్రేమలో పడింది.

కళ్యాణి గతం తెలుసుకున్న అవతారం భార్య అనసూయమ్మ వాళ్ళ ప్రేమ విషయం కళ్యాణి తల్లిదండ్రులకి తెలియజేసింది.

ఏరోజైతే తమని కాదని ఇల్లు వదిలి వెళ్ళిందో, ఆ రోజునుంచే కళ్యాణి తమకి చచ్చినదానితో సమానమని కబురు పంపారు వాళ్ళు.

నరసింహం కూడా ఒంటరివాడు కావడంతో వాళ్ళిద్దరి పెళ్ళి తామే దగ్గరుండి జరిపించారు అనసూయమ్మ-అవతారంలు. అప్పటి నుంచి కళ్యాణి స్కూల్‌తో పాటు వాళ్ళ ఇంట్లో కూడా పనికి వెళ్ళసాగింది. మూడేళ్ళ పాటు ముచ్చటగా సాగిన వారి సంసారంలో లేకలేక పుట్టాడు కేశవ్. తాగిన మత్తులో ఒకరోజు తాపీ పనికెళ్ళిన నరసింహం మేడమీద నుంచి పట్టుతప్పి క్రిందకి పడిపోయి ప్రాణాలు వదిలాడు.

దానితో తన పంచప్రాణాలు కేశవ్ మీద పెట్టుకొని కాలం గడుపుతూ వస్తోంది కళ్యాణి. తమ కళ్ళముందు పుట్టి పెరుగుతున్న కేశవ్ అంటే ప్రత్యేక అభిమానం అవతారం దంపతులకి.

చదువులో ఓ మాదిరిగా రాణించిన కేశవ్‌కి వ్యవసాయంమీద ఉన్న మక్కువ గమనించిన అవతారంగారు తగిన శిక్షణ ఇప్పించి బాపట్లలో ఉన్న అగ్రికల్చరల్ కాలేజ్‌లో చేర్పించారు. వీలు చిక్కినప్పుడల్లా మంగినిపూడిలో వాలిపోయేవాడు కేశవ్.అక్కడ అవతారంగారి పొలం పనుల్లో చురుగ్గా పాలుపంచుకునేవాడు.

అనసూయమ్మ - అవతారం గారికి కవల పిల్లలు. రామ-కృష్ణఅని పేరుపెట్టారు వాళ్ళకి.చదువులో రాణించిన ఆ ఇద్దరూ ఐ.ఐ.టి. నుంచి ఇంజనీరింగ్ చేశారు. పై చదువులకి విదేశాలకి సైతం వెళ్ళారు.

“ఏరా... పై చదువులకి విదేశాలకి వెళ్తున్నాం అని చెప్పి, తీరా చదువు ముగిసి వెనక్కి తిరిగిరావలసిన ఈ తరుణంలో అక్కడే ఉద్యోగం చేసుకుంటూ స్థిరపడతామంటే ఎలాగా? ఫోన్‌లో కాదు, ముందు ఆ పరీక్షలేవో కాగానే ఒకసారి ఇక్కడికి రండి. మిగతా విషయాలు అప్పుడే మాట్లాడుకుందాం” విసురుగా ఫోన్ పెట్టేశారు అవతారంగారు.

“సినిమాల్లో చూసినప్పుడు, కథల్లో చదివినప్పుడు వీళ్ళు మరీ అతిగా చేస్తారు... నిజజీవితంలో అలా ఎలా జరుగుతుంది అనుకునేదాన్ని.

వీళ్ళిలా తయారవుతారని అస్సలు అనుకోలేదు. నా నమ్మకాన్ని వమ్ముచేస్తామని అంటున్నారు. ఇప్పుడెలాగా?” అవతారం ద్వారా విషయం తెలుసుకుని అన్నది అనసూయమ్మ దిగులుగా.

“ముందు వాళ్ళని ఇక్కడికి రానీ అనసూయా... కాళ్ళు విరగ్గొట్టి కూర్చోబెడతా” చుట్ట వెలిగిస్తూ అన్నాడు అవతారం.

“ఆదేశం గురించి మీకసలు ఏమాత్రం అవగాహన లేకపోవడంతో అలా మాట్లాడుతున్నారు. జీవితాన్ని ఎలా ఎంజాయ్ చెయ్యాలో అక్కడికి వెళ్ళాకే తెలిసింది మాకు. మీకు కూడా తప్పకుండా నచ్చుతుంది. నా మాట విని మీరూ అక్కడికి వచ్చెయ్యండి..”తండ్రివైపుచూస్తూ అన్నాడు రామ్.

“అన్నయ్య చెప్పింది నిజమమ్మా! పోనీ కొన్నాళ్ళు వచ్చి చూడండి. నచ్చకపోతే వెనక్కి వచ్చేద్దురు గాని. అక్కడ శ్రమకితగ్గ గుర్తింపువుంది,డబ్బువుంది,సుఖం ఉంది...” అన్నకి మద్దతుగా అన్నాడు కృష్ణ.



"మీరిద్దరూ ఇక్కడికి వచ్చేముందే నిర్ణయించేసుకొని, కేవలం మమ్మల్ని ఒప్పించడానికి వచ్చివుంటే గనక మీ ప్రయత్నం వృథా! మీరంటున్నది మీవరకూ సమంజసం కావొచ్చు...కానీ మేము ఈ ఊరు వదలి రావడంఅంటూ ఎన్నటికీ జరగదు" తేల్చిచెప్పాడు.

"అటువంటప్పుడు మమ్మల్ని అంత పెద్ద చదువులు ఎందుకు చదివించారు. విదేశాలకి ఎందుకు పంపించారు నాన్నా? మమ్మల్ని కూడా ఆ కేశవ్‌గాడిలాగా మన పొలాలకి పనికొచ్చే చదువేదో చదివించి ఉంటే ఆ పొలంపనులు చూసుకుంటూ ఇక్కడే పడుండేవాళ్ళం కదా?

ఇప్పుడు మేమేదో తప్పు మాట్లాడుతున్నామని ఎందుకు భావిస్తున్నారు?" అడిగాడు కృష్ణ.

"వాడన్నది అక్షరాలా నిజం. కేవలం ఈ ఊరు వదలిరావడం ఇష్టం లేదు కాబట్టి, మా నిర్ణయం తప్పని భావించడం తప్పు.

పోనీ, ఇప్పుడు మీరు అనుకుంటున్నట్టు మేము వెనక్కి తిరిగివచ్చేస్తే ఈ మంగినిపూడిలో మా చదువుకి తగ్గ ఉద్యోగం ఏముంది? అప్పుడు కూడా ఏ బొంబాయో, హైదరాబాదో, బెంగళూరో... అంతే కదా! ఈ ఊరు వదిలి అక్కడికి కూడా మీరు రారు కదా! అటువంటప్పుడు మేము బొంబాయిలో ఉన్నా బోస్టన్‌లో ఉన్నా ఒకటే కదా!

విదేశంలో ఉద్యోగం చేస్తామన్నంతమాత్రాన మీమీద, ఈ దేశంమీద అభిమానం ఉండదని ఎందుకు భావిస్తున్నారు?

విదేశంలో ఉండడం పాపం కాదే! మిమ్మల్ని వదిలి దూరంగా ఉండటం అంటారా... చదువుకునే రోజుల నుంచే దూరంగా ఉంటున్నాము. అంతమాత్రాన మీరంటే లెక్కలేనట్టు కాదు కదా! ఉద్యోగమనో, వ్యాపారమనో, పెళ్ళనో... కారణం ఏదైతేనేం... మనదేశంలో కూడా కోట్లాదిమంది తమ తల్లిదండ్రులకి దూరంగానే ఉంటున్నారు. అదితప్పంటారా?" ఆవేశంగా అన్నాడు రామ్.

"అలా అంటావేమిట్రా! చదువుకోసం దూరంగా ఉండటం తాత్కాలికం. మీరు ఈ దేశంలో ఉద్యోగం చేసుకుంటే మాకు అందుబాటులో ఉంటారు.

రేపు మీ పిల్లలు ఈ దేశం సంస్కృతి-సంప్రదాయం చక్కగా నేర్చుకుంటారు. మీరిటు రావడానికయినా, మేము మీ ఊరికి వచ్చిపోవాలన్నా సులువు.

ఆ దేశం కాని దేశంలో ఊరు తెలియక, భాషరాక,మనవాళ్ళు ఎవరూలేక, మాకు కావలసిన కాలక్షేపం దొరక్క వచ్చి ఏమి చెయ్యమంటావ్? మీరు ఆఫీసులకెళితే ఆ నాలుగ్గోడల మధ్య ఎంతకాలం కూర్చోవాలి? కాస్త మావైపు నుంచి కూడా ఆలోచించండి" అన్నది అనసూయమ్మ.

"మనం కేవలం మనవైపు నుంచే ఆలోచిస్తున్నాం అనసూయా. వాళ్ళన్నదీ నిజమే! రెక్కలు వచ్చిన పక్షులని ఆరెక్కలు కత్తిరించుకొని గూటిలోనే కూర్చోని ఉండమనడం సరికాదు. ఇంతకాలం చదువు పేరుతో అక్కడ ఉన్నారు. ఇప్పుడు ఉద్యోగం పేరుతో ఉంటారు. అంతేకదా!

చూడండ్రా... ఇకపై మీకు అడ్డుచెప్పం. మీరెక్కడున్నా సుఖంగా ఉండటమే మాకు కావలసింది. మీరిప్పుడు ఎదిగిన బిడ్డలని మాకు గుర్తుచేశారు. మీ అంత బాగా విషయం మాట్లాడటానికి మేమంత పెద్ద చదువులు చదువుకోలేదు.

దేశ-విదేశాలు తిరగనూ లేదు... ఇకపోతే మీతో పాటు మేము ఆ దేశం వచ్చి ఉండటం కష్టం...

మాకు ఇక్కడ ఉండటమే ఇష్టం... మమ్మల్ని ఒప్పిద్దామని మీ విలువైన సమయాన్ని నష్టంచేసుకోకండి" పడక్కుర్చీలో వెనక్కి వాలుతూ అన్నాడు అవతారం.

"మీరు నిష్ఠూరంగా అన్నా, మేము తప్పుగా ఆలోచించట్లేదని మీకు అర్థమయినందుకు ఆనందంగా ఉంది నాన్నా. వీలున్నప్పుడల్లా మీ దగ్గరికి వచ్చి వాలిపోతాం.మీరుఎప్పుడుమనసుమార్చుకుంటే అప్పుడు మిమ్మల్ని మాతోపాటు తీసుకెళ్తాం" సంతోషంగా అన్నాడు కృష్ణ.

"తప్పు మీలో లేదురా... మాలోనే ఉంది. మారుతున్న కాలానికి, అవసరాలకి, పరిస్థితులకి తగ్గట్టుగా మారలేకపోవడం మాదే తప్పు. మా ఆలోచనలు మీకు తుప్పుపట్టినట్లు అనిపించినా, వాటిల్లోనే బ్రతకడం మాకు తప్పదు, మేము మారలేము" అక్కడి నుంచి లేచి వెళుతూ అన్నాడు అవతారం.

అలా విదేశాలకి వెళ్ళిన రామ-కృష్ణలు మళ్ళీ రెండేళ్ళదాకా తిరిగి ఇండియా వచ్చే ఆలోచన చేయలేదు. అనసూయమ్మ వాళ్ళకి సంబంధాలు వెతకడం మొదలుపెట్టింది.

చెరి నాలుగు సంబంధాలైనా సిద్ధపడ్డాక ఒకే సారి చూడటానికి వస్తామని కబురుపెట్టారు రామ-కృష్ణలు. అవతారం-అనసూయమ్మల అవసరాలు కనిపెడుతూ వాళ్ళని అంటిపెట్టుకొని ఉన్నాడు కేశవ్. డిగ్రీ పూర్తయ్యాక అవతారం గారి పొలం కౌలుకి తీసుకొని ఆ పనులు చూసుకుంటూ మంగినిపూడిలోనే ఉండిపోయాడు.

"ఒరే కేశవా... నా కొడుకులు ఎలాగూ వెనక్కి తిరిగిరారు. వాళ్ళకి మేమూ అక్కర్లేదు... మా ఆస్తి అక్కర్లేదు.నువ్వేమోమమ్మల్నివదిలి ఎక్కడికీపోవు. అందుకే, మా తర్వాత నా ఆస్తి అంతా నీ పేరు మీద రాద్దామని నేను... అనసూయ అనుకుంటున్నాం... ఏమంటావ్?" ఒకరోజు పొలం చూడటానికి వచ్చి, చుట్ట వెలిగిస్తూ అన్నాడు అవతారం.

"ఊర్కోండి అయ్యగారూ... మీరు మరీను... దూరంగా ఉన్నంతమాత్రాన, వాళ్ళు ఒద్దన్నమాత్రాన మీ ఆస్తులు వాళ్ళవి కాకుండాపోతాయా? దగ్గరగా ఉన్నంతమాత్రాన నేను మీ సంతానమెలా అవుతాను? మీ ఆస్తిని ఎలా ఆశిస్తాను.

## విరామాలు అవసరం

ఎప్పటికప్పుడు చిన్న చిన్న బ్రేక్స్ తీసుకుని సేద తీరాలన్నది 'మనస్సుకు నచ్చింది' ఫేమ్ త్రిథాచౌదరి అభిప్రాయం.

"బిజీ షెడ్యూల్‌నుంచి విరామం తీసుకోవడం అనేది నా స్ట్రైస్ బస్టర్. ఇది తిరిగి తాజాదనాన్ని నింపు తుందని భావిస్తుంటాను.

టైప్‌కాస్ట్ నాకు ఇష్టం లేదు. విభిన్నపాత్రలు పోషించడ మనేది ఓ అభ్యాస ప్రక్రియ.

కొత్త సినిమాలకు సంతకాలు చేయాలన్న కంగారేమీ నాకు లేదు. నచ్చినవాటినే ఎంచుకుంటాను" అని చెప్పింది.

మా నాన్న మీద, అమ్మ మీద మీరు చూపించిన అభిమానం నామీద చూపించిన ప్రేమ - వాత్సల్యం అవి చాలు మాకు. మీరుపెట్టిన భిక్షతో నేను నిలదొక్కుకున్నాను.

ఈ పంట చూడండి... ఎలా పండించానో! నిన్ననే చక్కటి రేటుకి బేరం కుదిరింది, పండించినదంతా అమ్ముడుపోయింది. రెండ్రోజుల్లో కోతలు మొదలవుతాయి. చేతికి డబ్బులు వస్తాయి.

నేను, అమ్మా సుఖంగా బ్రతకడానికి కావలసిన శక్తి ఆ దేవుడు ఇచ్చాడు. కొండంత అండగా మీరున్నారు. ఇది చాలు నాకు..." తృప్తిగా పొలం చూపిస్తూ అన్నాడు కేశవ్.

"రాలిపోయే ఆకులు అండగా ఉండటానికి పనికిరావు కేశవ్" అని అతని భుజం తట్టి అక్కడి నుంచి బయల్దేరాడు అవతారం.



ఆ సంఘటన జరిగిన వారంరోజుల్లో నిద్రలో ప్రశాంతంగా తనువు చాలించాడు అవతారం. విషయం తెలిసిన వెంటనే బయల్దేరి వచ్చారు రామ-కృష్ణులు. అవతారం అంత్యక్రియలకి మొత్తం మంగినిపూడి తరలివచ్చింది. చుట్టుపక్కల ప్రాంతాల రాజకీయ నాయకులు, పరిచయమున్న ప్రముఖులు వచ్చారు.తమ తండ్రికి అక్కడ ఉన్న ఆదరణ చూసి ఆశ్చర్యం వేసింది రామ-కృష్ణులకి.

"అనసూయమ్మగారు..చనిపోవడానికి పదిరోజుల ముందు అవతారంగారు నన్ను కలిశారు. తానింక భూమి మీద ఎంతోకాలం ఉండనని అనిపిస్తోందని చెప్పారు. ఈ విషయం మీతో అంటే బెంగపడతారని, నాతో చెబుతున్నా అన్నారు.

అప్పుడే ఆయన వీలునామా రాశారు. తను పోయాక, పన్నెండోరోజు కార్యక్రమంలో అందరి ముందు ఈ వీలునామా చదివి వినిపించాలని కోరారు. అలాగే ఒకసీల్డ్‌కవర్ నా చేతిలో ఉంచారు.

ఒకవేళ మీ కుమారులు వచ్చి కార్యక్రమాలు నిర్వహిస్తే అప్పుడు ముందు ఆ కవర్ చింపి, అందరి ముందు చదివి, ఆ తరువాత వీలునామా చదవమన్నారు. ఇవాళ పన్నెండోరోజు.

పెద్దలుఅనేకులుఇక్కడేఉన్నారు. మరి ఆ ఉత్తరం చదవమంటారా?" చేతిలో రెండు కవర్లు పట్టుకుని కార్యక్రమానికి వచ్చిన లాయర్ విశ్వేశం అడిగాడు.

"చదవండి..." ముక్తసరిగా అన్నది అనసూయమ్మ. అక్కడ వున్నవారందరూ ఆసక్తిగా వినడం మొదలెట్టారు. "రామ-కృష్ణలకి... మీరు నా అంత్యక్రియలకి రావడం ఆనందం.వస్తారన్న చిన్ని నమ్మకంతోనే నా మనసులో మాటలు ఈ ఉత్తరంలో రాస్తున్నా! మీ బిజీజీవితాలనుంచి ఈ పన్నెండు రోజులు నాకు కేటాయించారు. సంతోషం!

ఏదో సాధించెయ్యాలని, జీవితంలో ఎంతో ఎత్తుకు ఎదగాలని, అందుకు మనదేశంకన్నా విదేశమే సరి అయిన ప్రదేశమని నేను ఎప్పుడూ భావించలేదు. ఉన్నంతలో ఆనందంగా ఉండటం, ఉన్నదానితో తృప్తిగా బ్రతకడం... ఇంతే నాకు తెలిసింది.

న్యాయశాస్త్రం ప్రకారం, తరతరాలుగా నాకు సంక్రమించిన ఆస్తిపై హక్కు, ధర్మశాస్త్రంప్రకారం నా అంతిమసంస్కారాలు చేసే హక్కు మీకే చెందుతాయి. కానీ నాకో అనుమానం.

ఒకవేళ మీకు రాకపోవడానికి కుదరకపోతే ఎలా అని! అందుకే విశ్వేశంగారికి ఇంకో ఉత్తరం ఇచ్చాను. నేను పోయిన రెండ్రోజులకి కూడా మీరు రాకపోతే, ఆ ఉత్తరం చింపి చదివి అందులో రాసినవిధంగా చెయ్యమని.

అందులో నా అంతిమ సంస్కారాలు కేశవ్‌చేత చేయించమని రాశాను.వీలునామాలో నా స్వార్జితం నా తరువాత అనసూయకి, ఆ తరువాత కేశవ్‌కి చెందాలని రాశాను.ఒకవేళ వాడు నా ఆస్తిని ఆశించకపోతే ఆ ఆస్తిని అమ్మి అనసూయ పేరిట ట్రస్ట్ తెరిచి అనాథపిల్లలని ఆదుకోమని రాశాను.

వాడు చేస్తాడన్న నమ్మకం నాకుంది. చివరగా ఒక్క కోరిక... అనసూయని ఇప్పుడు మీతో తీస్కెళ్ళాలని ప్రయత్నించొద్దు.

నాకు తెలిసీ తన అభిప్రాయం కూడా అదే!ఒక్కతే ఇక్కడ ఎలా ఉంటుందన్న బెంగ నాకు లేదు. తన చిన్నకొడుకు కేశవ్ ఉన్నాడు చూసుకోడానికి.

ఆఖరుగా ఒక్కమాట... మీరు జీవితం సుఖంగా గడపడానికి తీసుకున్న నిర్ణయంతో నేను పడిన బాధ మీకిప్పుడు అర్థం కాదు.

ఆ బాధ మీకు అవగతమైన రోజు ఆ నొప్పి ఏంటో తెలుస్తుంది. నా జీవితంలో నేను నేర్చుకున్న అత్యుత్తమ పాఠం... కేవలం కడుపున పుట్టినంత మాత్రాన సంతానం కారు... కనిపెట్టుకు చూసినవారే సంతానంతో సమానమని! ఇంకా గట్టిగా చెప్పాలంటే అసలు సంతానం కంటే అలా చూసుకునేవారే విలువైనవారు, నిజమైన సంతానం!

నా ఆశీర్వాదాలు.. ఈ జీవితానికిక సెలవు... అవతారం!" కళ్ళు చెమరుస్తూండగా చదవడం ముగించాడు లాయరు విశ్వేశం. అక్కడున్నవారందరి మనసులు బరువెక్కాయి.

ఏ భావం కనపడకుండా అవతారం ఫోటో వైపు చూస్తూ ఉండిపోయిన అనసూయని ఓదారుస్తున్నట్లు భుజంచుట్టూ చెయ్యి వేశాడు కేశవ్.

కళ్ళనీళ్ళు ధారగా కారుతుండగా వాళ్ళిద్దరినీ చూస్తూ ఉండిపోయారు రామ-కృష్ణులు.

The human race has one really effective weapon, that is laughter.



Courtesy : MISIMI

## ఐరన్ పెరగాలంటే

ఆధునిక జీవనంలో ఆహారం సరిగ్గా తీసుకోక పోవడంవల్ల అనేకమంది నోటివెంట రక్తహీనత అన్న మాట వినపడుతున్నది. శరీరంలో తగినంత ఐరన్ లేకపోవడంవల్ల ఈసమస్య తలెత్తుతుంది.

ఈ సమస్యను అధిగమించడానికి తగిన ఆహారం తీసుకోవాలి. బీట్‌రూట్ ఐరన్ అందించ డంలో తిరుగులేనిది.శరీరంలోని మలినాలను వెలికి నెడుతుంది. ఖర్జూరాల్లో విటమిన్ సి, ఐరన్ ఎక్కు వగా వుంటాయి. దానిమ్మలోని విటమిన్ 'సి' ఇను మును శరీరం గ్రహించడంలో సహకరిస్తుంది.

రోజూ దానిమ్మరసం తాగుతుంటే రక్తంలో హిమోగ్లోబిన్ పెరుగుతుంది.ప్రతిరోజూ ఒక అరటి పండును తేనెతో కలిపి తింటుంటే ఎర్ర రక్త కణాలు వృద్ధి అవుతాయి. మెంతి, తోటకూర,పాల కూరల్లో ఇనుము పుష్కలంగా లభిస్తుంది. ◆

## 'తీపి' కోరిక

కారణం ఏదైనా కాని ఎంత వద్దనుకుంటున్నా తీపి తినాలని మనస్సూ, నాలుక లాగేస్తుంటాయి. ఏదో ఒక తీపి పదార్థాన్ని తినేస్తారు. దీనికి బదులు ఆరోగ్యకర ప్రత్యామ్నాయాలు వెతుక్కోవాలి.

అరటి, యాపిల్, జామ వంటి పండ్లు ఇంట్లో వుంచుకోవాలి. తీపి తినాలనిపించినప్పుడు వీటిని తింటే ఆరోగ్యం, పోషకాలు రెండూ దక్కుతాయి. ఖర్జూరపండ్లనూ అందుబాటులో వుంచుకోవాలి. స్వీట్స్ తినాలనిపించినప్పుడు ఓ రెండు ఖర్జూరాలు తింటే, తీపి కోరిక తీరడంతోపాటు శరీరానికి కావాల్సిన ఐరన్‌కూడా అందుతుంది. ◆

## పరీక్షల ట్రీట్

ఇది పరీక్షల సీజన్. సిద్ధం అయ్యే పిల్లలూ, వారిని సిద్ధంచేసే పెద్దలూకూడా టెన్షన్‌పడుతుం టారు. పిల్లలు చురుగ్గా, అలసట లేకుండా వుంటే వారిలో జ్ఞాపకశక్తి బాగా మెరుగవుతుంది. అందుకు తగిన ఆహారాన్ని వారికి అందిస్తుండాలి.

గింజలు, నట్స్ తినడంవల్ల జ్ఞాపకశక్తి, మెదడు తీరూ మరింత మెరుగవుతాయి. బాదంపప్పులు, పిస్తా పప్పులు, జీడిపప్పుల్లో ఉత్తమ ఫ్యాట్స్, ఎసెన్షి యల్ ఆయిల్స్ లభిస్తాయి. గుమ్మడిగింజలు, పొద్దుతిరుగుడు, నువ్వులు, నట్స్ తింటుండాలి.

తాజా ఆకుకూరలు, విభిన్న రంగుల పండ్లు, కూరగాయలు తినడంవల్ల యాంటీ ఆక్సిడెంట్స్ లభిస్తాయి. మెదడుకు ఆకుకూరలు చాలా మేలు చేస్తాయి. తులసి, కొత్తిమీర, దాల్చినచెక్కలను ఆహారంలో భాగం చేస్తుండాలి. మధ్యమధ్యలో వారికి నచ్చిన పదార్థాలతో ట్రీట్స్ ఇస్తుంటే హాయిగా, ప్రశాంతంగా చదువుకుంటారు. ◆

## రక్తపోటు నియంత్రణ

కమలా పండ్లలో 'సి' విటమిన్ ఎక్కువగా వుండడంవల్ల రోగనిరోధకశక్తిని పెంచుతాయన్నది ఎప్పుడూ చెప్పుకునే సంగతే. కమలాపండ్లలో క్యాల రీలు బాగా తక్కువ.ఫోలేట్ సమృద్ధిగా లభిస్తుంది. యాంటీ ఆక్సిడెంట్లు అధికంగా వుంటాయి.వీటిలోని పొటాషియం రక్తపోటును తగ్గించడంలో బాగా పని చేస్తుంది. కొలెస్ట్రాల్‌ను తగ్గించడంద్వారా గుండె జబ్బుల అవకాశాలను నియంత్రిస్తుంది.

క్రమంతప్పకుండా కమలాపండ్లు తినేవారికి స్ట్రోక్, గుండెజబ్బులు వచ్చే అవకాశాలు తక్కువని అధ్యయనాలు పేర్కొంటున్నాయి.

దీర్ఘకాలిక వ్యాధులతో తరచూ ఇబ్బందిపడేవారు ప్రతిరోజూ ఓ కమలాపండు తింటుంటే మంచి ఫలితం వుంటుంది.



# ఓటమి తర్వాతే గెలుపు

భౌతిక సుఖాలకోసం అమితంగా పరుగు తీస్తున్న నేటికాలంలో, పెరిగే పిల్లలు తమకు లభించే గుర్తింపును, బహుమతులను కూడా ఏదో ఒక భౌతికరూపంలోనే కోరుకుంటున్నారు.

పాత పరుగు ఆగేలోపే కొత్త పరుగు మొదలు పెడుతున్నారు. ఓటమిని ఒప్పుకోలేకపోతున్నారు. అన్నింటా తామే గెలవాలన్న విపరీత ఆలోచన, ఓటమిని ఎలా స్వీకరించాలో తెలియనివ్వట్లేదు.

"అమ్మ ఇది నా బ్యాట్. నేను ఎప్పుడుఆడాలనుకుంటే, ఎన్నిసార్లు ఆడాలనుకుంటే అన్నిసార్లు నన్ను బ్యాటింగ్ చేయనివ్వాలి"

"నేను వాడితో ఇంకెప్పుడు ఆడను, వాడు మాటిమాటికి రూల్స్‌మార్చేస్తున్నాడు,మోసంచేస్తున్నాడు"

"అందరు పిల్లలు గ్యాంగ్‌లా తయారయి, నన్ను దూరం పెట్టారు. నేను చెప్పేది ఏమీ వినిపించుకోవట్లేదు" ఇలాంటి పిల్లల తగాదాలన్నీకూడా ఎక్కువ ఆట స్థలంలోనే జరుగుతాయి.

మీ పిల్ల లేదా పిల్లవాడు ఒక్కోసారి ఆట ఓడిపోయామనో, వాళ్ళకి బ్యాటింగ్ ఇవ్వలేదనో, వాళ్ళ గ్రూపులో ఎవరు చేరలేదనో ఏడుస్తూ మీ దగ్గరకు వచ్చి కంప్లైంట్‌లు చెప్తారు.

ఆటస్థలంలో పిల్లలు వాళ్ళ సొంత రూల్స్‌తయారు చేసుకుంటారు. వాళ్ళ గెలుపులు, ఓటములు అన్నీ కూడా వాళ్ళ రూల్స్ ప్రకారం వుంటాయి. పిల్లలందరూ కూడా తమదైన సొంత దృష్టి కోణంతో చూస్తారు. ఇది పిల్లల అభివృద్ధిలో ఒక భాగం.

దానివల్ల పరిస్థితులను దాటి చూడలేరు. ఎవ్వరైనా వాళ్ళని కాదంటే తమపై దాడిలా భావిస్తారు. అటువంటప్పుడు పిల్లలను సరైన మార్గంలోకి పెట్టడానికి ఇలా ప్రయత్నించండి.

* పిల్లలని ఆటలలో జరిగిన విషయాన్నంతా, వివరంగా మీకు మాటలలో చెప్పమనండి.
* ఓడిపోవటంవల్ల, వాళ్ళు ఎందుకు, ఎలా బాధపడుతున్నారో అడగండి.
* వారి ఫీలింగ్స్‌కి ఓ పేరు పెట్టమని అడగండి.
* పిల్లలు ఒకవేళ ఎదుట పక్షంలో వుంటే ఏమి చేసేవాళ్ళో అడగండి.
* చివరిగా ఈసారి ఆడేటప్పుడు ఎలా ఆడాలో అలా ఆడితే గెలుపు, ఓటములతో సంబంధం లేకుండా ఎంత సరదాగా,సంతోషంగా వుంటుందో, వారికి అర్థమయ్యేటట్టు చెప్పండి.

## * పోటీ పరీక్షలలో

"నేను చాలా కష్టపడి పెయింటింగ్ వేశాను, నాకెందుకు ప్రైజ్ రాలేదు"

"వాడంటే టీచరుకు బాగా ఇష్టం. అందుకే వాడికి ఎప్పుడూ నాకంటే ఎక్కువ మార్కులు వస్తాయి"

"పిల్లలు, ఎన్నో రకాల పోటీలలో పాల్గొంటూ వుంటారు. ఈ రోజులలో స్కూలు యాజమాన్యాలు కూడా చదువుతోపాటుగా ధీటుగా ఇతర విషయాలలో కూడా పిల్లలను ప్రోత్సహిస్తూ, వారికి పోటీలుపెడుతోంది. డ్రాయింగ్, పాటలు పాడటం, నాట్యం, హస్త కళలు లేదా ఫ్యాన్సీ డ్రెస్‌లాంటి అనేక విషయాలలో పోటీలు జరుగుతున్నాయి.

నేడు పిల్లలు తమ చిన్నతనంనుంచే పోటీలు నెగ్గటం, బహుమతులు గెలుచుకోవటం అన్న విషయాన్ని అర్థంచేసుకుంటున్నారు. అవి వారికి, వారి కష్టానికి ప్రోత్సహకాలుగా ప్రేరణ కలిగించేవిగా వుంటున్నాయి. కానీ ఏ పోటీలు అయినా గెలుపు, మొదటి ఇద్దరితో, ముగ్గురితో మాత్రమే అవుతుంది. అందరికీ బహుమతి ఇవ్వటం కుదరదు.

అందుచేత బహుమతులు రాకపోతే భవిష్యత్తులో జరిగే రకరకాల పిల్లల పోటీలకు వెళ్ళాలనే ఉత్సాహం పిల్లలలో తగ్గిపోతుంది. ఇలాంటి పరిస్థితిని సరిదిద్దటానికి :

* మీ పిల్లలు మానసికంగా, తమను తాము ప్రేరేపించుకునేట్లుగా తీర్చిదిద్దండి. దానివల్ల బయట ప్రపంచంలో వచ్చే బహుమతులకన్నా మానసిక తృప్తి గొప్పదని తెలుసుకుంటారు.

  "వచ్చేసారి ఇలా చేసి చూడు. నువ్వెందుకు గెలవవో చూద్దాం" అని కాకుండా అద్భుతం ఎంత బాగా గీశావురా పెయింటింగ్‌ని. నువ్వు వేసిన రంగులు ఎంత బావున్నాయంటే ఆ బొమ్మ నిజమైనదేమో అన్నంత బావుంది. అలా చెప్పి అక్కడితో ఆగిపోవటం మంచిది.
* పిల్లలు సాధించిన ప్రతి చిన్న విషయానికి ఏదో బహుమతి ఇవ్వటం అలవాటు చేయకండి. పిల్లలకు కావాల్సింది వారి కంటికి కనిపించే బహుమతులే కాదు, అంతకంటే ఎక్కువగా మీ పొగడ్త మరియు ప్రోత్సాహం ఎక్కువ అవసరం.

  ఇలా చేయటంవల్ల భవిష్యత్తులో పిల్లలు గెలుపును, ఓటమిని సొంత దృష్టితో కాక, సరైన విధానంలో చూసేవిధంగా తమనితాము మలుచుకుంటారు. గెలుపుతో సమానంగా ఓటమిని స్వీకరించేలా మానసికంగా ఎదుగుతారు.

  దాంతో వారు ఏ పోటీ పరీక్షలో పాల్గొన్నా తమ నైపుణ్యాలను చూపించటానికీ, ప్రతిభను ప్రకటించుకోవటానికి వేదికగా వాడుకుంటారు. అంతే



Courtesy : You & I

గానీ, ఈ పనిచేస్తే నాకేమి లాభమని ఆలోచిస్తూ కూలబడిపోరు.

* పోలిక మంచిది కాదు. పక్కవాడు గీసిన బొమ్మ లాంటిదే నీవు గీసి వుంటే బహుమతి వచ్చేదేమో కదా అని ఎప్పుడూ పిల్లలతో అనకూడదు. అందుచేత పిల్లలు ఓడిపోయామని నిరుత్సాహ పడితే గెలిచినవాడు ఏంచేస్తే గెలిచాడు అని ఎప్పుడూ అడగరాదు. "ఈసారి పోటీలో నువ్వు ఏమి చేద్దాం అనుకుంటున్నావు? ఎలా చేద్దాం అనుకుంటున్నావు? అని అడగాలి. వారికి కావాల్సిన సహాయాన్ని అందించాలి.

## * క్రీడలలో

"నేను ఓడిపోతున్నాఅనిపించింది.దాంతోఎదుటి వాడి దృష్టిని పక్కకి మరలించి నేను గెలిచాను"

"మా టీమ్‌మొత్తంమీద అందరికంటేనేనే ఎక్కువ స్కోర్‌చేయాలి. అందుకోసం ఏదైనా చేస్తాను"

"మా టీమ్ గెలిచింది. అయినా సరే నాకు మ్యాన్ ఆఫ్ ది మ్యాచ్ ఎందుకివ్వలేదు"

క్రీడలు, యుద్ధరంగంలాంటివి వాటిల్లో గెలుపు, ఓటములు ఆటగాళ్ళపై తీవ్ర ప్రభావాన్ని చూపిస్తాయి. మీ పిల్లలలో స్పోర్ట్స్‌మ్యాన్‌షిప్, క్రీడా స్ఫూర్తిని పెంపొందించగలిగితే జీవితంలో అన్ని విషయాలలో కూడా వారు ఆత్మవిశ్వాసంతో, హుందాగా వ్యవహరిస్తారు. క్రీడాస్ఫూర్తి అంటే ఆటను ఆడటాన్ని ఇష్టపడటం. ఇక్కడ గెలుపు, ఓటములతో సంబంధం లేదు.

ఎవరైతే సాధ్యమైనంత బాగా ఆడాలని భావిస్తారో వారు ఆరోగ్యకరమైన పోటీతత్వాన్ని కలిగివుంటారు. పిల్లలలో క్రీడాస్ఫూర్తిని వుంచటానికి, పెంచటానికి ఏమి చేయాలి?

* క్రీడలలో ఓడిపోవటం అంటే ఎవ్వరు బాగా ఆడారో తెలుసుకోవటం. అలా తెలుసుకుని తమ నైపుణ్యాలను మరింత పదునుపెట్టుకోవటం సరైన అభ్యాసం చేయటంవల్ల సరిగ్గా ఆడగలుగుతారు. మోసంచేసి గెలవటం మనిషికి నిజమైన సంతోషాన్ని ఎప్పుడూ ఇవ్వదు. అలాగే ఎదుటి పక్షం వాళ్ళు మోసంచేసి గెలిస్తే అది చెప్పుకోవటానికే గానీ నిజానికి విజయం కాదు.

* క్రీడలలోగెలుపు అనేది సమిష్టిప్రయత్నం.టీమ్‌లో మెంబర్లు అందరూకూడా చక్కగా పనిచేయాలంటే వారు ట్రైనింగ్ ఇచ్చే కోచ్ కావచ్చు లేదా వాటర్ బాయ్ కావచ్చు.అందరినీ,వారు చేసే పనిని మెచ్చుకోవాలి, అభినందించాలి.గెలుపు, ఓటములు టీమ్ మొత్తానికి చెందుతాయిగానీ టీమ్‌లోని ఒక వ్యక్తికి మాత్రమే పరిమితం కావు.

* మన పిల్లలు గెలిచినా సరే, ఓడినా సరే, ఏది జరిగినా, ప్రత్యర్థి టీమ్ వారిని మెచ్చుకోవాలి. అంతే కాక గెలిచినవారి ఆట తీరులో పిల్లలకు నచ్చిన ఏవైనా రెండు అంశాలను చెప్తూ షేక్ హ్యాండ్ ఇచ్చి అభినందించమని చెప్పాలి, నేర్పాలి.
ఇలా చేయటంవల్ల పిల్లలలో వినయం పెరుగుతుంది. యథార్థస్థితిని అంగీకరించేట్టు చేస్తుంది. వారి మనస్సులో ఓడిపోయాం అన్న ఆలోచన రాకుండా చేస్తుంది.



Courtesy : Good Housekeeping

పోటీలోగెలవటమే ప్రధానం అయినప్పుడు ఓటమి చెందటం ఎక్కువ బాధిస్తుంది. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు గెలవటమే ముఖ్యమని పిల్లల మనస్సులోనికి ఎక్కిస్తే వారు నీతి, నిజాయితీలకంటే క్రీడాస్ఫూర్తికంటే పాల్గొనటంలోని ఆనందంకంటే, గెలుపే ముఖ్యమవుతుంది.

దానివల్ల పిల్లలను మనం పరోక్షంగా మోసం చేయమని ప్రేరేపించినట్టు అవుతుంది.

అలాకాక వారి నైపుణ్యాలను పెంచుకునేలా చేయూతను అందిస్తే మానసికంగా, శారీరకంగా సరైనరీతిలో ఎదుగుతారు. చేసే ప్రతిపనిని సంతోషంగా చేస్తారు. పనిచేయటంలో ఆనందాన్ని పొందుతారు. ఓటమిని హుందాగా స్వీకరిస్తారు.

క్రీడలు, ఆటలు ఆడటమే ఒక గొప్ప బహుమతి అని పిల్లల మనస్సులో నాటుకునేలా తరుచుగా గుర్తుచేస్తూ వుండాలి.

పాలపర్తి శ్రీకాంత్

సీరియల్

# హృదయం ఎక్కడున్నదీ...?



"ఆ సింహాసనంమీద పొదిగిన వజ్రాల్ని వెలకట్టలేం! కేవలం దసరా నవరాత్రు ళ్ళల్లో మాత్రమే ఆ బంగారు సింహాసనాన్ని ఉపయోగించేవారు! ఆ సింహాసనాన్ని అంత పవిత్రంగా చూసుకునేవారు!"

"ఆ సింహాసనం ఇప్పటికీ అలానే ఉందా?" ఓ స్టూడెంట్ అడిగాడు.

"ఉంది. దాన్ని పటిష్టమైన భద్రతాఏర్పాట్ల మధ్య 'స్ట్రాంగ్ రూమ్'లో ఉంచారు"గైడ్ చెప్పాడు. "ఆ సింహాసనం మన గాలి జనార్దనరెడ్డి 'బంగారు కుర్చీ'లా ఉంటుందా?" కామెంట్ చేశాడు ఓ కొంటె కుర్రాడు.

## డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి

అందరూ పెద్దగా నవ్వారు. గైడ్ అప్పటికే ముందుకు వెళ్ళిపోయాడు. ఆ సైకప్పు మీద ఇవాళ్టికీ కొత్తగా అనిపిస్తున్న బర్మాటేక్ ఉడ్‌మీది కార్వింగ్‌ని అలా చూస్తూండిపోయిన యశస్వికి తన మెదడులోనే ఒక కార్వింగ్ జరుగుతున్నట్టు...

తన జీవితకాలమంతా ఈ జ్ఞాపకం అలా పదిలంగా నిలిచిపోయేట్టు అనిపించసాగింది.

"వస్తు నాణ్యతకూ, కళాకారుల హస్తనైపుణ్యానికీ రాజులు ఎంత విలువని ఇచ్చేవారో తెల్సుకోవాలంటే జన్మలో ఒక్కసారైనా ఈ కట్టడాన్ని చూడాల్సిందే!" చెప్పాడు విష్ణు.

కొంచెం ముందుకు నడిచి తైలవర్ణ చిత్రాల ముందు నిలబడింది. రాజా రవివర్మ స్వయంగా ఈ ప్యాలెస్‌కి నడిచివచ్చారంట! ఆయన ప్యాలెస్‌కి బహూకరించిన ఆ చిత్రాలు వెలకట్టలేనివి!ప్యాలెస్‌కే తలమానికంగా అత్యద్భుతంగా ఉన్నాయ్. మిగిలిన చిత్రాలు కూడా ఎంత అందంగా ఉన్నాయో?

అందులో తలపాగాలు, యుద్ధ కవచాలు ధరించి, శూలాలు, బల్లాలు పట్టుకున్న సైనికులు మందీ మార్బలంతో యుద్ధ సన్నద్ధులై ఉన్నారు.

మరో ప్రక్క ఎర్రటి కిరీటాలతో అపార సైన్యంతో కత్తులు ఝుళిపిస్తున్న రాజులు, రారాజులు!అందరూ ఈ క్షణంలోనో, మరోక్షణంలోనో నిజంగా ఆ చిత్రాల్లోంచి యుద్ధరంగంలోకి దూకేట్లు ఉన్నారు.

ఎన్నెన్నో అపురూపదృశ్యాల్ని నయనానందకరంగా కన్నులముందు సాక్షాత్కరింపచేసిన ఆ చిత్రకారుల కళావైభవం సమ్మోహనం!

ఆయా చిత్రకారులు ఇంత నైపుణ్యం సంపాదించటానికి జీవితకాలాన్నంతా వెచ్చించి ఉంటారేమో!?వారికంటూ విడిగా జీవితాలు, జీవిత భాగస్వాములు, పిల్లలు, బంధాలు, బాధ్యతలు, ఎమోషన్స్.... ఇహపరమైన జీవితమే ఉండి ఉండదేమో! అప్పుడే ఇన్ని కాలాలపాటు నిలిచిపోయే కళ, ఓ జాతి మొత్తం గర్వంగా చూపించుకోగలిగే కళని వెలువరించగలుగుతారేమో!

తపస్సు అంటే అదేగా!

ఆలోచిస్తుంటేనే ఆమె ఉద్వేగానికి లోనవ్వసాగింది. అనాలోచితంగానే కళ్ళు సజలయ్యాయ్! వాళ్ళ త్యాగానికి ఈ జాతి ఎన్ని వేల నివాళులు అర్పిస్తే సరిపోతుంది?

తర్వాత ఆమెని, విష్ణు 'ట్రోఫీ' రూమ్‌లోకి తీసుకెళ్ళాడు. ఆ గదుల్లో ఆయా శతాబ్దాలకు సంబంధించిన ఎన్నోరకాల ఆయుధాలు ఖడ్గాలు, తుపాకులు, ముద్గరాలు, కట్లార్‌లు మొదలైనవన్నీ ఎంతో జాగ్రత్తగా పొందుపరచబడివున్నాయ్!

ఆ రాజులు ఉపయోగించిన వస్త్రాలు, వారి ఆభరణాలు అన్నీ ఆ మ్యూజియమ్‌లో ప్రజల సందర్శనార్థం పొందుపరిచారు.

యుద్ధం తర్వాత రాజులకు అత్యంత వినోదాన్నిచ్చే ప్రక్రియ వేట మాత్రమే! అప్పటి రాజులు ఎలాంటి జంతువుల్ని వేటాడేవారో మనకు అర్థంకావటానికి కాబోలు వివిధ జంతువుల చర్మాల్లో స్టఫింగ్ చేసి ఆయా జంతువులకు ఆకారాన్ని ఇచ్చి ప్రదర్శనకు వీలుగా ఏర్పాటుచేశారు.

ఒక ఏనుగు తోకని 'యాష్ ట్రే'గా తీర్చిదిద్దారు. ప్యాలెస్‌ని చూడటానికి వచ్చిన పిల్లలకు ఆ గది చూడముచ్చటగా ఉంది.

ఎంత కాదన్నా ఆనాటి రాజుల జీవితాల్లో హింస, రక్తపాతం, భీభత్సం చాలా పెద్దభాగాన్నే ఆక్రమించాయ్! అలాగే వాళ్ళు కళలకు కళాత్మకమైన జీవనానికి కూడా చాలా పెద్దపీట వేశారు.

ఆనాటి రాజులు ఎంత హుందాగా, ఎంత విలాసవంతంగా జీవించారో చెప్పటానికి నిలువెత్తు సాక్ష్యాలుగా ఆ ప్యాలెస్ నిర్మాణ నైపుణ్యం, ఆ దారు శిల్ప



కళ, ఆ నగిషీలు, ఆ చిత్రాలు సందర్శకులందరి మనస్సుల్లోనూ నిలిచి ఉంటాయ్!

"మీరు ఇప్పటిదాకా చూసిన ఈ ప్యాలెస్‌ని నిర్మించటానికి ఆ రోజుల్లోనే అక్షరాలా నలభై ఒక్క లక్షలా నలభై ఏడు వేలా తొమ్మిది వందలా ముప్ఫయ్ రూపాయలు ఖర్చయ్యాయ్!

ఈ ప్యాలెస్‌ని ప్రతి ఏటా లక్షలాది దేశీ విదేశీ సందర్శకులు సందర్శిస్తారు. క్రితం సంవత్సరం ఐతే తాజ్‌మహల్ కన్నా ఈ ప్యాలెస్‌నే ఎక్కువమంది సందర్శించారని లెక్కలు చెబుతున్నాయ్!

దసరారోజుల్లో ఈ ప్యాలెస్‌ని సుమారుగా లక్ష విద్యుత్ దీపాలతో అలంకరిస్తారు.

అపుడీ ప్యాలెస్ అందాన్ని చూడటానికి ఎన్ని కళ్ళు ఉన్నా సరిపోవు!

సో డియర్ ఫ్రెండ్స్! చివరగా మీకు చెప్పే కఠోర సత్యం ఏంటంటే ఇంత ఖరీదైన ఈ ప్యాలెస్‌ని కర్ణాటక రాష్ట్రప్రభుత్వం స్వాధీనపరచుకుంది.

రాజుల వారసుడైన యువరాజు ఈ ప్యాలెస్ వెనకభాగంలో కేవలం ఓ చిన్నప్రాంతంలో జీవిస్తున్నాడు" గైడ్, చెప్పి ముగించాడు.

అందరి మనస్సులూ భారమయ్యాయ్!

ఆ ప్యాలెస్ చూడటానికి వచ్చినప్పుడల్లా తన చిన్నప్పుడు తాతగారు తరచుగా పాడే బమ్మెర పోతనగారి పద్యం గుర్తొస్తుంది. అదే పద్యం ఎప్పట్లానే విష్ణుకి మళ్ళీ గుర్తొచ్చింది.

'కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే వారేరీ

సిరి మూట గట్టుకుని పోవంజాలిరే భూమిపై పేరైనన్ంగలదే...'

ఒక గొప్ప కట్టడాన్ని కళ్ళారా వీక్షించగలగటం అందరికీ మంచి అనుభూతిని మిగిల్చింది.

టూరిస్టులు ఒక్కొక్కరే వెనుతిరిగి చూస్తూ వెళ్ళిపోసాగారు.

విష్ణు, యశస్వి కలిసి ఆ ప్యాలెస్‌లోని మ్యూజియం చూసినతర్వాత వివిధశాలల్లోని గుర్రాలను, ఏనుగులను తనివితీరా చూశారు. ఆ ప్యాలెస్ చుట్టూ ఉన్న తోటలో కాసేపు కూర్చున్నారు. ఆమెకైతే ఆ తోటలోని పూబాలలు కూడా గుసగుసగా ఏవో ఊసులు చెప్తున్నట్టనిపించింది.

ఆ ప్రాంగణంలో దాదాపుగా పన్నెండు దేవాలయాలున్నాయని గైడ్ చెప్పిన మాట సడెన్‌గా గుర్తొచ్చి ఆమె అడిగింది. "విష్ణూ! మనం కనీసం ఒక్క దేవాలయానికైనా వెళదాం"

అతను సరేనన్నాడు.

భక్తి ప్రపత్తులతోనే కాకుండా వివిధ సందర్భాల్లో ఇతర దేశాల మీద దండెత్తి విజయంతో తిరిగి వచ్చిన జ్ఞాపకార్థంగా, ఆయా దేవతలకు కృతజ్ఞతగా ఆలయాల్ని నిర్మించారని ఆలయాల వెలుపల ఉన్న శిలాఫలకాలు చెబుతున్నాయ్!

త్రినయనేశ్వర దేవాలయానికి వెళ్ళి ఆ స్వామిని దర్శించుకున్నారు. మైసూరుని పరిపాలించిన వడయార్లు యాదవ కులస్థులు.

వారి కులదైవం శ్రీకృష్ణుడు! అందుకే కాబోలు ఆ ఆలయంలో ముద్దులు మూటగడ్తున్న బాలకృష్ణుని విగ్రహాన్ని ప్రత్యేకంగా ప్రతిష్ఠించారు.

అందరితోపాటు వారు కూడా ఆ విగ్రహాన్ని చూసి మురిసిపోయారు.

ఆ దేవాలయాన్నుంచి బయటకు వచ్చి అరుగు మీద కూర్చున్నాక "యశూ! ఉదయం భారతదేశంలోని ఏడు అద్భుతాల్లో మనం కేవలం నాలుగు అద్భుతాల్ని మాత్రమే చెప్పుకున్నాం! నువ్వింకో మూడు చెప్పాలి. అప్పుడే నువ్వు గెలుస్తావ్!" గుర్తుచేశాడతను.

ఆమెకు ఎందుకోగానీ ఏదైనా ఆ అద్భుతాల్లో ఒక అద్భుతం ఒక దేవాలయానికి సంబంధించింది అయ్యుండొచ్చనిపించింది.

గబగబ ఆలోచించింది. "య్యా! అమృత్‌సర్‌లోని స్వర్ణదేవాలయం?" టకీమని చెప్పింది.

"యు ఆర్ రైట్!" మెచ్చుకున్నాడతను.

"ఇది తను ఉదయమే చెప్పి ఉండాల్సింది' మనస్సులో అనుకుని ఆమె బిడియంగా నవ్వింది.

## జరిగిన కథ (7)

యశస్వికి క్రికెట్ అన్నా, విరాట్‌కొహ్లీ ఆటన్నా ఇష్టమని తెలుసుకుంటాడు విష్ణు.

ఐపిఎల్ ట్వంటీ ట్వంటీ మ్యాచ్ చూసేందుకు రెండు టిక్కెట్‌లు సంపాదిస్తాడు.

విష్ణుతోపాటు యశస్వి మ్యాచ్‌కు బయలుదేరుతుంది. ఆ రోజు మొదటిసారిగా విరాట్ ఆడిన ఆ గేమ్‌ని లైవ్‌లో చూడగలిగినందుకు సంతోషపడుతుంది యశస్వి.

వీకెండ్‌లో ఓ రోజు ఆమెకు ఫోన్‌చేసి మాట్లాడాలి అనుకుంటుండగా తనే ఫోన్ చేస్తుంది.

సెలవు రోజులు కదా ఏదైనా ప్లాన్ చెయ్యి అని అడిగేసరికి రేపు నిన్ను మంచి ప్లేస్‌కు తీసుకువెళతానని చెప్తాడు విష్ణు.

ఓ హోటల్లో టిఫిన్ చేసి అక్కడినుండి మైసూరు మహారాజా ప్యాలెస్‌ను సందర్శించుకుంటారు. ప్యాలెస్ లోపలి విశేషాలు ఆమెకు వివరిస్తాడతను.

విష్ణు ఓ యువరాజులా, తను యువరాణిలా ఫీలవుతుంది యశస్వి.

అక్కడికొచ్చిన స్టూడెంట్స్‌కు ఓ గైడ్ దర్బార్ హాల్లోని మయూర సింహాసనం గురించి వివరిస్తుంటాడు. తర్వాత జరిగింది చదవండి.

"ఈ సంతోషసమయంలో ఇంకొక వండర్ చెప్ప టానికి నీకు ఒక క్లూ ఇస్తాను. అది కూడా ఒక దేవాలయమే..." ఆగాడతను.

'ఏమిటబ్బా అది? మనదేశంలో అంత ప్రఖ్యాతి గాంచిన దేవాలయం ఏది? తనకు భక్తి తక్కువే! కానీ దేశభక్తి కూడానా?

దేశంలో ఉన్న ప్రముఖ ప్రదేశాలు కూడా తనకు తెలికపోవటం ఏమిటి?' ఆలోచిస్తున్న ఆమెకు వెంటనే తట్టింది. "కోణార్క్ ఆలయం?"

"నీకేమయ్యింది? ఐ వండర్! ఇక్కడ ఏ మంత్రుల ఆత్మలో, నిన్ను ఆవహించి సమాధానాలు చెప్పిస్తున్నాయా ఏమిటి?" అంటూ ఆశ్చర్యం నటించాడు.

ఆమె నవ్వేసింది. "ఇంకొక్కటి మిగిలిపోయింది. చెప్పు!" అన్నాడతను.

"క్లూ ఇవ్వొచ్చు కదా?" అడిగిందామె. అతను తల అడ్డంగా ఊపాడు.

"ఏమిటో ఈ అరుగు మీద కూర్చుంటే అచ్చంగా 'కౌన్ బనేగా కరోర్‌పతి?' ప్రోగ్రామ్‌లో హాట్ చెయిర్‌లో కూర్చున్నట్టు అన్పిస్తుంది" సరదాగా చెప్పిందామె.

"అయితే నువ్వే కోటీశ్వరురాలివి!" నవ్వుతూ చెప్పాడతను.

ఆమె కూడా అందంగా నవ్వింది. కాసేపయ్యాక టైమ్ చూసుకుని "రా వెళదాం!" అంటూ బయటకు తీసుకువచ్చాడు.

ఒక్కసారి వెనుతిరిగి ప్యాలెస్ వైపు చూసింది. 'మళ్ళీ ఎప్పుడో...' అనుకుంటే మనసంతా బరువుగా, దిగులుగా అయిపోయింది.

బయటకు వచ్చేసరికి అక్కడ వీరి కోసమే బసప్ప ఎదురుచూస్తూ కన్పించాడు.

అతడ్ని చూసి,చెయ్యూపి,ఆమెవైపు తిరిగి "యశూ! ఇప్పుడు నీకో సర్‌ప్రైజ్!" చెప్పాడతను.

'ఏమిటి?' అన్నట్టుగా కనుబొమ్మలు ఎగరేసింది యశస్వి.

"ఏనుగు అంబారీ ఎక్కించి నిన్ను ఈ ప్యాలెస్ చుట్టూ ఊరేగిద్దామని..." అంటూ ఆగిపోయాడు.

మతిపోయిన వాడ్ని అడిగినట్టే అడిగింది. "ఆర్యూ క్రేజీ?"

"ఎస్! అయామ్ క్రేజీ ఎబవుట్ యు!' మనసులో అనుకున్నాడు. ఏ సమాధానమూ చెప్పకుండా అలానే ఆమె కళ్ళల్లోకి చూస్తూ ఉండిపోయాడు.

ఏనుగు మీద వెళ్ళటమా? అదెలా సాధ్యం? ఇంకా నమ్మశక్యం కావటంలేదు. "ఐ వండర్! అసలు అలాంటి ప్రొవిజనుందా?" అడిగింది.

"మై హు నా? నే చూసుకుంటా కదా?" అన్నాడు. ఆమె రావటమైతే ప్యాలెస్ బయటకువచ్చింది కానీ ఆమె పూర్తిగా ఈ లోకంలోకి రాలేదు.

ఆమె మనస్సంతా ఇంకా ఆ ప్యాలెస్‌లోనే, అబద్ధమూ నిజమూ కానీ గమ్మత్తయిన ఆ ఊహాలోకంలోనే ఉండిపోయింది.

ఆ మత్తులోనే "ఎస్!" అంటూ తలూపింది యశస్వి.

"థ్యాంక్ యు!" ఉత్సాహంగా చెప్పి, బసప్పని చూసి చెయ్యూపాడు విష్ణు.

సరిగ్గా అయిదు నిముషాల్లో బసప్ప ఓ పెద్ద ఏనుగుని మావటివాని సహాయంతో తీసుకువచ్చాడు. ఆమె అలా ఓ అద్భుతాన్ని చూస్తున్నట్టు చూస్తూ ఉండిపోయింది.

ఆ ఏనుగు మీద అప్పటికే ఓ కుచ్చుల పల్లకీ అమర్చబడి ఉంది. ఏనుగుమీదకు ఎక్కటానికి అనువుగా బసప్ప ఓ చిన్న నిచ్చెన తీసుకువచ్చాడు.

"మై గాడ్!" అందామె గుండె మీద చెయ్యేసుకుని, కళ్ళుమూసుకుని తెరుస్తూ!

"ఏమాత్రం భయపడాల్సిన పనిలేదు. ఈ ఏనుగుకు మంచి శిక్షణ ఇచ్చారు. పైగా మావటి ఉన్నాడు. చూడు! నేను ముందుగా ఈ నిచ్చెన మీద నుంచి ఎక్కుతాను. తర్వాత నువ్వు రా!" చెప్పాడతను.

ఆమెకి ఏమ్మాట్లాడాలో కూడా తోచలేదు. అతను ఆమెకంత వ్యవధి కూడా ఇవ్వలేదు. ఆమె చూస్తుండగానే అతను ఏనుగు మీదకు చకచక ఎక్కేశాడు.

పల్లకీలో కూర్చుని,అక్కడ్నుంచే కొద్దిగాముందుకు వంగి, ఆమెని చూస్తూ "యశూ! కమాన్!" అంటూ చేతిని ముందుకు చాచాడు.

"ఏం భయం లేదమ్మా!" ప్రక్క నుంచి బసప్ప కూడా చెప్పటంతో, ఆమెకి ఆ నిచ్చెన ఎక్కక తప్పలేదు. విష్ణు చేతిని అందుకుని, ఆమె నిచ్చెన మీద నుంచి ఓ జంప్ చేసి, పల్లకీలో కూర్చుంది.

నిచ్చెన తీసేశారు. మావటి కదలికతో ఏనుగు నెమ్మదిగా నడపటం మొదలుపెట్టింది.

అలా పల్లకీలో కూర్చుని ఉండగా ఏనుగు తమని తీసుకుని వెళ్ళటం జీవితంలో ఇంతకుముందెన్నడూ ఎరుగని ఓ సరిక్రొత్త అనుభూతి!

ఆమె ఒక విస్మయంతో అలా చూస్తుండిపోయింది. ఏదైనా ఒక సాహసకృత్యం చేస్తున్నప్పుడు శరీరంలో ఎడ్రినలిన్ హార్మోన్ల విడుదల విపరీతంగా పెరగటంతో ఒకలాంటి ఉత్తేజానికి లోనవుతాం! ఆమె పరిస్థితి ఇప్పుడు అలానే ఉంది.

ఏనుగు లయబద్ధంగా నడుస్తూ ఉండటంతో శరీరం చిన్నగా ఊగుతోంది. కానీ ఆమె గుండె ఐతే ఏకంగా ఉయ్యాలలూగుతోంది. 'ఈ ప్యాలెస్‌లోకి

**రాజకీయనాయకులు వారి బాధ్యతలను వారు సక్రమంగా నిర్వహించనందునే మేము రాజకీయాల్లోకి రావాల్సి వస్తోంది. -రజనీకాంత్, నటుడు**





## లెక్కల్లేవ్

చిత్ర పరిశ్రమలో అదృష్టానిదే అతిపెద్ద పాత్ర అనేది కీర్తిసురేష్ అభిప్రాయం.

తెలుగు, తమిళం, మలయాళ పరిశ్రమల్లో బిజీగా వున్న కీర్తి ఏ స్థాయికి ఎదిగాను, ఎక్కడ ఉన్నాననే లెక్కలు అస్సలే కట్టనంటున్నది.

"వచ్చిన అవకాశాలపై దృష్టంతా కేంద్రీకరించి, వాటికి న్యాయం చేయాలనుకుంటానే తప్ప,పాత్రల విషయంలో ప్రత్యేక ప్రణాళికలు లేవు.

సినీ ప్రయాణంలో అద్భుతాలు జరగాలని కూడా నేనెప్పుడూ కోరుకోలేదు.

కాకపోతే, పాత్రల ఎంపికలో వైవిధ్యాన్ని కోరుకుంటాను. చేసే పాత్రలు నాకు కొత్తగా వుంటే చాలు" అంటున్నది కీర్తిసురేష్.

రావటం ఇదే మొదటిసారి కాదు. తను ఇదివరకే వచ్చింది. అప్పుడు కూడా ఇతనితోనే వచ్చింది.

ఒక్కసారి కాదు చాలాసార్లొచ్చింది. ఈ ప్యాలెస్ తనకు బాగా తెల్సు! ఇక్కడంతా తామిద్దరూ తిరుగాడారు. ఎన్నెన్నో కబుర్లు చెప్పుకున్నారు. ఆడిపాడారు... ఇక్కడే ఇక్కడే...'

ఆలోచిస్తున్న ఆమె వివశురాలవుతోంది. ఏవో సుదూర లోకాల్లో విహరిస్తోంది.

అతను ఆమెవైపే చూస్తున్నాడు. ఆ సాయంత్రపు నీరెండలో ఆమె ముఖం కాంతులీనుతోంది.

ప్రపంచానికంతా దూరంగా, కొద్దిగా ఎత్తులో ఇలా తామిద్దరే ఒకరికొకరు దగ్గరగా ఉండటం అతనికి అద్భుతంగా ఉంది.

తామిద్దరు కాదు! ఒక్కరే! తామిద్దరూ ఒకవైపు! ప్రపంచమంతా ఇంకోవైపు అన్న ఫీలింగ్ కలిగింది. రహస్యస్వప్నమేదో నెరవేరుతున్నట్టుగా ఉంది. వారిద్దరి మధ్యా ఒక మ్యాజిక్ మొదలైంది.

మైండ్ తన లాజిక్‌తో చేయలేని ఎన్నో పనులని మనస్సు తన మ్యాజిక్‌తో ఎంతో సునాయాసంగా చేస్తుంది. ఎందుకంటే ప్రేమకి లాజిక్ తెలీదు.

సన్నగా వణుకుతున్న ఆమె సున్నితమైన చేతిని అందుకున్నాడు. ఆమె అభ్యంతరం చెప్పలేదు.

తన షర్ట్ జేబులో ఉన్న ఎర్రగులాబీ పువ్వుని బయటకు తీసి ఆమె చేతికిచ్చాడు. ఆమె అపురూపంగా అందుకుంది. ఇందాక గుళ్ళో పూజారి ఇచ్చిన ఆ పువ్వుని కళ్ళకద్దుకుని అతను జేబులో వేసుకోవటం చూసిందామె.

ఆమె ఆ గులాబీపువ్వుని ఎడమచేతిలోకి తీసుకుని కుడిచేత్తో ఆ పూరేకుల్ని సర్దుతుంటే ఆ రేకుల మధ్యలోనుంచి తన వలపు పిలుపులేవో పరిమళాలు వెదజల్లుతూ ఆమెకి చేరవేస్తున్నట్టుగా తోచింది.

ఆమె అలా చూస్తూనే ఉంది కానీ ఏదీ మెదడులోకి వెళ్ళటం లేదు. ఆకాశంలో సూర్యుడు అస్తమించాడు కానీ, ఇంకా పూర్తిగా చీకటిపడలేదు.

ఒక ప్రక్క నుంచి చంద్రుడు నెమ్మదిగా ఉదయిస్తున్నాడు. శీతల శాంతి మధుకలశంతో, బాటలేని దారులవెంట సంధ్యాదేవి అలవోకగా నడచి వస్తోంది. ఆ ప్రదోషవేళ...

అతను మళ్ళీ ఆమె చేతిని సుతారంగా తన చేతిలోకి తీసుకుని, ఆమె కళ్ళల్లోకి చూస్తూ "యశస్వీ!" అంటూ మృదువుగా పిలిచాడు. 'ఏదో జరగబోతోంది' ఆమెలోని ఆడమనస్సు చెబుతోంది.

అరచేతులు చల్లబడ్డాయ్!



ప్రస్తుతానికి ఓడినా మళ్ళీ మరోసారి గెలుస్తాం.

-రాహుల్‌గాంధీ, కాంగ్రెస్ అధ్యక్షుడు

## బ్యూటీ రెసిపి

మిల్క్ బ్యూటీ తమన్నా తెరపైకి వచ్చి ఎన్నేళ్ళయినా ఆమె అందంలో తరుగుదల కొంచెంకూడా కనపడదు. నడుమొంపులో అసలే తేడా లేదు.

ఏమిటీ అందాల రహస్యం అని అడిగితే, పాల మీగడ మాదిరి స్వచ్ఛంగా నవ్వులు ఒలికిస్తుంది. "ఉదయాన్నే కాఫీలో వెన్న, కొబ్బరినూనె కలిపి తాగుతాను. వెన్న చెడుకొవ్వుకు చెక్ చెప్తే, కొబ్బరి నూనె శక్తి ఇస్తుంది" అని చెప్తూ, "మీరూ ప్రయత్నించి ఫలితాలు చూడండి" అంటూ అభిమానులకు ఓ సలహా విసిరింది.



కానీ ఆమె ఇంకా ఈ వాస్తవప్రపంచంలోకి రాలేకపోతుంది. గత జన్మల తాలూకు స్మృతుల మత్తు విడివడటం లేదు. ఊపిరి బిగబట్టింది.

దీపాలు పెట్టే వేళయ్యింది.

ఈమె తన కంటిదీపం! ఈమే తన స్వప్నసుందరి! జన్మజన్మల తన ప్రియబాంధవి!

"ఐ లవ్యూ యశస్వీ!" చెప్పాడు.

ఆమె మదిలో ఒక్కసారిగా కోటి దీపాలు వెలిగాయ్! ఆమె గుండె ఒక్కసారి అతివేగంగా కొట్టుకోసాగింది. శరీరాన్నీ, చర్మాన్నీ చీల్చుకుని బయటకు వస్తుందేమో అన్నంత వేగంగా గుండె కొట్టుకోసాగింది. కానీ, నింపాదిగా ఉండటానికి ప్రయత్నిస్తూ "థ్యాంక్యూ సో మచ్!" అంది.

సరిగ్గా ఆ సమయంలో అతని ముఖంలో ప్రతిఫలిస్తోన్న ఆరాధనని తనివితీరా చూడాలన్పిస్తుంది. కానీ స్త్రీ సహజమైన సిగ్గుదొంతరలు కనురెప్పల్ని క్రిందకు లాగుతున్నాయ్!

ఆమె శరీరం చిన్నగా కంపించటం అతనికి స్పష్టంగా తెలుస్తోంది. ఆమె పెదవులు అదురుతున్నాయ్! కనురెప్పలు అరమోడ్పులై ఉండటంవల్ల ఆమె ముఖంలో భావాలు తెలియటంలేదు.

ఏమో! ఆ అర్ధనిమీలిత నేత్రాలు ఏ మధురస్వప్నాన్ని వీక్షిస్తున్నాయో? ఆ చేతిలో గులాబీపువ్వు తియ్యగా నవ్వుతోంది.

"యశూ! నువ్వు నాక్కావాలి! నా జీవితాంతమూ నాతో నువ్వుండాలి! నా కుటుంబంలో, నా భవిష్యత్తులో, నా సంతోషంలో, నా స్టేటస్‌లో అన్నింటా నువ్వు నా ప్రక్కన ఉండాలి! నా జీవన సామ్రాజ్యానికి రారాణిగా నా జీవితంలోకి వస్తావా? నీ గుండెలో నాకు చోటిస్తావా?!" అడిగాడతను.

ఆమె ముగ్ధురాలై చూసింది. ఆమె మనస్సేమిటో అతనికి అర్థమయ్యింది. ఇద్దరూ ఒకరి కళ్ళల్లోకి ఒకరుచూసుకుంటూ అలా ఎంతసేపుండిపోయారో.

"సార్!" అంటూ క్రింద నుంచి బసప్ప పిలుస్తుంటే ఈ లోకంలోకి వచ్చారు. ఆమె చెయ్యి ఇంకా అతని చేతిలోనే ఉంది. అతను ముందుగా తేరుకుని క్రిందికిచూశాడు. అప్పటికే ఆగి ఉన్న ఏనుగు శరీరానికి నిచ్చెన ఆనించి పెట్టి, అటు బసప్ప, ఇటు మావటి తమకోసం ఎదురుచూస్తూ నిలబడి ఉన్నారు.

ఇద్దరూ కిందకు దిగారు.

కార్లో కూర్చున్న తర్వాత అతను ముందుగా ఓ ఫైవ్‌స్టార్ చాక్లెట్ ఆమెకి ఇచ్చాడు.

"నేనింకా ఆఖరి జవాబు చెప్పలేదు" గుర్తు చేసింది.

"నువ్వన్ని జవాబులూ చెప్పేసినట్టే నా ఖజురహో శిల్పమా!" అన్నాడతను.

జవాబు అర్థమై "ఓ" అంది పెద్దగా!

"ఈరోజుకి గుర్తుగా ఓ చిన్న బహుమతి!"అంటూ అందంగా గిఫ్ట్ ప్యాక్ చేసిన ఓ అట్టపెట్టె ఇచ్చాడు.

"ఏమిటి?" అనడిగింది.

"చూడు!" చెప్పి, తన మొబైల్ చూసుకోసాగాడు.

ఆమె ప్యాక్ విప్పింది. అద్దాల పెట్టెలో మంచి చందనంతో తయారుచేసిన మైసూరు ప్యాలెస్! జన్మంతా పదిలంగా దాచుకోవాల్సిన గొప్ప బహుమతి! అతనిచ్చిన మొదటి బహుమతి!

ఆమె ఎమోషన్ అయ్యి కదిలిపోయింది.

"ఒకసారి మొబైల్ చూసుకో! ఉదయం నుంచి ఎన్ని కాల్స్ మిస్సయ్యావో... నీ ప్రజలంతా ఏమైపోయారో..." టీజింగ్గా చెప్పాడతను. ఆమె చేతిలోని ఆ ప్యాలెస్‌ని అలానే చూస్తూండిపోయింది.ఆమెకి ఇప్పుడేదీ చూడాలని, ఎవరితో మాట్లాడాలనీ లేదు.

ఈ నిముషాన్ని ఇలానే ఒడిసి పట్టుకుని ఉండిపోవాలన్పించింది.

"మొబైల్ చూడమంటుంటే..." అతను రెండోసారి రెట్టించటంతో ఆ ప్యాలెస్‌ని ఒళ్ళో పెట్టుకుని, మొబైల్ తీసింది. ఆన్ చేయగానే మిస్డ్ కాల్స్, వాట్సాప్ మెసేజెస్ కన్పించాయ్! ఎవరితో మాట్లాడే మూడ్ లేదు.

ఓ కంట ఒళ్ళో ఉన్న ప్యాలెస్‌ని చూస్తూ వాట్సాప్ ఓపెన్ చేసింది. అందులో విష్ణు ఇప్పుడే పంపించిన మెసేజ్ కన్పించింది..

'ఓ! ఇందుకే చూడమన్నాడా' అనుకుంటూ ఆ మెసేజ్ ఓపెన్ చేసింది. అది వీడియో మెసేజ్!

"ఏమిటిది?" నవ్వుతూ అడిగింది.

"చూడు..." వీడియో డౌన్‌లోడ్ అయ్యింది. చూడటం మొదలుపెట్టిన ఆమెకి మతిపోయింది. ఏనుగు మీద పల్లకీలో విష్ణు తనకు ప్రపోజ్‌చేస్తుండగా తీసిన వీడియో అది!

'గాడ్!... ఎలా? ఇంతందంగా ఇంత అద్భుతంగా ఎలా ప్లాన్ చేశాడు?'



## షాబానూ కేసులో చెయ్యలేకపోయినదానిని ముమ్మారు తలాక్ కేసులో సుప్రీమ్‌కోర్టు చెయ్యగలిగింది.

-జస్టిస్ రంజన్ గొగోయ్,
సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి

"ఇంకో చిన్న గిఫ్ట్!" నవ్వాడతను. జీవితమంతా పదిలంగా దాచుకోవాలసిన బహుమతులు! ఆ మాటలు తనలో కల్గించిన ప్రకంపనల్ని ఆస్వాదిస్తూ,

కొద్దిగా పక్కకు ఒరిగి, అతని భుజమ్మీద తల వాల్చుకుని అలా ఉండి పోయింది. 'విష్ణూ! నేను ఫ్లాటయ్యాను' ఆమె మనస్సు పలికే మూగబాసల్ని, గుసగుసల్ని అతని గుండెవింటోంది.

ఫ్లాట్‌కి తిరిగివచ్చిన యశస్వికి ఆరోజు జరిగిందంతా కలలా ఉంది. ఎదురుగా షెల్ఫ్‌లో విష్ణు ఇచ్చిన చందనపు మైసూరు ప్యాలెస్ లేకపోతే తను కలకన్నాను అనే అనుకునేది.

ఇంటికి ఫోన్ చేసి తాను ప్యాలెస్‌కి వెళ్ళివచ్చానని చెప్దామా అనుకుంది.'ఎవరితో వెళ్ళావ్?ఎలా వెళ్ళావ్? ఎప్పుడొచ్చావ్?ప్యాలెస్ ఎలా ఉంది?' అన్నిటికీ సమాధానాలు చెప్పాలి!

కొన్ని నిజాలు, కొన్ని అబద్ధాలూ చెప్పాలి! కానీ తనకు అస్సలు మాట్లాడాలని లేదు. మాట్లాడితే మనస్సులో మాధుర్యమేదో తగ్గిపోతుందేమోనన్న ఫీలింగ్! ఎలాగూ నీతూ లేదు కాబట్టి ఫ్లాట్‌లో తనను పలకరించేవాళ్ళు కూడా లేరు.

చిన్న చిన్న పనులన్నీ చేసుకుని త్వరగా పడుకుంటే త్వరగా లేవచ్చు! తెల్లారి లేస్తే మళ్ళీ పరుగు మొదలు! అయితే ఈసారి సరికొత్త విష్ణుని చూస్తూ పని చేయాలి! 'అయ్ లవ్ యూ యశస్వీ' అని ఓపెన్‌గా చెప్పేశాడు. అతనలా మాట్లాడుతుంటే మనస్సంతా 'క్లవుడ్ 9' మీద ఉన్న అనుభూతి!

అతని మాటలకు, చర్యలకు ఫ్లాట్ అయిపోయిన మనస్సుని, ఎలా కంట్రోల్ చేసుకోవాలో తెలియటం లేదు. నవ్వుకుంటూ ల్యాప్‌టాప్ ఆన్ చేసింది.

ముందుగా మెయిల్ చెక్ చేసుకుంది. మైత్రేయి నుంచి వచ్చిన మెయిల్ ఇన్‌బాక్స్‌లో ఉంది. వెంటనే ఓపెన్ చేసింది.

"నేనూ, బిందూ ఎంతో హ్యాపీగావున్నాం! ఒకర్ని విడిచి ఒకరం ఉండలేని స్థితికి వచ్చాం!

నాకు తను, తనకు నేను! బస్! ఇంతే చాలు!

మేమిద్దరమూ ఒకర్నిఒకరం బాగా అర్థంచేసుకున్నాం! తను నన్ను అర్థంచేసుకున్నంత బాగా ప్రపంచంలో ఇంకెవ్వరూ అర్థంచేసుకోలేరని నేననుకుంటున్నాను.

తను కూడా నా గురించి అలానే అనుకుంటోంది. ఐనా ఒక అమ్మాయ్ మనసులో ఏముందో ఒక అబ్బాయికి ఎలా అర్థమవుతుంది?" **ఇంకా ఉంది**



## డోన్ట్ కేర్

మనస్సులోని మాటను నిర్మొహమాటంగా, కుండ బద్దలుకొట్టినట్లు చెప్పడంలో రాధికాఆప్టే ముందుంటుంది.

సామాజిక మాధ్యమాల్లో అనుచిత వ్యాఖ్యలు ఎవరైనా చేస్తే, చీల్చి చెండాడేస్తుంది కూడా. ఆ మధ్య భర్తతో కలసి గోవా బీచ్‌లో దిగిన ఫొటోలను సోషల్ మీడియాలో పోస్ట్ చేసింది.

వీటిని చూసిన కొందరు బికినీ వేశారంటూ వ్యాఖ్యానాలు చేశారు. "ఇదంతా పనికిరాని విషయం. బీచ్‌కు వెళ్ళినప్పుడు బికినీలు కాకుండా చీర కట్టుకుంటారా?

ఐనా అభిమానులు కాకుండా, ఎవరో ముక్కు, మొహం తెలియనివారి వ్యాఖ్యానాలు నేనుఅస్సలు పట్టించుకోను" అంటూ తేల్చేసింది.

# కంఠకింపు




## పూజాహెగ్డే

డార్క్‌మెరూన్ కలర్ దుస్తుల్లోని పూజాహెగ్డే ధరించిన వజ్రాలు, కెంపులు పొదిగిన యాంటిక్ నెక్లెస్, మెడనంటే మ్యాచింగ్ ఇయర్‌రింగ్స్ మనోహరంగా వున్నాయి.



## రాధికాఆప్టే

పసిమిరంగు దుస్తులు, భుజాలపైకి దిగిన వంకీల జుత్తు నడుమ పచ్చలు పొదిగిన బంగారు చోకర్ పరిపూర్ణతను ఇచ్చింది.

ఎంచుకునే ఆభరణాలు రూపాన్ని మార్చేయడంలో ప్రధానపాత్ర వహిస్తాయి. పెళ్ళిళ్ళు, ఫంక్షన్లు వేటిలోనైనా వీటి ప్రాధాన్యం ఎంతో వుంటుంది.

చక్కని దుస్తులు ధరించి, సరైన నగ ధరించకపోతే అసలే బాగోదు. సూటయ్యే ఆభరణాలు సూదంటు రూపాన్ని ఇట్టే ఇచ్చేస్తాయి. వెండితెరపై వెలుగొందే తారల బంగారు, వెండి కంఠాభరణాల మెరుపులు ముచ్చటగొలుపుతున్నాయి.




Courtesy : You & I

## మలైకా అరోరా

శ్రీరాముడిని పొదిగిన భారీ లాకెట్ వేలాడే సిల్వర్ చైన్ ఆకర్షణీయంగా వుంది.



## కృతీసనన్

పూలు, కొమ్మలతోగల చిన్ని టాప్‌కు, నడుమును చుట్టేసిన అదేరకం బాటమ్‌కు మధ్యన తక్కువ విలువగల రాళ్ళు పొదిగిన వెండి నెక్లెస్, సిల్వర్ లాంగ్ చైన్ స్టయిలిష్‌గా వున్నాయి.



## సనాఖాన్

ఎర్రని సంప్రదాయ పట్టుచీరపై నెక్లెస్, లాంగ్ చైన్, మ్యాచింగ్ బుట్టలు బాగా అమరాయి.

# మష్రూమ్ మ్యాజిక్

సహజంగా పొలాలు, పుట్టలమీద మొలిచే పుట్టగొడుగుల వాడకం అత్యంత ప్రాచీనమైనది. తర్వాత తర్వాత సీజన్‌లతో నిమిత్తం లేకుండా వాటి సాగు మొదలైంది.

ఔషధగుణాల పుట్టగొడుగులు తాజా సూపర్ ఫుడ్. మెడిసినల్ మష్రూమ్స్ సరికొత్త గుర్తింపుగా పరిగణించినా, వాటిలోని అంతులేని ఔషధాలగురించి ఎప్పటినుంచో తెలుసు. సంప్రదాయ చైనీయుల వైద్యంలో శతాబ్దాల తరబడి వీటి వాడకం ఉంది. వాస్తవానికి పెన్సిలిన్ మష్రూమ్స్ నుంచి వచ్చిందే.

మిగతా ఔషధాలతో పోల్చితే పుట్టగొడుగులు వెనుకంజలోనే వున్నాయి. చాలామందికి ఈ 'ఫంగి' గురించిన అవగాహనలేదని, వాటిపట్ల సహజభయాలు కూడా వుంటాయని నిపుణులు చెప్తున్నారు.

ఇక్కడ చెప్పుకునేది సాధారణ బటన్ పుట్టగొడుగుల గురించికాదు, కణాలకు హాని కలిగించే ఫ్రీర్యాడికల్స్‌ను అడ్డుకోగల ఫంగీ రకాలు కొన్ని ఉంటాయి. ఇవి రోగనిరోధకశక్తిని కూడా పెంచుతాయి.

క్యాన్సర్ చికిత్సలలోసైతం వీటిని సమాంతరంగా ఉపయోగిస్తుంటారు. ఇటువంటి రకాల గురించి తెలుసుకుని ఆహారంలో భాగం చేసుకోవడంవల్ల సత్ఫలితాలుంటాయని నిపుణులు పేర్కొంటున్నారు. వీటినే మెడిసినల్ మష్రూమ్స్‌గా వ్యవహరిస్తారు.

**పోషకాలు :** సాధారణంగా పరిగణిస్తే మనదేశంలో చాలామంది భారతీయులు ఖనిజాల లోపంతో వుంటున్నారనేది అధ్యయనాల సారాంశం. పుట్టగొడుగుల్లో లభించే సెలీనియం, విటమిన్ 'ఇ'లు సెల్యులర్ ప్రక్రియను మెరుగుపరిచి, ఫ్రీర్యాడికల్ హానిని తగ్గిస్తాయి. ఈ ఖనిజాలను శరీరం గ్రహించడానికి తగిన ఎంజైముల అవసరం ఉంటుంది.

పుట్టగొడుగుల్లో అవీ లభిస్తాయి. వీటిలో గ్లుటాథియోన్ పెరాక్సైడస్ అనే ఎంజైమ్ వుంటుంది. అవి సెలీనియం, విటమిన్‌లు మొటిమలు వంటివి తగ్గించడంలో సహకరిస్తుంది. విటమిన్ బి, డిలు కూడా అధికమోతాదులోలభిస్తాయి.కరగని పీచూ సమృద్ధిగా వుంటుంది.ఇదిఅద్భుతమైన జీర్ణకారిక సహాయకారి.

**రోగనిరోధకశక్తి :** బ్యాక్టీరియా, ఫంగి కణాల గోడల్లో బెటా-గ్లుకాన్‌అనే సహజచక్కెరలువుంటాయి. ఇవి రోగనిరోధక వ్యవస్థను చైతన్యవంతంచేస్తాయి. వీటిని అధిక కొలెస్ట్రాల్, డయాబెటిస్, క్యాన్సర్, హెచ్ఐవి వంటి చికిత్సల్లో ఉపయోగిస్తుంటారు.

బెటా-గ్లుకాన్స్‌ను ఈస్ట్రోజన్ స్థాయిల్లో హెచ్చు తగ్గుల్లో సైతం వాడతారు.

వీటిలోగల యాంటీ-కార్సినోజెనిక్ గుణాలు కొన్ని కణాలను, ప్రొటీన్లను ఉద్దీప్తం చేస్తాయి. 'లెంటెనుల ఎడోడ్స్' అంటే షీటేక్ లేదా ట్రామెటెస్ వార్సికలర్ అంటే టర్కీటెయిల్ మష్రూమ్ రకాల్లో 40 నుంచి 50 శాతం బెటా-గ్లుకాన్స్ వుంటాయి.

**ప్రొటీన్లు :** షీటేక్ పుట్టగొడుగుల్లో అత్యధిక స్థాయిల్లో ప్రొటీన్లు లభిస్తాయని నిపుణులు పేర్కొంటున్నారు. ఈ రకం గొడుగుల్లో ఇరవై ఐదుశాతం ప్రొటీన్లుంటాయి. ఒక్క కప్పు పోర్టోబెల్లో పుట్టగొడుగుల్లో 5.2 గ్రాముల ప్రొటీన్ లభిస్తుంది. క్యాలరీలు చాలా తక్కువగా వుంటాయి.

**వార్ధక్య లక్షణాల పొడిగింపు :** పుట్టగొడుగుల్లో వార్ధక్యానికి కారణమయ్యే కఠిన ప్రభావాలతో పోరాడటంలో సాయపడే అసాధారణ, అత్యధిక మోతాదులో రెండు యాంటీ ఆక్సిడెంట్లు వుంటాయని పరిశోధనకారులు గుర్తించారు.

ఎర్గోథియోనైన్, గ్లుటాథియోన్ అనే ఈ రెండు యాంటీ ఆక్సిడెంట్లు ఫ్రీర్యాడికల్స్‌ను సమర్థవంతంగా ఎదుర్కొంటాయి. పుట్టగొడుగులు ఇన్‌ఫ్లమేషన్‌ను తగ్గించడంలో కూడా సహకరిస్తాయి.ముందస్తు వార్ధక్యానికి, అనేక దీర్ఘకాలిక వ్యాధులకు ఇది ప్రథమ కారణంగా వుంటున్నది. అత్యంత ప్రధానమైన మెడిసినల్ ఫంగిలు ఐదు రకాలున్నాయి.

**కార్డిసెప్స్ :** ఈ రకాన్ని అథ్లెట్స్ ఎక్కువగా వినియోగిస్తారు. హిమాలయన్ గొర్రెల కాపరులు అధిక అల్టిట్యూడ్ క్లైంబ్స్‌లో తక్కువ ఆక్సిజన్‌స్థాయిలున్నప్పుడు టీ మాదిరి తాగుతుంటారు.

ఊపిరితిత్తుల క్యాన్సర్‌గలవారు వీటిని వాడితే, కీమో ఫలితాలు తగ్గుతాయని, ఊపిరితిత్తుల పనితీరు మెరుగవుతుందని నిపుణులు చెప్తున్నారు. ఇవి సప్లిమెంట్ల రూపంలో లభించవు.

సహజ వైల్డ్ రూపంలోనే లభిస్తాయి.వాటిని ఎంచుకునేటప్పుడు 'కార్డిసెప్స్ మిలిటరీస్' అన్న లేబుల్ చూడాలి. వాటిని సరైన పద్ధతిలో క్లీన్ చెయ్యకపోతే టాక్సిన్లు వుండే అవకాశం వుంది.

**రైషి:** ఇవి చాలా శక్తివంతమైనవి. ప్రాచీన చైనీయుల వైద్యంలో ఒత్తిడివల్ల కలిగే ప్రతికూల ప్రభావాలను తగ్గించుకునే క్రమంలో అంతర్భాగంగా వుంటుంది. లివర్‌ను పరిరక్షించే గుణాలుంటాయి.











గుండెకు మేలుచేస్తుంది. ఊపిరి తిత్తులకూ ప్రయోజనకరమైనది. మంచి నిద్రకు సహకరిస్తుంది.

**షీటేక్:** ఔషధవిలువలు ఈ రకంలో అత్యధికంగా వుంటాయి. షీటేక్ పుట్ట గొడుగుల వెలికితీతలు క్యాన్సర్‌నుంచి కోలుకునే రోగులకు ఎంతో ప్రయోజనకరమైన ఫలితాలు ఇస్తాయి. ఇది శాస్త్రీయబద్ధంగా రుజువైన అంశం.

షీటేక్ రకాల్లో బి, డి విటమిన్లు పుష్కలంగా వుండి, గుండె ఆరోగ్యానికి మద్దతుగా నిలుస్తాయి. క్యాన్సర్ కణాలతో పోరాడతాయి. ఇన్‌ఫ్లమేషన్ తగ్గి



స్తాయి. రోగనిరోధక వ్యవస్థకు బలాన్ని స్తాయి. తక్కువ రోగనిరోధకశక్తిగల వారికి షీటేక్ టీ సిఫార్సు చేస్తారు.

**షీటేక్ టీ :** ఓ కప్పు నీటిలో ఒకటి లేదా రెండు షీటేక్ పుట్టగొడుగులను ఇరవై నిమిషాలు నానబెట్టాలి.సిమ్‌లో పదినిమిషాలు కాచాలి. పుట్టగొడుగు తీసేసి దాన్ని తింటూ, టీ తాగేయవచ్చు. ప్రతిరోజూ ఓ కప్పు తాగుతుంటే రోగ నిరోధకశక్తి మెరుగవుతుంది.



**టర్కీ టెయిల్ :** క్యాన్సర్‌తో పోరాడడంలో రోగనిరోధక వ్యవస్థకు సహకరించడంలో టర్కీ టెయిల్ పుట్ట గొడుగులు బాగా ఉపకరిస్తాయని ఓ అంకాలజీ జర్నల్‌లో ప్రచురితమైన అధ్యయనంలో పేర్కొన్నారు.కిమోలో కాంప్లిమెంటరీ మెడిసిన్‌గా వాడినప్పుడు చికిత్స రికవరీ శీఘ్రంగా వుంటుంది.

**చాగా :** యాంటీ ఆక్సిడెంట్స్ పుష్కలంగా వుంటాయి. దీనిలోని ఎర్తి, నట్టి ఫ్లేవర్‌వల్ల కాఫీకి మంచి ప్రత్యామ్నా



యంగా వుంటుంది. మొటిమలు, ఎగ్జిమా వంటి వాటినుంచి త్వరితంగా కోలుకునేందుకు సహకరిస్తుంది.

వీటిలోగల అత్యధిక, విభిన్న పాలి ఫెనాల్స్ ఆక్సిడేటివ్ ఒత్తిడి, ఇన్‌ఫ్లమేషన్లనుతగ్గించడంలో సాయపడతాయి.

గుండె జబ్బులకు ఇవి ప్రధాన కారణాలుగా వుంటాయి. టైప్ 2 డయాబెటిస్, క్యాన్సర్‌లకు కూడా ఇవే దారి తీస్తుంటాయి.

## ఎలా వాడాలి

- వాటినిఎప్పుడూకూడా బాగా ఉడికించాలి. పూర్తి పుట్టగొడుగులను బ్లెండ్ చేసి, టీస్పూన్‌చొప్పున రోజులో ఒకటి, రెండుసార్లుగా తీసుకోవాలి.
- మష్రూమ్ మెడిసిన్‌ను నీటి ఆధారంగానే తీసుకోవాలి. నీటిలో నానబెట్టడం, నీటిని వేడిచేయడం ద్వారా వెలకితీతలు తీయాలి లేదా ఎండబెట్టి తయారుచేసిన పొడిరూపంలో కాని, వెలికితీతలు తయారు చేసుకోవాలి.
- అనువైన రకాలు ఎంచుకుని 25 గ్రాముల ఎండు పుట్టగొడుగులు లేదా పొడితీసుకుని డికాక్షన్‌తయారు చేసుకుని రోజుకు రెండుసార్లు కప్పు చొప్పున తాగుతుంటే క్యాన్సర్ పరిరక్షణలో గరిష్ఠప్రయోజనాలు కనిపిస్తాయి.నీటినుంచి వెలికితీసిన పుట్టగొడుగులకషాయం రోజుకు రెండు, మూడు గ్రాములు తీసుకుంటే సరిపోతుంది.
- సమగ్రరూపంకోసం కొన్ని కంపెనీలు పదినుంచి పద్నాలుగు రకాలను మిళితం చేస్తుంటాయి. అయితే మంచి ప్రభావాలు అనుభవం కావడానికి రెండు, మూడు రకాల కలయిక సరిపోతుంది.

ఇవన్నీ మార్కెట్లలో లభ్యం అవుతాయి. ఎక్కడ, ఏవి దొరుకుతాయో సమాచారాన్ని తెలుసుకుంటే ఎంచుకోవడం సులువవుతుంది.

ఇందుకోసం సామాజిక మాధ్యమాలనూ ఉపయోగించుకోవచ్చు.

ఎ.అనుపమ

# వారఫలం

మార్చి 22 నుండి 28, 2018 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064

## మేషం



అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. పరిచయాలు పెరుగుతాయి. వృత్తి-ఉద్యోగ వ్యాపారాలు నిరాశాజనకంగా సాగుతాయి. ఖర్చులను నియంత్రించుకొంటూ అనవసర వ్యయాలను తగ్గించుకోగలరు. ఇతరులతో పోలికలకు దూరంగా ఉండండి. వాహన యంత్రాదుల మార్పులను వాయిదా వేసుకోండి. శుభకార్యయత్నములు అనుకూలిస్తాయి. శని, ఆది, సోమ వారాలు అనువైనవి.

## వృషభం



కృత్తిక 2, 3, 4 పా, రోహిణి,మృగశిర 1, 2 పా. విమర్శలకు, ప్రతి విమర్శలకు దూరంగా ఉంటూ కర్తవ్యములకు అంకితమవ్వాలి. ఆదాయము మీరూహించుకొన్నట్లుగా ఉండగలదు. అపరిచితులతో స్నేహాలు పెరగగలవు. ముఖ్యమనుకొన్న పనులను పట్టుదలతో పూర్తిచేసుకోవాలి. ఊహించని విధంగా ఉద్యోగావకాశాలు ఏర్పడతాయి. ప్రయాణములందు జాగ్రత్తలు అవసరం. గురు, శుక్ర, సోమ, బుధ వారాలు అనువైనవి.

## మిథునం



మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా. భాగస్వామితో సంయమనములతో సాగాలి. ఆశయముల పట్ల పట్టుదలలు వహించిసాగాలి. విందులకు, వేడుకలకు ఆడంబరములకు ప్రాధాన్యతనిచ్చు సూచనలున్నాయి. ఖర్చులధికం. బంధుమిత్రుల రాకపోకలు, పిల్లలకు ప్రయోజనములు కల్గుట వంటివి ఉత్సాహపరచగలవు. కాలాతీత ఆహార విరామాదులకు దూరంగా ఉండండి. శని, ఆది, సోమ వారాలు అనువైనవి.

## కర్కాటకం



పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. ఋణములు చేబదుళ్ళు వంటివి తీసుకొను సూచనలున్నాయి. పనులను పూర్తిచేసుకోగలరు. మానసిక ఒత్తిడిలకు గురికాకుండా మెలకువలవసరం. కుటుంబ వ్యక్తులనుండి సహకారాలు పెరుగుతాయి. ఆరోగ్యం సిద్ధిస్తుంది. స్థిరాస్తులపట్ల ఆసక్తి ఏర్పడగలదు. గురు, శుక్ర, సోమ,బుధ వారాలు అనుకూలం.

## సింహం



మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా.ఒత్తిడిలు తొందరపాటుచర్యలకు పాల్పడుట వంటివి ఉంటాయి. ఆర్థికంగా సామాన్యతలు కొనసాగగలవు. పిత్రార్జితాలు, వస్తువులు వంటి విషయాలలో జాగ్రత్తలు అవసరం. బంధువర్గం నుండి వ్యతిరేకతలు పెరుగుతాయి. ఏకపక్షవ్యవహారాలకు దూరంగా ఉంటూభాగస్వామి సలహాలు తీసుకొనుట మేలు. శని, ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.

## కన్య



ఉత్తరఫల్గుని 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.ఈ వారమందు ముఖ్యమనుకొన్న పనులను పూర్తిచేసుకోగల్గుతారు. ఖర్చులకు తగిన సర్దుబాట్లు జరగగలవు. ఊహించుకొన్న సంబంధబాంధవ్యముల పట్ల చేర్పుమార్పులేర్పడగలవు.సకాలంలో చెల్లింపులు చేసుకోగల్గుతారు. ఒప్పందాలు పూర్తి చేసుకుంటారు. బంధువుల ఆదరణను పొందగలరు. పిల్లలచే కొంత అసహనం పొందగలరు. శని, ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.

## తుల



చిత్త 3, 4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా. గత ప్రతికూలాంశములను తగ్గించుకొంటారు. వృత్తి, ఉద్యోగాలందు కొత్త అవకాశాలను అందిపుచ్చుకోగలరు. ఆరోగ్యమందు మంచి మార్పులుంటాయి. మీ నిర్ణయాలు కొన్ని వివాదాలను ఏర్పరచగలవు. వ్యాపారములందు నూతనమైనవి చేపట్టగలరు. సలహాలు, సహాయాలు తీసుకొనేటప్పుడు అర్హులైనవారిని ఎన్నుకోండి. వివాహయత్నాలలో పట్టుదలతోసాగాలి.సోమ, బుధవారాలు అనువైనవి.



విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. బంధుమిత్రుల రాకపోకలు చికాకుని ఇవ్వగలవు. అవసరాలు నెరవేరతాయి. వాక్పారుష్యాలేర్పడకుండా మెలకువలు అవసరం. ప్రతి వ్యవహారాన్ని స్వయంగానే చూసుకోండి. చెల్లింపులకు ప్రాధాన్యతనీయండి. పిల్లల ఉన్నతచదువులు వారి సదుపాయాలపై దృష్టిపెట్టగలరు. శని, ఆదివారాలలో మెలకువలవసరం.

## ధనుస్సు



మూల,పూర్వాషాఢ,ఉత్తరాషాఢ 1వ పా. శారీరకంగా అలసటలుంటాయి. ఆదాయాలు మీరూహించుకొన్నట్లు ఉండి ఖర్చులు కొంత ఎక్కువగా ఉండగలవు. పూర్తి అయ్యిందనుకొన్నపనిని తిరిగి ప్రారంభించవలసి రావచ్చును. విమర్శలకు, అభియోగములకు దూరంగా ఉండండి. వృత్తి, వ్యాపారాలలో కొత్త వాటికి శ్రీకారం చేయగలరు. సోమ, మంగళ, బుధ వారాలలో అన్నిటా యోచనలు అవసరం.

## మకరం



ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా. అంచనాలలో చేర్పు మార్పులు అవసరమౌతాయి. ఆదాయాలు అనుకూలం. ఆంతరంగిక వ్యవహారాలు కొన్ని బహిర్గతమగు సూచనలున్నాయి. భ్రాతృవర్గమున వ్యవహారాలలో సంయమనములను పాటించుకోవాలి. అధికారులతో సత్సంబంధాలు ఏర్పడతాయి. వివాహాది విషయములందు నిశ్చయముల దిశగా సాగుతారు. శని, ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.

## కుంభం



ధనిష్ఠ 3, 4 పా,శతతార, పూర్వాభాద్ర ఆర్థికలావాదేవీలను ప్రోత్సాహకంగా నిర్వహించగలుగుతారు. ప్రణాళికాయుతంగా అన్నిటా వ్యవహరించుకోగల్గుతారు. గతంలో ఆగిన పనులను పూర్తిచేసుకోగల్గుతారు. ఒప్పందాలను పూర్తిచేసుకోగలుగుతారు. విశ్రాంతికి ప్రాధాన్యతనీయండి. నూతన పరిచయములు, ప్రయోజనాలు వంటివి ఉంటాయి. కుటుంబమున ఉత్సాహములతో సాగగలరు. ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.

## మీనం



పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. ప్రయత్నాలను చూపు వారికి ప్రయోజనాలు ఉంటాయి. శారీరక, మానసిక సౌఖ్యములు పొందుతారు. ఖర్చులను, ఆదాయాలకు తగినట్లుగా చూసుకోగలరు.కుటుంబమున సర్దుబాటుధోరణితో సాగగలరు. ప్రభుత్వతరహాపనులు అనుకూలిస్తాయి. విద్యార్థులకు అనుకూల సమయం. గతంలో ఇబ్బందిపెట్టినఅంశాలను పరిష్కరించుకోగలరు. గురు, శుక్ర, శని వారాలు అనువైనవి.

వైఫల్యం నిరాశకు కారణం కాకూడదు. కొత్త ప్రేరణకు నాంది కావాలి.

# Whats App

ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు కష్టాలతో సహా.
వర్షంలో తడుస్తూ నడవటమంటే నాకిష్టం.
నా కన్నీళ్ళెవ్వరికీ కనిపించవు.
మన జీవితంలో ఏమాత్రం నవ్వని రోజు,పూర్తి వృధాగా గడిపినట్లు" -చార్లీ చాప్లిన్

- ఈ లోకంలో ఆరుగురు మంచి డాక్టర్లున్నారు.
1. సూర్యకాంతి, 2. విశ్రాంతి,
3. వ్యాయామం, 4. సరైన ఆహారం,
5.ఆత్మవిశ్వాసం, 6. మిత్రులు.

- ప్రపంచంలోనే అత్యంత కష్టమైంది 4 పనులు:
1. చీమకు లిప్‌స్టిక్ రాయటం, 2.దోమకు ఇంజక్షన్ చేయటం, 3. ఏనుగును ఒళ్ళో కూర్చోపెట్టుకోవడం, 4.భార్యకు నచ్చజెప్పటం.

- "ఏంట్రా నీలో నువ్వే నవ్వుకుంటున్నావు?" అడిగాడు స్నేహితుడిని. "నిన్న ఫేస్‌బుక్ చూసుకుంటూ పక్కింటిలోకెళ్ళాను. ఆమె వాట్సాప్ చూసుకుంటే, వాళ్ళాయనే అనుకుని టీ ఇచ్చింది. ఇంతలో వాళ్ళాయన 'ట్విట్టర్' చూసుకుంటూ మా ఇంటికెళ్ళాడు. మా ఆవిడ ఇన్‌స్టాగ్రామ్ చూసుకుంటూ ఆయనతో సెల్ఫీ దిగి పోస్ట్‌చేసింది. అప్పటికిగాని విషయం తెలీలేదు"



### కొంటె ప్రశ్నలు :

- "పెంపుడు కోడి భయపడేదెప్పుడు?" పండక్కి కొత్తల్లుడు వచ్చినప్పుడు.
- మనకు అర్థంకాకున్నా దాచుకునేది? "డాక్టరు ప్రిస్కిప్షన్'
- డాక్టర్, డ్రైవర్? డాక్టర్ చేతిలో ఒక ప్రాణమే ఉంటుంది. డ్రైవర్ చేతిలో 30 ప్రాణాలు ఉంటాయి.
- సన్యాసికి, సంసారికి తేడా?
సన్యాసి పులిచర్మంపై కూర్చుంటాడు.
సంసారి పులితోనే కాపురం చేశాడు.
- సాఫ్ట్‌వేర్ ఉద్యోగి జీతం ఆన్‌లైన్‌లో ట్రాన్స్‌ఫర్ చేస్తానంటే, పనిమనిషి 'వర్క్ ఫ్రమ్ హోమ్' చేస్తానంది.
- మొదటిసారి విమానం ఎక్కాడు అవతారం.
"విమానం కూలిపోతే నా ప్రాణాలకు గ్యారెంటీ ఎవరు?" అడిగాడు.
ఎయిర్ హోస్టెస్ : "మీకేం కాకుండా ప్యారాచూట్ ఇస్తామండి"
అవతారం : ప్రాణాలు పోతుంటే కొబ్బరినూనె ఎక్కడ రాసుకుంటాం?"
- వాలెంటైన్స్‌డే రోజు ఓ భర్త, భార్యకు తెల్లగులాబి ఇచ్చాడు.
భార్య : అదేంటి! లాస్టియర్ "ఎర్ర గులాబీ", ఇప్పుడు "తెల్ల గులాబీ" ఏంటి?
భర్త : అప్పుడు ప్రేమకోసం "ఎర్ర గులాబీ", ఇప్పుడు శాంతికోసం "తెల్లగులాబీ"
- అర్ధరాత్రి ఇంట్లో దూరిన ఓ దొంగని చావగొట్టి స్పృహ తప్పేలా కొట్టింది తాయారు. ఆమె ధైర్యం చూసి పోలీస్ ఇన్‌స్పెక్టర్ మెచ్చుకున్నాడు.
తాయారు సిగ్గుతో మెలి తిరుగుతూ "అబ్బే అదేం కాదండీ. అర్ధరాత్రి చప్పుడైతే, మావారే క్లబ్బు నుండి వచ్చారనుకుని చావగొట్టానండీ"అంది తాయారు నిదానంగా.
- "పెళ్ళంటే ఏమిటి స్వామీ?"
"పోవటం" నాయనా!
"అంటే పైకిపోవటమా స్వామీ?"
"ఇదే తొందరపాటు. పోవటం అంటే ఒణికిపోవటం, సర్దుకుపోవటం, అణగిపోవటం, ఒదిగిపోవటంలాంటివిరాఅర్భకుడా!"
- భార్య : "స్వామిజీ చెప్పిన పూజ చేస్తే అన్ని గండాలనుండి గట్టెక్కుతారుట!"
భర్త: అవును. నిజమే కావచ్చు. ఈ స్వామీజీనే కదా.మీ నాన్నతో మన పెళ్ళిముందు పూజలు చేయించింది? గండం నాకు చుట్టుకుంది.
- ప్రతి మగాడి వెనుక ఒక ఆడది వుంటుందనేది పాత మాట. ప్రతి కోటీశ్వరుడి విజయం వెనుక ఒక బ్యాంకు వుంటుందనేది నేటి మాట.
- గతం : పెద్దపులి పెళ్ళి జరిగింది. పెళ్ళికొచ్చిన జంతువులన్నీ, దూరంగా నిలబడి శుభాకాంక్షలు చెప్పున్నాయి.ఒక పిల్లి స్టేజిపైకి దూకి, దాని స్టైల్‌లో డ్యాన్స్‌చేసి పులికి షేక్‌హ్యాండ్ ఇచ్చి శుభాకాంక్షలు చెప్పింది. పులికి పిచ్చకోపం వచ్చింది.
"ఎంత ధైర్యం నీకు? చివరకు చిరుతపులి కూడా దూరంగా నిలబడి శుభాకాంక్షలు చెప్పింది. నువ్వు స్టేజీ మీదకు వస్తావా?" పిల్లి : "ఓసోస్!! పెళ్ళికాకముందు నేను కూడా పులినే"

---

- వాట్సాప్ స్టేటస్
"ఈ రోజుల్లో 80% మగపిల్లలకు, గర్ల్‌ఫ్రెండ్స్ వుంటున్నారు. మిగిలిన 20 శాతం వారికి మెదడు వుంది"
"నాకు నా ఉద్యోగమంటే చాలా ఇష్టం. సెలవు దొరికిన రోజు"
"జీవితం చాలా చిన్నది. పళ్ళూడేలోపే నవ్వాలి"
"ఎదుటివారిని ఒప్పించడం కుదరకపోతే, వారిని గందరగోళంలో పడేయ్"
"ఫోన్ సైలెంట్ మోడ్‌లో ఉన్నప్పుడే మిస్డ్ కాల్స్ ఎక్కువ వస్తాయి"
"ఈ క్షణంలో నేను చాలా బిజీ. మిగతా సమయమంతా ఖాళీనే"
"నత్తల నడక పోటీలో గెలిచేది ఎప్పుడూ నత్తే "నువ్వు కాదు"
"ఈ రోజుల్లో మానవ సంబంధాలు విచిత్రంగా ఉన్నాయి.
ఒకర్ని ఒకరు ముట్టుకుంటారు గాని ఫోన్లని మాత్రం ముట్టుకోనీరు"
- మనం బంధువుల, స్నేహితుల ఇంటికి వెళ్ళినప్పుడు, వారు సోఫాలోనే కూర్చుని, మనకు వీడ్కోలు చెబితే "దయచేసి ఇంకోసారి రావద్దని" అర్థం.
హాలు గుమ్మంవరకువచ్చి బై చెబితే "అప్పుడప్పుడు వచ్చిపోతూవుండ"మని అర్థం.
గేటు బయటవరకు వచ్చి చెబితే "మాటిమాటికీ వస్తూ ఉండ"మని అర్థం.
వీధి చివరివరకు వచ్చి వీడ్కోలు చెబితే "ఇలా వచ్చి అలా వెళ్ళటం కాదు.
ఈసారి వచ్చినప్పుడు నాలుగురోజులైనా ఉండా"లని అర్థం.
బస్సు ఎక్కించి వీడ్కోలు చెబితే, "నువ్వెళ్ళటం నచ్చలేదు.
మాతోనేవుండచ్చుగా" అని అర్థం. డైరీలో నోట్ చేసుకోండి. మర్చిపోతారు.
- విత్తనం భూమిని చీల్చుకొని, మొక్కగా ఎదిగేటప్పుడు ఎలాంటి శబ్దం చేయదు. కాని, అదే చెట్టు కూలిపోయినప్పుడు పెద్ద శబ్దం చేస్తుంది.
మనిషి పతనంలో శబ్దం ఎక్కువేమోగాని, ఎదగటంలో మాత్రం నిశ్శబ్దం ఉండాలి.
- ఒక హోటల్‌లో
భార్య : " ప్రార్థన చేయకుండానే భోజనం మొదలుపెట్టారేమిటండీ మీరు? మర్చిపోయారా ఏమిటి?
భర్త : ప్రార్థన ఇంట్లో చేస్తాను. హోటల్ వంటవాడు బాగా చేస్తాడు"

# దినుసులు



వంటగదిలో ఏ పదార్థం తయారుచేసినా దినుసులపెట్టె ఎంతగా రుచిని, సువాసనను అందజేస్తుందో విడిగా చెప్పుకోనవసరంలేదు. కేవలం పదార్థాల రుచిని, వాసనను ప్రభావితం చెయ్యడం మాత్రమే కాదు-

ఈ దినుసుల డబ్బాలోని అదరువుల్లో ఎన్నోరకాల ఆరోగ్య ప్రయోజనాలుంటాయి. సాదాసీదా మసాలా దినుసులు, పోపులు ఎటువంటి అసాధారణ ప్రయోజనాలు కలిగివుంటాయన్న అవగాహన అవసరం.

## దాల్చినచెక్క-సుగుణాల గని

- సువాసనలో సాటిలేనిది.అనేక ఔషధగుణాలు ఉంటాయి. హెచ్ఐవి కంట్రోలర్‌గా పనిచేస్తూ, హెచ్ఐవి ఇన్‌ఫెక్ట్ అయినవారిని ఆరోగ్యంగా మార్చడంలో సహకరిస్తాయి.
- దాల్చినచెక్కలో యాంటీ-న్యూరోడీజనరేటివ్ సామర్థ్యాలుండి,అల్జిమర్స్, పార్కిన్‌సన్‌లతో ఇబ్బందిపడే రోగులతో మెదడు హానికి మరమ్మతులు చేసి, సమస్యను వాయిదావేయగలగుణాలుంటాయి.
- శరీరంనుంచి చెడు కొలెస్ట్రాల్‌ను తొలగించి,మంచి కొలెస్ట్రాల్‌ను పెంచుతుంది.
- టైప్ 2 డయాబెటిస్‌ను నిర్వహించడంలో ప్రభావవంతంగా పనిచేస్తుంది.
- పాలిసిస్టిక్ ఓవరిన్ సిండ్రోమ్‌ను తగ్గించడంలో సహకరిస్తుంది.ఎండోమెట్రియోసిస్, గర్భసంచిలోని ఫైబ్రాయిడ్స్‌వల్ల కలిగే అధిక రక్తస్రావాన్ని తగ్గించే గుణాలున్నాయి.

## జాయ్‌ఫల్

- జాయ్‌ఫల్‌గా పేర్కొనే జాజికాయ సహజసిద్ధంగా యవ్వనాన్ని ప్రసాదించగలదు.
- కాలేయం, మూత్రపిండాలలోని మాలిన్యాలను తొలగించే గుణం కలిగి వుంటుంది. అధిక భాగం విషతుల్యాలు ఈ రెండు అవయవాల్లోనే పేరుకుంటుంటాయి.
- జాజికాయనుంచి వెలికితీసే ఎసెన్షియల్ ఆయిల్ లుకేమియా లేదా బ్లడ్ క్యాన్సర్ల చికిత్సలో ఉపకరిస్తుంది. దీనిలో యాంటీ-బ్యాక్టీరియల్‌గుణాలు నోటిదుర్వాసన, ఇతర నోటిఆరోగ్య సమస్యలను పరిష్కరిస్తాయి.
- పడుకునేముందు గోరువెచ్చనిపాలలో చిటికెడు జాజికాయపొడి కలుపుకుని తాగితే మంచి నిద్ర పడుతుంది. సౌందర్య పరిరక్షణలోనూ సహకరిస్తుంది. తేనె లేదా నీటిలో కలిపి జాజికాయ పేస్ట్ తయారుచేసి రాస్తే, చర్మం ఇన్‌ఫ్లమేషన్‌కు మంచి మందు మాదిరి పనిచేస్తుంది.
- జుట్టు రాలడాన్ని కూడా అరికడుతుంది.

## పసుపు సూపర్

- ఔషధగుణాలు గల పసుపును ఏనాటినుంచో గాయాలను మాన్పడానికి ఉపయోగిస్తున్నారు. దీనిలోని యాంటీ-సెప్టిక్, యాంటీ-బ్యాక్టీరియల్ గుణాలు ఇన్‌ఫెక్షన్లను, గాయాలను తగ్గించడంలో ఉపయోగకరంగా వుంటాయి.
- పసుపును తీసుకోవడంవల్ల హార్మోన్ల అసమతౌల్యం




తగ్గుతుంది. ఇటువంటి అసమతౌల్యం మహిళల ముఖం, ఛాతీ, వీపుపై అవాంఛిత రోమాల పెరుగుదలకు కారణమవుతుంది. వివిధ రకాల క్యాన్సర్లను అడ్డుకోవడంలో సహకరిస్తుంది.

- సోరియాసిస్‌కు కారణమయ్యే ఇన్‌ఫ్లమేటరీ ఎంజైమ్‌ల స్థాయిలను పసుపు తగ్గించగలదు.
- పసుపులో కనపడే 'కర్క్యుమిన్' స్ట్రెచ్ మార్కులను తగ్గించి, చర్మకాంతిని పెంచుతుంది.

## వాముతో దోమలు మాయం

- దోమలకు దూరంగా ఉండేందుకు రసాయన మస్కిటో రిపెల్లెంట్స్ స్థానే సహజంగా వాముతో ఇంట్లో తయారుచేసుకోవచ్చు. వాముపొడిని ఆవ నూనెతో కలిపి ఈ మిశ్రమాన్ని అట్టముక్కలపై రాసి, గది మూలల్లో వాటిని వేలాడదీయాలి. ఫలితాన్ని ప్రత్యక్షంగా చూస్తే అర్థంకాగలదు.
- జీర్ణవ్యవస్థ సాఫీగా సాగేందుకు వంటగదిలో వాము వాడకం ఏనాటినుంచో వుంది.

అజీర్ణం, ఆకలి లోపించడం, ఎసిడిటి, కడుపునొప్పి వంటి సమస్యల పరిష్కారంలో వాము ప్రభావవంతమైన వంటగది చిట్కా.

- ముందస్తుగా జుట్టు నెరవడాన్ని బాగా ఆపుతుంది. అతిరక్తస్రావం, ఋతుక్రమంలో వ్యత్యాసాలని అరికట్టే గుణాలున్నాయి.

## గసగసాలు-సంతానప్రాప్తి

- చిన్నగా చేతికి అందకుండా వుండే గసగసాల్లో నోట్లోని అల్సర్లను తగ్గించే గుణం ఉంటుంది. శరీరంపై కూలింగ్ ప్రభావం చూపుతుంది.
- పాపీసీడ్ ఆయిల్ మహిళల్లో సంతానోత్పత్తి శక్తిని పెంపొందించడంలో సహకరిస్తుంది.
- జింకుకు మంచి ఆధారం కాబట్టి కంటిదృష్టిని మెరుగుపరుస్తుంది. మాక్యులర్ డీజనరేషన్ వంటి కళ్ళ జబ్బుల అవకాశాలను తొలగిస్తుంది.

డైటరీ పీచు అత్యధికంగా వుంటుంది కాబట్టి కొలెస్టరాల్‌ను తగ్గించి, గుండె ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తుంది. కిడ్నీలో రాళ్ళ అవకాశాలు తగ్గించే గుణాలుంటాయి.

## యవ్వనానికి యాలకులు

- పదార్థాలకు మంచి వాసనఇచ్చే యాలకుల్ని పాము లేదా తేలుకాట్లకు విరుగుడుగా వాడేవారంటే నమ్మశక్యం కాకపోవచ్చు.
- వెక్కిళ్ళు, వికారం, ఉదరం, పేగుల క్రాంప్స్‌ను తగ్గించే గుణాలుంటాయి.
- ఆయుర్వేదం ప్రకారం డిప్రెషన్‌ను తగ్గించడంలో యాలకులు ప్రయోజనకరంగా వుంటాయి.
- యాలకులనుంచి తీసే ఎసెన్షియల్ ఆయిల్‌ను అరోమా థెరపీలో ఉపయోగిస్తారు. దీనిలో యాంటీ క్లాటింగ్, డిటాక్సిఫైయింగ్, యాంటీ-బ్యాక్టీరియల్, డైయూరెటిక్, యవ్వనగుణాల రీత్యా చర్మఎలర్జీలు, అంగస్తంభన, నపుంసక సమస్యల చికిత్సలో ఉపయోగిస్తారు.

## దంతకాంతికి లవంగం

- లవంగాలను ఎనస్థిటిక్, యాంటీ-బ్యాక్టీరియల్ గుణాలు కలవిగా పరిగణిస్తారు. జింజివైటిస్ వంటి చిగుర్లవ్యాధుల చికిత్సలో ప్రభావవంతంగా పనిచేస్తుంది.టూత్‌పేస్ట్‌లలో లవంగాల వాడకం విస్తృతంగా వుంటుంది.
- లివర్ క్యాన్సర్‌ను తొలిదశల్లో నివారించగల గుణం వుంటుంది.

ఆస్టియోపోరోసిస్ వంటి ఎముక పరిస్థితులను బాగా తగ్గిస్తుంది.లవంగాల వెలికితీతలు డయాబెటిస్‌గలవారికి మేలుచేస్తాయి. రక్తంలో చక్కెర స్థాయిల్ని నియంత్రించగలవు.

- లవంగం ఎసెన్షియల్ ఆయిల్ ఉదరంలో అల్సర్లను తగ్గించగల గుణం కలిగివుంటుంది.

## ధనియాల మేలు

- ధనియాల్లో లెక్కలేనన్ని ప్రయోజనాలు ఉంటాయి. కంజక్టివైటిస్ నివారణలో తక్షణ ఫలితాలను కనబరుస్తుంది. ఫుడ్ పాయిజనింగ్‌ను ఎదుర్కొని, ఉదరసమస్యలు పరిష్కరించడంలో మేలు చేస్తుంది. రక్తహీనత, ఇతర ఐరన్ లోపాలను తగ్గించడంలో ప్రయోజనకారి. జీర్ణశక్తికి ఉపకరిస్తుంది. జలుబునుంచి పరిరక్షిస్తుంది. ఫ్లూను, బరువును తగ్గించడంలో సహకరిస్తుంది. ఎలర్జిక్ రియాక్షన్లనుంచి తక్షణ ఉపశమనం కల్గిస్తుంది.



## మిరియ సౌందర్యం

- నల్లమిరియాలు విటిలిగొకు మంచి పరిష్కారం. దీనివల్ల చర్మం పిగ్మెంటేషన్ కోల్పోయి కొన్ని ప్యాచ్‌లు పడుతుంది.
- పొగ తాగడం మానేయాలనుకునేవారికి సహకరించే సాధనం.నల్లమిరియాల వేపర్‌ను పీల్చేవారికి సిగరెట్ తాగాలన్న కోరిక తగ్గుతుందని పరిశోధనలు పేర్కొంటున్నాయి.



- పోషకాలను శరీరం గ్రహించడానికి, సెక్సువల్ స్టామినా పెరగడానికి సహకరిస్తుంది.
- ఆయుర్వేద వైద్యంలో మిరియాలను ఫ్లూ, ఆస్తమా, సైనుసైటిస్, ముక్కుదిబ్బెడ వంటివాటిని నివారించడంలో వాడతారు.
- మిరియాలు ఎనరక్సియా నుంచి ఉపశమనాన్ని ఇచ్చి, ఆకలిని పెంచుతాయి.

## జీలకర్ర : సువాసనకారిణి

- రుచిని,సువాసనను ఇవ్వడంలో తిరుగులేనిదినుసు. శరీరంనుంచి విషతుల్యాలను తొలగిస్తుంది.
- మంచిరుచి, వాసనల దృష్ట్యా అనేక పదార్థాల తయారీలో జీలకర్రను విస్తృతంగావాడతారు. జల్‌జీర ప్రయోజనాలు అనేకం.
- జీలకర్రలో గుర్తించతగినంత మోతాదులో క్యాల్షియం వుంటుంది.
- పాలిచ్చే తల్లుల స్తన్యం పెరగడంలో సహకరిస్తుంది. జీలకర్రనుంచి వెలికితీసే ఎసెన్షియల్ ఆయిల్‌ను అనేక లోషన్లు, పర్ఫ్యూమ్స్, క్రీమ్స్ తయారీలో వాడతారు.
- ఆస్తమా, బ్రాంకైటిస్‌లకు తిరుగులేని వంటింటి చిట్కా.

పోపులపెట్టెలో ఇన్ని ప్రయోజనాలు దాగుంటాయన్నమాట. ప్రతిరోజూ ఏవో ఒకటి వాడుతున్నా అనవసరంగా, చీటికీమాటికీ మాత్రల జోలికి వెళ్ళాల్సిన అవసరం రాదు.

**జి.మల్లీశ్వరి**

# నేనెంతో గట్టిదాన్ని



ఐ.ఎ.ఎస్. కావాలనుకుంటూ సినిమాల్లోకి వచ్చేసిన రాశీఖన్నా అప్పట్లో బొద్దుగా, గుండ్రంగా ఉండేది. పరిశ్రమ, ప్రేక్షకులు కూడా పర్సనాలిటీ కాస్తంత భారీగాఉందన్నారు.ఒక్కోసినిమాకు మార్పు చెందుతూ, ఇప్పుడు ఎంచక్కా నాజూకు తేలిపోయింది.ఢిల్లీనుంచి మకాంమార్చేసి హైదరబాద్ వచ్చేసింది. రాశీఖన్నాతో ఇంటర్వ్యూ విశేషాలు.

**ఎప్పుడూ పాజిటివ్‌గా కనిపిస్తారు? ఏమిటా రహస్యం?**

నేను స్పిరిచ్యువల్ పర్సన్‌ను. చాలా గట్టిదాన్ననే చెప్పుకోవాలి. జీవితంలోని ప్రతిచిన్న విషయాన్నీ బ్యాలెన్స్ చేసుకోవడం నాకు అలవాటయింది. స్కూలురోజుల్నుంచీకూడా నేనిలాగే స్ట్రాంగ్.

మా అమ్మమ్మ ఏ విషయానికీ తొట్రుపడకుండా చాలా దృఢంగా వుండేది. తను రామాయణ, భారతాలు చదువుతూ నాకూ వినిపించేది.

వాటికి నేను చాలా స్ఫూర్తి పొందేదాన్ని. అలా నేనూ దృఢంగా మారిపోయాను.

**ఐ.ఎ.ఎస్. కావాలనుకున్నారేమో?**

(నవ్వేస్తూ) నిజమే. కాని అనుకోకుండా నటిని అయిపోయా. ఇది దేవుడి ప్లాన్ కావచ్చు. ఒకరోజు నేను స్నేహితులతో కలసి మాల్‌కు వెళ్ళాను. అక్కడో అబ్బాయి మేగజైన్‌పైన కవర్‌పేజీకి ఫోటోను సరదాగా వేసుకుంటానని అడిగాడు. సరేనన్నా.

అది ప్రచురితం అయ్యాక ఒకదాని తర్వాత ఒకటిగా యాడ్స్ అవకాశాలు వచ్చాయి. 'మద్రాస్ కేఫ్' సినీ అవకాశం లభించింది. అంతే- సినిమాలు, షూటింగ్‌లతో చదువుకు బ్రేక్‌పడింది.

**మీ దినచర్య ఎలా ఉంటుంది?**

ప్రతిరోజూ ఉదయం ఆరింటికే లేస్తాను. ఇంతకు ముందు జిమ్‌కు రోజుకు రెండుసార్లు వెళ్ళేదాన్ని కాని ఇప్పుడు సాయంత్రం ఆరింటి తర్వాత ఓ గంటన్నరసేపు జిమ్ చేస్తాను. ఇక ఇంటికి చేరిపోతే అదే నా ప్రపంచం అయిపోతుంది. మొత్తంమీద నా దినచర్య చాలా క్రమశిక్షణగా సాగుతుంటుంది.

**మీకు పుస్తక పఠనం అలవాటు ఉందేమో?**

బాగా. టైమ్ చిక్కితే చాలా చదువుతుంటా. నా దగ్గర రెండొందలకుపైగా పుస్తకాలు ఉన్నాయి.

ఫిక్షన్, థ్రిల్లర్లు చదవడం కూడా ఇష్టం. అన్ని రకాల పుస్తకాలూ కొంటుంటా. అలాగే మిథాలజీ, సైకాలజీ, ఆధ్యాత్మిక పుస్తకాలూ ఉన్నాయి. పొలిటికల్ పుస్తకాలపట్లకూడా ఆసక్తి ఉంది.

**ఒకప్పుడు లావుగా వున్నారంటూ కామెంట్ చేసేవారు కదా. ఒత్తిడిగా ఫీలయ్యేవారా?**

నాకు నా పట్ల నమ్మకం ఎక్కువ. ఏదైనా సాధించగలను, చెయ్యగలను అన్న నమ్మకం ఉంటుంది. నా హార్డ్‌వర్క్‌తో రూపం మారింది.

నేనే విషయంలోనైనా హార్డ్‌వర్క్ చేస్తుంటా. ఫలితాన్ని భగవంతుడిపై వేస్తాను.

**మీకు బాగా ఇష్టమైన సబ్జెక్టు ఏంటి?**

సైకాలజీ. మాస్టర్స్‌లో రెండో సబ్జెక్టుగా సైకాలజీ



చదవాలని అనుకున్నాను.సినిమాలతో బ్రేక్ వచ్చింది. కాలేజీలో చదవలేకపోయాను కాని, మామూలుగా సైకాలజీ పుస్తకాలు బాగా చదువుతుంటా.

**పురాణ పుస్తకాలు చదువుతారా? మీకు ఎటు వంటి పాత్రలు ఇష్టం?**

నాకు చిన్నప్పటినుంచి ఈ పుస్తకాలు చదివే అల వాటు ఉంది. సీత, ద్రౌపది పాత్రలు బాగా ఇష్టం. నాకు గ్రీక్ మిథాలజీకూడా ఇష్టం. ఈ అలవాటు కాలేజీ రోజుల నాటిది.

**మీరు ఢిల్లీ ఇంటిని వదిలేసి ఇక్కడికి వచ్చి నప్పుడు ఫీలవలేదా?**

హైదరాబాద్‌ను మరీ మరీ ఇష్టపడ్డాను కదా. కాబట్టి ఫీలవలేదు. నేను నటిగా ఎదిగింది హైదరా బాద్‌లోనే. నేను అభిమానులను ఇక్కడే సంపాదించు కున్నాను. ఇక్కడ సంపాదించిన డబ్బుతో ఇల్లు కొనుక్కున్నాను కదా. కాబట్టి నాకు హైదరాబాద్ ఇల్లంటే ఇష్టం.ఢిల్లీలో బంధుమిత్రులు వున్నా, అక్కడ ఓ రెండు రోజులు ఉన్నానంటే హైదరాబాద్ మీద బెంగవచ్చేస్తుంటుంది.

**సామాజిక సేవ చేస్తారేమో కదా?**

అవన్నీ బయటకు చెప్పడం నాకు ఇష్టంలేదు. కుడిచేత్తో చేసిన సాయం ఎడమచేతికి తెలియకూడ దని అమ్మ ఎప్పుడూ అంటుంటుంది. అందుకే చేసే సాయంగురించి చెప్పుకోవడం నాకు ఇష్టంలేదు.

**ప్రేమపట్ల మీ అభిప్రాయం?**

(నవ్వేస్తూ) ప్రేమంటే ప్రేమే. ప్రేమగురించి చెప్పా లంటే ప్రేమను మించిన పదం లేదు. స్వచ్ఛమైన ప్రేమ అంటే ఎంతో నిజాయితీగల భావోద్వేగం.

**ఎప్పుడైనా ప్రేమలేఖ అందుకున్నారా?**

(మరోమారు నవ్వేస్తూ) నేను స్కూల్లో చదువుకునే టప్పుడు ఓ సీనియర్ ప్రేమలేఖ రాశాడు. ఓ గులాబీ పువ్వు, ప్రేమలేఖ అందించాడు. భయంవేసి పరిగెత్తా. తరుముతూ వచ్చి మరీ అందించాడు. నిజం చెప్పా లంటే నాకు ప్రేమలేఖ ఇష్టమే. రాసినందుకు మన సులో ఆనందించాననుకోండి. ఆ ఉత్తరం తీసుకు వెళ్ళి మా అమ్మకు ఇచ్చాను.

**అభిమానులనుంచి ప్రపోజల్స్ రాలేదా?**

'సుప్రీమ్' సినిమా తర్వాత ఓ అబ్బాయి నేను అంగీకరిస్తే జీవితాంతం నా ఖైదులో ఉంటానంటూ కామెంట్ పెట్టాడు.

**మీపట్ల వచ్చిన గాసిప్స్ విన్నప్పుడు మీరు ఏ విధంగా ఫీలవుతారు?**

నిజం చెప్పాలంటే అటువంటి గాసిప్స్‌ను నేను అసలు చదవను. వాటిలోని నిజానిజాలు ప్రజలకు తెలుస్తాయి. అవి చదివి మనస్సు పాడుచేసుకుని రియాక్టవడం అనవసరం అనుకుంటాను అంటూ ముగించింది రాశీఖన్నా.

**అయినపూరి సుజాత**

# సామ్రాట్ సముద్రగుప్త

"ఇదేమిటి సముద్రా! ఈ వనంలోకి ఎవరో శత్రువు ప్రవేశించాడని బాణాలు ప్రయోగించాను. నువ్వు ఇలా ఒంటరిగా రావటం నాకు ఆశ్చర్యాన్ని రేకెత్తిస్తోంది"

"మిమ్మల్నే వెతుక్కుంటూ వచ్చాను గురుదేవా!"

"నన్నా..!" సారంగుడు మరోసారి ఆశ్చర్యపోయాడు.

"అయితే రాకుమారులు మా ఆశ్రమాన్ని అతిథులుగా పావనం చేస్తున్నారు"

"ఔను గురుదేవా...! కర్తవ్యము బోధపడక మీ నుంచి కర్తవ్యబోధ కోసమై వచ్చాను"

"ఆవశ్యం యువరాజా!" అని సారంగుడు అన్నాడు. "ముందు ఆశ్రమానికి వెడదాం" ఇద్దరూ మరో ఘడియతరువాత ఆశ్రమానికి చేరుకున్నారు.

ఆశ్రమం చేరేవరకు ఆ ఇరువురి మధ్య మాటలు లేవు.

ముందు గురువు సారంగుడు, అతడి అడుగుజాడల్లో శిష్యుడు - ఆ దేశపు యువరాజు సముద్రగుప్తుడు.

సారంగుడు యువరాజును దర్భాసనంపైన కూర్చోపెట్టి తను వెళ్ళి సంధ్యావందనం చేసి సూర్యుడికి అర్ఘ్యం ఇచ్చి వచ్చాడు. అంతవరకూ శిలావిగ్రహంలా కూర్చొనివున్నాడు సముద్రుడు.

సారంగుడి శిష్యులు యువరాజును గమనిస్తున్నారు. సారంగుడు వచ్చి యువరాజుముందు కూర్చున్నాడు.

"ఇదేమిటి సముద్రా...! సంధ్యా సమయమైంది. సూర్యుడికి అర్ఘ్యాన్ని ఇవ్వలేదు" అడిగాడు.

"... ... ..."

"ఓహో, రాజరికపు భోగాల్లో మునిగివున్న నీకు లోకబాంధవుడైన ఆ సూర్య భగవానుడి గురించి ఆలోచించటానికి సమయమెక్కడ ఉన్నది" అన్నాడు.

"గురుదేవా!"

"సముద్రా! నువ్వు నాదగ్గర పన్నెండు సంవత్సరాలు విద్యను అభ్యసించావ్! కానీ నేను నీ గురువునయినందుకు ప్రాయశ్చిత్తం చేసుకోవాల్సివుంది"

ఆ మాటలు వాడిగా లోతుగా తగిలాయ్ సముద్రుడికి.

"గురుదేవా!" ఈసారి బాధగా అన్నాడు సముద్రుడు.

"యువరాజా! నీ రాచరికపు హోదా వల్ల సంక్రమించిన అధికారంతో నన్ను దండించినా నేను భయపడను. కానీ ఈ దేశపు రాకుమారుడికి గురువుగా నీ ప్రప్రథమ కర్తవ్యాన్ని గుర్తుచేస్తున్నాను. ముందుగా వెళ్ళి ఆ లోకరక్షకుడికి, ఆ జగత్కారకుడికి, మన మనుగడకే ఆధారభూతుడైన ఆ సూర్యుడికి అర్ఘ్యప్రధానం చేసిరా... ఆ తర్వాత కర్తవ్యాన్ని గురించి చర్చిద్దాం"

"గురుదేవా! నన్ను క్షమించండి.." సముద్రగుప్తుడిలో సిగ్గు.

"అవును సముద్రా! ప్రతి నిత్యమూ సూర్యుడికి అర్ఘ్యం ఇవ్వకుండా, ఇన్ని సంవత్సరాలు నువ్వు తీసుకున్న ఆహార పానీయాలు విషతుల్యాలు. ఇలాంటి శిష్యుడికా, నేను విద్యను బోధించాను!" సారంగుడిలో వేదన, సముద్రగుప్తుడు తలవంచుకున్నాడు.

"ఈ దేశంలో, ఏ వర్ణవిభేదాలు లేకుండా ఎవరయినా సరే ప్రతి ఉదయం ఆ పవిత్ర దేవుడికి కనీసం ఒక్క నమస్కారమైనా చేయకుండా, ఆ రోజు ప్రారంభించటం, ఎంతటి హేయమయిన విషయం. ముందుగా వెళ్ళి అర్ఘ్యాన్ని ఇచ్చిరా!"

సముద్రగుప్తుడు మారుమాటాడకుండా వెళ్ళి మరో అరఘడియలో తిరిగివచ్చాడు కర్తవ్యాన్ని నిర్వర్తించుకొని, అర్ఘ్యప్రధానం చేసి.

ఈసారి, సారంగుడికి ఎదురుగా ఆశీనుడయ్యాడు యువరాజు. ఉన్నట్టుండి సముద్రుడి కళ్ళు సారంగుడి చేయివైపు తిరిగాయ్...! సముద్రుడి కళ్ళలో బాధతో కూడిన సంభ్రమం.

"అదేమిటి గురుదేవా! మీ అరచేతిలో ఆ రక్తధారలు"

నిర్భావంగా సమాధానం ఇచ్చాడు సారంగుడు. "చెప్పాను గదా! సముద్రా! ప్రాయశ్చిత్తం... శిష్యుడు చేసిన పాపాలకు గురువు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి"

అపుడుగానీ సముద్రుడికి అర్థం కాలేదు. పక్కనే శరాగ్రాలతో తన చేతుల్ని నిలువుగా కోసుకున్నాడు సారంగుడు. రక్తంలో తడిసిన బాణాలు పక్కనే ఉన్నాయ్! సముద్రుడు విలవిలలాడిపోయాడు. 'ఎంతటి పాపం

## జరిగిన కథ (10)

కాపాలికుడు సముద్రగుప్తుడిలోని క్షాత్రాన్ని రెచ్చగొడతాడు. తన తల్లి నాగాయకుడివల్ల ఆత్మత్యాగం చేసుకున్న దుర్ఘటన గుర్తుకువచ్చి బాధపడుతుంది లావినియా.

లావినియాను సముద్రగుప్తుడి నుంచి దూరంచేసేందుకు సౌగంధి, సుకన్యలు కుట్ర చేస్తారు.

వైశాలీ నగరంలోని నగర పాలకుడు ప్రజాధనాన్ని దుర్వినియోగం చేసినందుకు అత్యంత కఠిన శిక్షను విధిస్తాడు కచుడు. ఆలయంనుంచి నిష్క్రమించిన యువరాజు రాజధానికి ఎందుకు చేరలేదో కచ, కశ్యపులకు ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

రాజనర్తకి సౌగంధిని లావినియా దగ్గరకు వెళ్ళి ఆమె అందచందాల గురించి పొగుడుతుంది. సౌగంధి అంటే లావినియాకు స్నేహభావం ఏర్పడుతుంది.

"ఇంద్రప్రస్థ రాజు నాగాయకుడు నా తల్లిదండ్రుల్ని సంహరించాడు. వాడి పీడ అణిచేందుకే తాను సముద్రగుప్తుడ్ని ఆశ్రయించినట్లు సౌగంధినికి చెబ్తుంది లావినియా.

జాక్-డాన్ పక్షుల జంటగురించి వింటుంది లావినియా. అడవిలో గురుదేవుడైన సారంగుడు తటస్థపడతాడు సముద్రగుప్తుడికి.

ఇక జరిగేది చదవండి.

చేశాడతను' యువరాజు కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయ్!

సారంగుడు "ఏమైంది యువరాజా! ఈ బాధ తాత్కాలికం. కానీ ప్రాయశ్చిత్తం చేసుకున్న సంతృప్తి ఆ బాధకన్నా అనేక రెట్లు పెద్దది"

"గురుదేవా! మీ చేతిలో అలా రక్తం" ఆపైన సముద్రుడికి మాటలు రాలేదు.

"యువరాజా!" సారంగుడి మాట ఈసారి కఠినంగా ఉన్నది.

"రక్తాన్ని చూసి వెరపు చెందేవాడు క్షత్రియుడు కాలేడు. గాయాలకు విలవిలలాడిపోయే సున్నిత మనస్కుడు, రాజు కాలేడు. రాజ్యాన్ని పరిపాలించలేడు. రాజు వజ్రమనస్కుడైవుండాలి.

శత్రువుల రక్తపు ఏరులలో స్నానం చేయటం రాజుకు, తన ప్రియురాలి పరిష్వంగనలో పొందే సుఖంతో సమానమయివుండాలి"

"... ... ..."

"అవును సముద్రా...! ఈ ప్రపంచంలో ఏ శక్తి నిన్ను మార్చలేదు... సామ్రాట్ చంద్రగుప్తులు నీ గురించి ఎంతటి చింతన, ఎంతటి వేదన పడుతున్నారో నీకు తెలియదు. మారని నీ వైఖరిగురించి" అన్నారు.

"గురుదేవా...!" సముద్రగుప్తుడిలో నిస్సహాయతతో కూడిన బాధ.

సారంగుడు ఈసారి నిట్టూర్చాడు. "అవును నువ్వేం చేస్తావ్! నీ ప్రవృత్తి అటువంటిది. నిన్ను అలా సృష్టించిన భగవంతుడ్నే ఈ ప్రశ్న వేయమని, ఒకప్పుడు నాతో నీవన్న మాటలు, నాకు ఇంకా గుర్తున్నాయ్ యువరాజా!"

"... ... ..."

"సరే చెప్పు, యువరాజా! ఇంతకీ నీ రాకలో అంతరార్థం ఏమిటో..."

సముద్రగుప్తుడు వివరించాడు. భద్రకాళి ఆలయములో కాపాలికుడి మాటలు, లావినియా తనని శరణు కోరిన వైనం, ఆమె ఎడల తనకుగల కర్తవ్యం!

సారంగుడు పెద్దపెట్టున నవ్వాడు. "ఓహో సుందరాంగి ఎడల యువరాజుకు కర్తవ్యం ఉన్నది. కానీ ఈ దేశం గురించి ఎటువంటి కర్తవ్యం లేదు"

సముద్రగుప్తుడు తలొంచుకున్నాడు. "గురుదేవా! నా మనసు నా ఆధీనంలో లేదు. లావినియా నన్ను పూర్తిగా వశపరచుకున్నది"

"ఓహో! వేద వేదాంగ విశారదుడు, మహాపండితుడు అయిన యువరాజు, ఒకప్పుడు ఈ మనస్సు గురించి విశేషమైన తత్త్వ విచారణ చేశాడు. ఈ జగత్తు అంతటికి మనసే మూలకారణమని, ఆ రోజుల్లో నాతో ప్రవచించేవాడు. అటువంటి యువరాజు ఈనాడు మనసుకు దాసోహమంటున్నాడే!"

సముద్రగుప్తుడు తలవంచుకొని "అవును గురుదేవా! నాకు వున్నది పాండిత్యమే కాని జ్ఞానం కాదు" నెమ్మదిగా అన్నాడు.

"ఓహో! పాండిత్యానికి, జ్ఞానానికి భేదమేమిటో"

"పాండిత్యం పూవు. జ్ఞానం కాయ. పూవు కాయగా మారటానికి కాలం పరిపక్వం చెందాలి గురుదేవా!"



## వద్దంటే వద్దన్నారు

కన్నడ తొలి సినిమాలోని పాత్ర పేరు నందితను ముందు చేర్చుకుని అసలు శ్వేతనందిత శ్వేత అయింది.

ఏడాదిన్నరక్రితం 'ఎక్కడికి పోతావు చిన్నవాడ'తో తెలుగువారి ముందుకు వచ్చిన ఈ బెంగళూరు భామకు తెలుగు అవకాశాలు బాగానే వచ్చినా తమిళ కమిట్‌మెంట్స్‌తో కుదరలేదు. ప్రస్తుతానికి 'శ్రీనివాస కల్యాణం' చిత్రానికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. చిన్నతనంలో నటనపట్ల ఎక్కడ ఆకర్షితురాలవుతుందోనన్న భయంతో వాళ్ళ తాతగారు ఇంట్లో కనీసం టీవీకూడా పెట్టేవారుకాదట.

అటువంటి అమ్మాయి సినిమాల్లో నటిస్తానని చెప్పినప్పుడు అమ్మా నాన్న అస్సలే ఒప్పుకోలేదట. "మూడు రోజులు అన్నం తినకుండా, గదిలో గడి వేసుకుని కూర్చున్నా. అలా మొండిపట్టుదలతో ఒప్పించగలిగాను. చదువు పూర్తిచేయాలన్న షరతు పెట్టారు. సరేనని ఎమ్.బి.ఎ. పూర్తిచేశా" అని చెప్పింది.

సారంగుడు తన శిష్యుడు ఇచ్చిన అద్భుత వివరణకు, ముగ్ధుడైపోయాడు. అయితే ఆ భావాన్ని బైటకు ప్రస్ఫుటం చేయకుండా "అలాగే, ఈ సాత్త్వికుడు రాజసికుడు కావటానికి కూడా కాలం పరిపక్వం చెందాల్సివుంది" అన్నాడు.

సముద్రుడు విస్మయంగా "సాత్త్వికత పైమెట్టు, దానికింద మెట్టుమాత్రమే రాజసికత. జన్మజన్మాంతర సుకృతమయిన ఫలరూపమైన ఈ మహాతేజోగుణం, ఈ సాత్త్వికత నుంచి పతనం కమ్మని గురుదేవులు బోధించటం ఎంతో ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు.

"ఓహో సుందరాంగనలతో భోగించటం సాత్త్వికత కాబోలు యువరాజా!" మరోసారి పెద్దగా నవ్వాడు సారంగుడు.

చురుక్కుమన్నాయి సముద్రగుప్తుడికి, ఆ మాటలు. అంతేకాదు, రాకుమారుడిని ఎంతగానో ఆలోచింపజేశాయ్ ఆ మాటలు.

"సముద్రా! నిజమయిన సాత్త్వికత వైరాగ్య భూమికలోనే అవతరిస్తుంది. ఇహలోక భోగాలయందు అనురక్తుడైన వాడ్ని సాత్త్వికుడని ఎలా అంటారు?"

సముద్రగుప్తుడు అయోమయంగా చూశాడు. "సత్త్వం మహాశక్తి. ఆ మహాశక్తి ఎవరిలోనయినా సరే, మనసును జయించినవాడికే స్వాధీనమవుతుంది. మనసును జయించటానికి ప్రథమ సోపానం విరక్తియే కాని, అనురక్తి కాదు సముద్రా!"

సముద్రుడికి ఉన్నట్టుండి సత్య సందర్శన చేసిన అనుభూతి కలిగింది. అయితే తనలోని భోగలాలసత, సౌందర్యాభినివేశము సాత్త్వికత కాదు. ఇంతకాలము తను ఒక మహామేధావి అని, ఒక మహాపండితుడని కించిత్ స్వాతిశయం వుండేది. అది ఈనాడు ముక్కలు ముక్కలయింది, గురుడు ఇచ్చిన వివరణతో. అయితే ఇంతకీ తను ఎవరు? సముద్రగుప్తుడిలో అంతర్మథనం మొదలయింది.

"పూర్వజన్మ సుకృతంవలన తను రాజవంశంలో జన్మించాడు. సమస్త భోగాలు తనచుట్టూ తిరుగుతున్నాయి. అయితే తనలోని సున్నితత్వం, కోమల హృదయం, సౌందర్యారాధన, దయార్ద్ర హృదయము - ఇవన్నీ ఏమిటి?

సాత్త్వికప్రవృత్తులు కావా! మరి గురువు విరక్తియే సాత్త్వికతకు ప్రథమ సోపానమని అంటున్నారు' మళ్ళీ సారంగుడు అన్నాడు-

"ఆ సిద్దార్థుడు వైరాగ్య భూమికలోకి అవతరించినతరువాతనే తథాగతుడయ్యాడు సముద్రా!"

సారంగుడు అన్నాడు "సముద్రా! నీలో ఇంకా స్పష్టాస్పష్ట వీచికలు

**చర్చ లేకుండా బడ్జెట్‌ని ఆమోదింపచేసుకోవాలనే టి.ఆర్.ఎస్. ప్రభుత్వం ప్రతిపక్షాలను సభనుండి వెళ్ళగొడుతోంది.**

-జానారెడ్డి, కాంగ్రెస్ నేత



ఉన్నాయ్! జీవితంలో, నీకంటే అనేక దశలు అధిగమించిన నాకు నీ పరిస్థితి ఏమిటో నా కన్నులముందు సాక్షాత్కరిస్తోంది"

"అందుకనే కదా గురుదేవా! ఇంత దూరం మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను" అన్నాడు.

"అయితే చెపుతున్నాను విను. నీవు సంపూర్ణ సాత్త్వికుడవు అని అనుకుంటే వెంటనే కాషాయాంబరాలు ధరించి సన్యసించు... లేదా కత్తిచేత బూని సుక్షత్రియుడిలాగా నీ కర్తవ్యాన్ని నిర్వర్తించు"

"... ... ..."

"లేకపోతే ఈ ప్రపంచం నీ గురించి ఏమంటుందో తెలుసా! భోగలాలసలో తేలియాడుతున్న సోమరి రాకుమారుడు అని అంటుంది"

సముద్రుడు చివ్వుమని తలెత్తాడు. "నిజానికి నీ గురించిన ఈ అభిప్రాయమే ప్రజలలో ఉంది రాకుమారా! నువ్వు రాజ్యాన్ని పరిపాలించేందుకు అనర్హుడవని, ఈ దేశప్రజల విశ్వాసం"

"... ... ..."

"నీకు నీవు, ఆత్మరక్షణ చేసుకోలేని అసమర్థుడవు. ఈ రాజ్యాన్ని నువ్వేం రక్షించగలవు..." హేళనగా నవ్వాడు సారంగుడు. ఒక్కసారిగా పిడిబాకును, సర్రుమని హృదయంలోకి దించినట్టుగా అయింది సముద్రుడికి.

సారంగుడు అంతటితో ఆగలేదు. "నీవు ప్రేమించిన స్త్రీ కోరికను తీర్చేందుకు నీకు స్వయంగా శక్తి లేదు. నిర్వీర్యుడవై నీ తండ్రిని ఆశ్రయించావు. నాగాయకుడ్ని బంధించి ఇమ్మనమని... నీలోని ఈ అసమర్థత తెలిస్తే నిన్ను లావినియా ప్రేమించగలదా? అలాగే మరే స్త్రీ అయినా నీకు హృదయాన్ని అర్పించగలదా... సముద్రా!"

సముద్రుడికి అగ్నిపర్వతం బద్దలయినట్టుగా ఉంది.

"నువ్వు నిజమయిన సుక్షత్రియుడవైతే ఆ నాగాయకుడిని బంధించు. నిన్ను నీవు నిరూపించుకో!"

సముద్రగుప్తుడికి రక్తం సలసలమని కాగటం ప్రారంభమయింది.

సారంగుడు నిష్క్రమించాడు. అలాగే, సారంగుని ఆజ్ఞమేరకు ఆశ్రమవాసులందరూ బయటకు నిష్క్రమించారు. ఆశ్రమ వాటికలో సముద్రగుప్తుడొక్కడూ అలా చీకట్లో ఒంటరిగా మిగిలిపోయాడు ఆలోచించుకుంటూ.

మర్నాడు వేకువఝామున బ్రహ్మ ముహూర్తంలో లేచిన సారంగుడికి, సముద్రగుప్తుడు కనపడిన వైనం విస్మయం కలిగించింది.

సముద్రగుప్తుడు, తన రాజలాంఛనాలను అన్నింటిని విడిచి, భుజంపైన కనీసం అంగవస్త్రం కూడా లేకుండా నేలమీద పడుకొనివున్నాడు. సారంగుడు, సముద్రుడ్ని తట్టి లేపాడు.

సముద్రుడు సుషుప్తిలో లేడు... ఇంకా ఆలోచనలలోనే ఉన్నవాడిలా, వెంటనే ఉలిక్కిపడి సారంగుడివైపు చూస్తూ అన్నాడు...

"గురుదేవా! నేను సన్యసిస్తాను. నాకు దీక్ష ఇవ్వండి"

వ్యక్తిని నఖశిఖపర్యంతం పరిశీలిస్తున్నారు. మాసిపోయిన గడ్డంతో, చిరుగులుపడ్డ వస్త్రాలతో, చెదిరిపోయిన తలవెంట్రుకలతో శుష్కించుకుపోయి, దేహ సంస్కారాలు లోపించిన మనిషి అతడు.

"రాకుమారీ!" కాసేపయ్యాక గొంతుపెగుల్చుకొని లావినియా వైపు చూస్తూ అన్నాడు- అక్కడ వున్న ఆ ముగ్గురు సుందరీమణులలో లావినియా సౌందర్యం అద్వితీయం... అందుకనే ఆ ఆగంతకుడు లావినియాను రాకుమారి అని భావించాడు.



## చదువుకోవడానికే బ్రేక్

'లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్', 'భాయ్' చిత్రాల్లో నటించి విరామం తీసుకున్న జరషా మళ్ళీ టాలీవుడ్‌కు చేరింది.

'టెక్నో-థ్రిల్లర్' ఐతే 2.0లో నటిస్తున్నది. "నా చదువు పూర్తిచేయడానికి టైమ్ తీసుకున్నాను. కాని, కొన్ని ఆఫర్లు వచ్చాయి.

బ్రేక్‌తర్వాత కెమెరా ముందుకు రావడం కష్టంగా లేదు. ఇప్పటికే అనుభవం ఉందికదా. ఏ అవకాశం వచ్చినా ఎగ్జయిట్ అవుతున్నాను. ఎన్ఆర్ఐగా నటిస్తున్నానుకాబట్టి, అమెరికన్ యాసను సరిగ్గా పలకడం కోసం కొంచెం ప్రాక్టీస్ చేయాలి. సైబర్ క్రైమ్‌లో చిక్కుకున్న నలుగురు నిరుద్యోగ ఇంజినీర్ల ఇతివృత్తం" అని తెలిపింది.

ఆ మాటలకు సారంగుడికి తన పాదాల క్రింద నేల చీలినట్లయింది. దిగ్భ్రమతో అవాక్కయి సముద్రుడివైపు అలా చూస్తుండిపోయాడు.

లావినియా ఆ అపూర్వపక్షి జంట వైపు చూస్తోంది. ఆమె కళ్ళలో ప్రశ్నలు! ప్రశ్నార్థకంగా సౌగంధినివైపు చూసింది. సౌగంధిని సుకన్యవైపు చూసింది.

సుకన్య ఆ వ్యక్తిని అడిగింది- "ఈ జంటలోని అద్భుతమేమిటో తెలుసుకోవాలని, మాకు చాలా కుతూహలంగా ఉంది" అని. ముందు ఆ వ్యక్తి మాట్లాడలేదు. తనలోతాను ఏదో గొణుక్కుంటున్నవాడిలా నిల్చుండిపోయాడు.

ఆ ముగ్గురు సుందరాంగులు, ఆ లావినియా చెప్పబోయింది- అయితే సౌగంధిని ఆమెను మాట్లాడవద్దని కన్నులతో సైగచేసింది.

లావినియా కూడా ఏమని ఆలోచించుకుందోగాని నిశ్శబ్దమైపోయింది.

"రాకుమారీ!" మళ్ళీ ఆ ఆగంతకుడు అన్నాడు-

"నిజంగా ఈ పక్షుల జంట అద్భుతమయిన జంట. ఈ సృష్టిలో ఇంతటి అపూర్వ జంట ఎక్కడా లేదు"

ముగ్గురూ నిశ్శబ్దంగా వింటున్నారు. "దాంపత్య ధర్మానికి ఈ జంట అద్భుత ప్రతీక. మానవులలో కాని, దేవతలలో కాని ఇలాంటి అద్భుత జీవి ఈ పక్షి జంట ఒక్కటే రాకుమారీ!"

ఆ ముగ్గురి కళ్ళలో ఆసక్తి. "ఇది మగపక్షి. అది ఆడపక్షి రాకుమారీ...!" చూపుడువేలుతో చూపిస్తూ అన్నాడు- "ఈ రెండింటిలో ఏ ఒక్కటి చనిపోయినా రెండవ పక్షి ఆహార పానీయాలు విసర్జించి, అలాగే కృంగి కృశించి తన ప్రాణాన్ని త్యాగం చేసుకుంటుంది"

ఆ మాటలకు ఆ ముగ్గురూ కొన్ని క్షణాలు నిరుత్తరులయ్యారు. ఆ తరువాత మార్చిమార్చి మొహాలు చూసుకున్నారు. ఈసారి ముగ్గురూ కలసి ఆ ఆగంతకుడివైపు నిశితంగా చూశారు.

ఆ వ్యక్తి అదోలా నవ్వాడు. "బహుశా నేను చెప్పేది మీకు విడ్డూరంగా ఉన్నా, నేను చెప్పినదానిలో లవలేశమయినా అబద్ధం లేదు రాకుమారీ!"

"ఎక్కడిదీ జంట?" అని సౌగంధిని అతనిని అడిగింది.

"ఈ పక్షి జంట భారతదేశంలోని పక్షి జాతులలోది కాదు రాకుమారీ! పశ్చిమ దేశంలో సంచరించే ఈ జంట పేరు జాక్ డాస్. సముద్రయానాలు చేసే నా ప్రియమిత్రుడొకడు విదేశాల

**రాష్ట్రాలను ప్రత్యేక హోదా కలిగినవి, లేనివిగా విభజించటం తగదని, అన్నింటిని ఒకేలా చూడాలని 14వ ఆర్థికసంఘం చెప్పింది.** -ఎన్.కె.సింగ్

*15వ ఆర్థికసంఘం అధ్యక్షుడు*



నుంచి తిరిగివస్తూ ఈ అపూర్వజంటను నాకు బహూకరించాడు. కానీ!"

"..... కానీ" సుకన్య అడిగింది.

"నేను ప్రాణాధికంగా ప్రేమించిన భార్య చనిపోయింది. మేమిద్దరమూ ఎంత అన్యోన్యంగా జీవించామంటే" ఆ తర్వాత అతని గొంతు దగ్గమైంది. మాట్లాడలేకపోయాడు.

ఈసారి ఆ ముగ్గురి హృదయాలు కరుణతో నిండిపోయాయి.

"కానీ నా భార్య ఎలా చనిపోయిందో తెలుసా!" అన్నాడు.

లావినియా కళ్ళు ఆసక్తితో మరింత వెడల్పయ్యాయి.

"నేను సైనికుడిని. యుద్ధంలో నేను మరణించానని ఎవరో అబద్ధపు వార్తను చెప్పారు నా భార్యకు. ఆ మాట వినగానే ఒక్కసారిగా విరుచుకొనిపడి పోయి మరుక్షణంలోనే ప్రాణాన్ని విడిచివేసింది" అని చెప్పాడు.

ఈసారి లావినియా కళ్ళు తడి అయ్యాయి.

'ఇదే నిజమైన సతీసహగమనం. అంతేగానీ, భర్త మరణించగానే అతని చితిలో దూకటం కాదు' లావినియాకు తన తల్లి గుర్తుకువచ్చింది.

తన తల్లి మొగయిరా తన తండ్రి నాగాయకుడి చేతిలో మరణించగానే అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేసుకున్నది. 'కానీ తన తల్లికంటే కూడా ఈ స్త్రీ మూర్తి ఇంకా ఎంతటి అద్భుత స్త్రీ. ఎంతటి ప్రేమమూర్తి.

నిజంగా అలాంటి స్త్రీని పోగొట్టుకున్న ఈ వ్యక్తి ఎంతటి దురదృష్టవంతుడు' కొంతసేపు ఆ నలుగురి మధ్య నిశ్శబ్దం నడిచింది.

"దుఃఖంలో ఉన్న నాకు నామిత్రుడు ఈ అపూర్వ జంటను ప్రసాదించాడు. కానీ ఈ జంట నాకంటే ఎన్నో రెట్లు అద్భుతమయినవి. పవిత్రమయినవి రాకుమారీ...! ఎందుకంటే నా భార్యమరణించి రెండు సంవత్సరాలైనా నేను ఇంకా జీవించే ఉన్నాను. ప్రేమనే మాటలను ఉచ్చరించేందుకు అనర్హుడిని" అన్నాడు.

లావినియా ఆ వ్యక్తివైపు ఆరాధనగా చూసింది.

"రాకుమారీ! అయితే భగవంతుడు నా ప్రార్థనను ఆలకించి, వెన్నెముక పైన నాకు రాచపుండును ప్రసాదించాడు. వైద్యుడు ఇటీవలనే ధృవీకరించాడు రేపోమాపో నేను రాలిపోవడం తథ్యమని"

"... ... ..."

"నా ధర్మపత్నిని త్వరలోనే చేరుకుంటాననే ఆనందం రాకుమారీ!"

ఈసారి లావినియా నిగ్రహించుకోలేకపోయింది. ఆమె కళ్ళలో కన్నీళ్ళు మెదిలాయ్.

ఆ వ్యక్తి అవేమీ గమనించనివాడిలా "ఇంతటి ఈ అపూర్వ జంటను ఎవరికి బహూకరించాలా అని దేశ దేశాలు తిరుగుతున్నాను రాకుమారీ!"

సౌగంధిని కల్పించుకుంది "నువ్వు సరియైన బాటకే వచ్చావు సోదరా...! ఇదిగో ఆమె పేరు లావినియా!

ఆమె తల్లి, తన భర్త మరణించగానే చితిలో దూకి ఆత్మత్యాగం చేసుకొన్న మహాసాధ్వి.

ఆ తల్లిదండ్రుల రక్తాన్ని పంచిపుచ్చుకొన్న ఈ స్త్రీమూర్తికి మించిన అర్హులు నీకు మరెవ్వరు దొరుకుతారు సోదరా!" అని చెప్పింది.

ఆ మాటలకు ఆ అగంతకుడి కళ్ళు మిలమిలమని మెరిశాయ్! లావినియావైపు కళ్ళు ఆర్పకుండా తదేకంగా చూశాడు. ఆ తరువాత కళ్ళు మూసుకుని కాసేపు ఆలోచించుకుని ఏదో నిర్ధారించుకున్నవాడిలా కళ్ళు తెరిచి "నీకు సమస్త శుభాలు జరగాలి రాకుమారీ! ఇక నాకు సెలవు ఇప్పించండి" అన్నాడు.

లావినియా ఏదో చెప్పబోతూంటే మళ్ళీ ఆ అగంతకుడు అన్నాడు "నాకు ఇపుడు సంతృప్తిగా ఉంది. నేను వచ్చిన పని పూర్తయింది రాకుమారీ!"

ఎవరి సమాధానంతో నిమిత్తం లేకుండా ఆ అగంతకుడు ఆ పక్షుల్ని బంధించిన పంజరాన్ని నేలమీద పెట్టి గిర్రున వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

లావినియా ఏదో చెప్పాలని, అతడిని తిరిగి పిలవాలని నోరు విప్పబోతే సౌగంధిని వారించింది.

"లావినియా! అతడ్ని వెళ్ళనివ్వండి. ఈ ప్రపంచంతో ఉన్న అతడి చివరి బంధం, ఈ క్షణమే తెగిపోయింది. అతడి స్వేచ్ఛకు అడ్డురావద్దు"

లావినియా మవునంగా తల తాటించింది.

'భగవంతుడి లీల ఒక్కొక్కసారి ఎంత విచిత్రంగా ఉంటుంది? ఇంతకీ భగవంతుడు కరుణామయుడా లేక నిర్దయుడా?'

పక్షి జంట వెళ్ళిపోతున్న తమ యజమానివైపు చూసి, ఆదోలా అరవటం ప్రారంభించాయ్!

ఆ అరుపులకు సింహద్వారంవరకు వెళ్ళిన ఆ అగంతకుడు, ఒక్కసారి వెనుదిరిగి అలా రెండు క్షణాలు తదేకంగా చూసి, తల తాటించి ఆ తర్వాత గిర్రుమని తిరిగి అక్కడనుంచి నిష్క్రమించాడు. ఇక్కడ రెండు పక్షులు విలవిలలాడుతున్నట్టుగా ఇంకా రోదన చేస్తున్నాయ్!

సౌగంధిని వెళ్ళి ఆ పంజరాన్ని సమీపించి చేత్తో పైకెత్తి గిరగిరమని తిప్పింది. సుకన్యవైపు సైగ చేసింది. సుకన్య ఆ పక్కనే ఉన్న అరటిపండు ముక్కను తెచ్చి సౌగంధిని చేతికి ఇచ్చింది.

సౌగంధిని ఆ ముక్కను పక్షుల నోటికి అందించింది. అయితే ఆ పక్షుల జంట ఆహారాన్ని స్వీకరించలేదు. తమ రోదనను ఆపలేదు.

సౌగంధిని నిస్సహాయంగా లావినియావైపు చూసింది.

ఈసారి లావినియా లేచి పంజరాన్ని సమీపించింది.

ఆశ్చర్యంగా జాక్ డాస్ జంట రోదనను ఆపి లావినియావైపు తదేకంగా చూడటం మొదలుపెట్టాయ్!

లావినియా పంజరం తలుపును తెరవబోతుంది. ఒక్కొమ్మడిగా సౌగంధిని, సుకన్యలిరువురూ ఉలికిపాటుతో, లావినియాను చేరారు.

**ఇంకా ఉంది**



## ఒక్కరోజు చాలు

తాను ఎక్కడ పుట్టి, పెరిగి ఎక్కడ పని చేస్తున్నా దక్షిణాది కథానాయికను అని చెప్పుకోవడానికే ఇష్టపడతానని అంటున్నది రకుల్‌ప్రీత్‌సింగ్. పైగా ఎంతటి కొత్త ప్రదేశానికి వెళ్ళినా అక్కడ ఇమిడిపోవడానికి ఈమెకు ఒకే ఒక్కరోజు చాలట.

"భాష వచ్చినా, రాకపోయినా చుట్టూ వున్నవాళ్ళతో కలసిపోతాను. మొదటిరోజునుంచే భాష నేర్చుకోవడం నా బాధ్యతగా భావిస్తా. పని ఎక్కడైనా పనే. అందులో ఏమాత్రం మార్పు వుండదు. కథల ఎంపిక విధానంలోనే మార్పు వుంటుంది. అందుకు తగిన విధంగా పనిచేసుకుంటూపోతాను" అని చెప్పింది.



**కావేరీ నదీజలాల విషయంలోనే కాదు పలు కీలక అంశాలలో రజనీకాంత్ మౌనంగా వుంటున్నారు. -కమల్‌హాసన్**

ఎమ్.ఎన్.ఎమ్. అధ్యక్షుడు

# హెల్త్ బిట్స్

## » న్యూక్లియర్ మెడిసిన్



చికిత్సలలో తాజా అంశం న్యూక్లియర్ మెడిసిన్ ఔషధం. అవసరం సరిగ్గా ఏ ప్రాంతంలో వుందో ఆ ప్రాంతానికి మాలిక్యులార్ స్థాయిలో మందును చేర్చటంద్వారా రోగాలను నయంచెయ్యటంలో సరికొత్త విప్లవం తెచ్చింది న్యూక్లియర్ మెడిసిన్.

శరీర భాగాలలో వస్తున్న మార్పులను గుర్తించటం, శరీరంలో ఎక్కడైనా అడ్డంకులు ఏర్పడివుంటే అవి ఎక్కడున్నాయో చూడటం చేయగలుగుతుంది.

కీలక అంగాల పనితీరు మొత్తాన్ని పసిగట్టి కళ్ళ ముందు నిలబెడుతుంది. స్కానింగ్‌చేసి ఏ భాగంలో కణజాలస్థాయిలో లోపం వున్నదోకూడా వెలుగులోకి తెస్తుంది. ఎముకలు, మెదడు, గుండె, ఊపిరితిత్తులు వంటి భాగాలన్నీ ముందుగానే స్కాన్‌చెయ్యటంవల్ల ముందు కాలంలో రాబోయే అనారోగ్యాలను ఇప్పుడే అంచనా వేయటం కుదురుతుంది.

మెదడుకు సంబంధించిన పార్కిన్‌సన్, ఆల్జీమర్స్ వంటి జబ్బులు చాలా ముందుగా పసిగట్టగలుగుతారు. రక్తనాళాలు మూసుకుపోవటం ప్రారంభదశలోనే అర్థమవుతుంది ఈ విధానంలో.

పెట్‌స్కాన్‌ద్వారా కణజాలాలలో జరుగుతున్న జీవనక్రియలను గమనించి కంప్యూటర్ ఇమేజ్‌ని సిద్ధంచేస్తుంది.తద్వారా సూక్ష్మస్థాయిలో అంశాలను గమనించటం,వాటిలోని నిర్మాణపరమైన, పనితీరు లోపాలను అర్థంచేసుకోగలుగుతారు.

న్యూక్లియర్ మెడిసిన్ ఖర్చు తక్కువ, లాభం అధికం. బాధారహిత పరీక్ష చేస్తుంది పెట్‌స్కానింగ్. స్కానింగ్ సమయంలో రేడియేషన్‌కి గురికావటం కూడా బహుతక్కువగా వుంటుంది. ◆

## » అమ్మ చదువే లాభం

గృహిణికి చదువువస్తేఆ ఇంటిల్లిపాదీ చదువుకున్నవారవుతారన్నది పాత మాట. ఇప్పుడు గృహిణి ఆరోగ్యమే కుటుంబ ఆరోగ్యం అంటున్నారు. ఆమె ఎంతో ఆరోగ్యంగా ఉంటే మిగిలిన వారందరి ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోగలదు.

కాని దురదృష్టవశాత్తు ఆమె తన ఆరోగ్యంగురించి జాగ్రత్తలు తీసుకోదు. పిల్లల ఆరోగ్యాలను జాగ్రత్తగా చూసుకోలేదు. అందుకే గృహిణి తన వ్యక్తిగత ఆరోగ్యం గురించి తగిన శ్రద్ధ పెట్టాలి.

- వ్యక్తిగత పరిశుభ్రతకు ప్రాధాన్యతనివ్వాలి.
- రోజువారి పనులలో అన్ని రకాల పరిశుభ్రత పద్ధతులు పాటించాలి. చేతులు, పాదాలు తరచుగా కడుక్కోవాలి. తన నెలవారి బహిష్టుకి ఆరోగ్యకరమైన నాప్కిన్స్ వాడాలి.
- అనవసరపు గర్భాలు రాకుండా చూసుకోవాలి. అందుకోసంఆయన కండోమ్ వాడేలాచూడాలి.
- ఎవరి బలవంతంమీదో గర్భస్రావాలు చేయించుకోవద్దు. 40లలో పడినతర్వాత ప్రతిఏటా సంపూర్ణ వైద్య పరీక్షలు చేయించుకోవాలి.
- పోషకపదార్థాలతోకూడిన ఆహారం తీసుకోవాలి.
- అంటురోగాల బారినపడకుండా తన వ్యక్తిగతఆరోగ్యంతోపాటు,తన సంతానాన్ని రక్షించుకోవాలి.
- తగినంత శారీరక వ్యాయామం వుండేలా జీవన విధానం అలవరచుకోవాలి. ◆

## » ఆర్థికమాంద్యం అనారోగ్యం



అనారోగ్యాలకు పరిసరాల వాతావరణం, కలుషిత నీరుతోపాటు ఆర్థిక అంశాలు కారణమవుతున్నాయి. ఒక రుతువులో అంటురోగాలు తీవ్రంగా ప్రబలుతాయి. అదేవిధంగా ఒక సంవత్సరంలో ఆర్థికంగా తీవ్రమైన కుదుపులు వచ్చినపుడు ప్రజలందరిలో అనారోగ్యాలు వస్తాయి.

ఒక దేశంలో సామూహికంగా అనారోగ్యాల గుర్తింపుకు, ఆ దేశం ఆ సమయంలో ఎదుర్కొన్న ఆర్థిక సంక్షోభానికి సంబంధముంటుంది అంటున్నారు. 2008లో ప్రపంచ దేశాలన్నీ ఆర్థికమాంద్యానికి గురయ్యాయి. ఆ సమయంలో హఠాత్తుగా ప్రజలలో అనారోగ్యం పెరిగింది.

ఆర్థిక సమస్యలు చుట్టుముట్టినపుడు సాధారణ ఆరోగ్యవంతుల శరీరం ఊబ శరీరంగా తయారయ్యే ప్రమాదం 4.1 శాతం పెరగ్గా, కొంచెం లావుగా ఉన్న వారి శరీరం మరీ ఊబ శరీరంగా తయారయ్యే ప్రమాదం 2.4 శాతం పెరిగింది.

ఆర్థికమాంద్యం ప్రభావంతో డయాబెటిస్ వచ్చే ప్రమాదం 1.5 శాతం పెరిగింది. ఇక మానసిక సమస్యలు దాదాపుగా 4 శాతం పెరిగింది. నేటివరకు ఆర్థిక వాతావరణానికి, మానవుల అనారోగ్యానికి సంబంధముంటుందన్న ఆలోచన లేదు. ఇకనుండి ఈ కొత్త కోణాన్ని చూడాల్సివుంటుంది. ◆

## » టీనేజ్ ఆనందం



ఎటువంటి బరువు బాధ్యతలు లేనటువంటి వయసు టీనేజ్. హాయిగా పెద్దలు పెట్టింది తిని, హుషారుగా తిరిగి, బాగా చదువుకుంటే చాలు జీవితం ఆనందంగా గడిచిపోతుంది.

ఒకప్పుడు ఎంతో హుషారుగా టీనేజ్‌పిల్లలు గడిపేవారు. కాని ఇప్పుడు వారిలో ఆనందపు ఛాయలు తగ్గి ఒత్తిడి పెరుగుతున్నది. అందులో ఒక కారణం చదువు ఒత్తిడి అని అంగీకరిస్తున్నారు. కాని దానిని మించి టీనేజ్‌వారి ఆనందాన్ని హరించివేస్తున్నది స్మార్ట్‌ఫోన్, కంప్యూటర్, ట్యాబ్ వంటివి.

ఆ ఎలక్ట్రానిక్ వస్తువులకు బాగా అలవాటుపడిన టీనేజ్‌పిల్లలలో ఆనందం బాగా తగ్గిపోతున్నది. పుస్తకాలు, వార్తాపత్రికలు చదవటం, గ్రౌండ్‌లో ఆడుకోవటం, నలుగురితో కలిసి తిరగటం చేసే టీనేజ్ పిల్లలు మాత్రం ఆనందంగా వుంటున్నారు.

రోజుకు ఒక గంటకు మించి పిల్లలకు ఎలక్ట్రానిక్ వస్తువులు ఇవ్వవద్దన్నది సూచన.

# కదిలే బొమ్మల కబుర్లు

Review

## వ్యధార్థ జీవిత యథార్థ దృశ్యం

కరువు... కరువు... కథలు కరువైపోతున్నాయి. కొత్త కథలు పుట్టడంలేదు. పాత కథలే అటు తిప్పి, ఇటు తిప్పి సినిమాలు తీస్తున్నాం.

ఇది సినిమా జనాల మాట. కరువు....కరువు... ప్రపంచంలో మూడువైపులా నీళ్ళే. కానీ తాగడానికి మాత్రం నీళ్ళ కరువే. ఈ నేపథ్యంలో ఎక్కడపడితే అక్కడ బోరులు తవ్వేసి, నీళ్ళు పడని, వట్టిపోయిన బోర్లను అలాగే వదిలేస్తున్నారు.

సమీక్ష ఇలా మొదలుపెడితే ఎంత 'బోర్'గా వుంటుంది. మరి ఇలాంటి సబ్జెక్ట్ మీద సినిమా చేస్తే? అసలు ఇలాంటి విషయం ఆధారంగా సినిమా చేయాలన్న ఆలోచన వాణిజ్యపరంగా సబబేనా?

కానీ దర్శకుడు గోపీనయనార్ మాత్రం అలా ఆలోచించలేదు.నీళ్ళ కరువు నేపథ్యంలో, తవ్వి,నీళ్ళు పడక వదిలేసిన బోరును అలా వదిలేస్తే, అందులో ఓ చిన్నపాప పడిపోతే... అంతే, అదే ఆలోచన.

అదే కథ. అదే సినిమా ప్లాట్. దాంతోనే రెండు గంటలకుపైగా సినిమా తీయడం మాత్రమే కాదు, తీసి జనాలను కూర్చోపెట్టడం అంటే ఏమనుకోవాలి? శహభాష్ అనేగా?

ఇదంతా ఈవారం విడుదలైన 'కర్తవ్యం' సంగతే. ఈ సినిమాను చూడాలి. ఎవరు చూడాలి? మంచి సినిమాలు రావడం లేదు అనేవాళ్ళు చూడాలి. వాస్తవిక దృక్పథంతోకూడా సినిమాలను తెరపై చూడడాన్ని ప్రేమించేవాళ్ళు చూడాలి.

కేవలం ఒక హీరోయిన్ వందలాదిమంది జానియర్ ఆర్టిస్టులు, ఒక్క సంఘటన, దానిపైనే సినిమా. మరి ఉత్కంఠ, మలుపులు వుంటాయా? అంటే వుంటాయి. కానీ వాణిజ్య విలువలు వుండవు. అంటే మాంచి కలర్‌ఫుల్ డ్రెస్‌లు, ఫారిన్ లొకేషన్లో పాటలు, భారీ ఫైట్లు, జోకులు, కితకితలు ఇవేమీ వుండవు.

మరేం వుంటాయి. కష్టం వుంటుంది. కన్నీళ్ళు వుంటాయి.ఓ అధికారి నిజాయితీ వుంటుంది. ప్రజల కష్టాల జీవితం వుంటుంది. అలా అని ఎక్కడా బోర్ కొట్టదు. తరువాత ఏం జరుగుతుందనే ఉత్కంఠ వుంటుంది. కథ సుఖాంతం అయితే బాగుండును అని సినిమాలో తల్లిదండ్రుల మాదిరిగా ప్రేక్షకుడు కూడా కోరుకునే పరిస్థితికి సినిమా తీసుకెళ్తుంది.

ఓ సిన్సియర్ కలెక్టర్ మధువర్షిణి (నయనతార). ఆమె పరిధిలోని ఓ గ్రామంలో విపరీతమైన నీటి ఎద్దడి.అలాంటి టైమ్‌లో, ఆ ఊరిలోని ఓ పాప బోరు బావిలో పడిపోతుంది. తల్లిదండ్రుల బాధ వర్ణనాతీతం. మారుమూల పల్లెటూరు. వాహనాలే రాలేని పరిస్థితి. దానికి దగ్గరలోనే శ్రీహరికోట.

అంతరిక్షంలోకి రాకెట్లు పంపి, భారత్‌కు గర్వకారణమైన ప్రదేశం.కానీ దానికి దగ్గరలో వంద అడుగుల లోతులో ఓ పాపపడిపోతే, బయటకు తీయడానికి ఎటువంటి పరికరాలు లేనటువంటి హీనమైన

### దృఢమైన పాత్రలు

అందాల ఆండ్రియా పరిశ్రమలో తారల స్థానం గురించి హఠాత్తుగా సంచలన వ్యాఖ్యలు గుమ్మరించింది. "సినిమాల్లో డ్యాన్స్ నెంబర్లు, గ్లామర్‌కోసం స్కిన్ షోలు చెయ్యమంటే మాకు ఇష్టం ఉండదు. మాకోసం దృఢమైన మహిళల పాత్రలు రాస్తే బావుంటుంది. పెద్ద హీరోల సరసన నటించినప్పుడు వారి వల్లే హీరోయిన్లకు గుర్తింపు లభిస్తుంది.

ఇప్పుడున్న పెద్ద తారలుకూడా పెద్ద హీరోల సరసన డ్యాన్సులు, గ్లామరస్ పాత్రలు చేసినవాళ్ళే.నేనూ ఇంతకుముందు సినిమాల్లో గ్లామర్ పాత్రలు చేశా. డ్యాన్సులు చేశా.

అయితే ఓ స్టార్ హీరో సరసన డ్యాన్స్‌లు చేశాక వచ్చే అవకాశాలు, ఒక స్ట్రాంగ్ క్యారెక్టర్ చేసిన తర్వాత రాకపోవచ్చు. అందుకే మాకోసం గట్టి పాత్రలు రాయండి. కేవలం గ్లామర్,స్కిన్‌షోలకే పరిమితం చేయవద్దు" అంటూ డేర్‌గా తన అభిప్రాయాలు విప్పి చెప్పింది. ◆






స్థితి. అప్పుడు ఆ కలెక్టర్ పడిన తపన, శ్రమ, చివరకు ఏం జరిగింది. ఆ కలెక్టర్‌కు ప్రభుత్వం ఇచ్చిన బహుమతి ఏమిటి? అన్నది సినిమా.

ఇంత డ్రయ్ సబ్జెక్ట్ తీసుకోవడానికి దర్శకుడుకి ఎంత విజన్ వుండాలి.నిర్మాతకు ఎంత ధైర్యంవుండాలి. తమిళంలో కాబట్టి ఆ ధైర్యం చేశారు. విజయం సాధించారు. తెలుగులోకి డబ్ చేశారు ఇప్పుడు.

సినిమా ప్రథమార్థం ప్రారంభంలో నడక కాస్త నెమ్మదిగా వుంటుంది. ప్రజల నీటి పాట్లు, సామాన్య కుటుంబాల్లో అనుబంధాలు ఇవన్నీ నేపథ్యంగా, అసలు విషయానికి పునాదులుగా ఎస్టాబ్లిష్ చేసేందుకు దర్శకుడు కాస్త టైమ్ తీసుకుంటాడు.

సినిమాగురించి ఏమాత్రం తెలియకుండా వెళ్ళిన వాళ్ళకు ఇది కాస్త సోదిలా, తమిళ ఫ్లేవర్‌లా అనిపిస్తుంది. కానీ నేపథ్య సంగీతం, సినిమాటోగ్రఫీ ఆ ఆలోచనను కాస్త దూరం చేసి, సినిమాను చూడమని ముందుకు తోస్తాయి.

తీరా బోరు బావిలో పాప పడిపోయిన తరువాత ప్రారంభమవుతుంది. ప్రేక్షకుడి కళ్ళను తెరకు కట్టేయడం. పెయిన్‌ను భరించలేనివారు, ఇలాంటి రియలిస్టిక్ సినిమాలు ఎలాగూ చూడలేరు.

జీవితంలో కష్టం ఇలాగే వుంటుంది, దాన్ని తెరపై యథార్థంగా, నిజాయితీగా చూపిస్తున్నాడు అని ప్రేమించేవాళ్ళుమాత్రం ఇక మరో ఆలోచన లేకుండా సినిమాలో లీనమైపోతారు.అక్కడినుంచి చివరివరకు ఒకటే స్థాయిలో సాగుతుంది సినిమా.

ఈ మధ్యలో ప్రభుత్వాలు, రాజకీయ వ్యవస్థ, అధికారుల అలసత్వం, అసహాయత, ప్రజలకు ఏం చేయాలో అన్నది తప్ప మిగిలినవి ఆలోచించే విధానాలు, ఇలా చాలా విషయాలను సున్నితంగా టచ్ చేస్తాడు దర్శకుడు.

రాకెట్ అంతరిక్షంలోకి వదలగలం కానీ, వంద అడుగుల లోతులోంచి ఓ పాపను బయటకు తీయలేం, ఇదీ ఈ దేశ శాస్త్రపరిజ్ఞానం, ఇదీ ఈ దేశ సాంకేతిక సంపద అన్న రేంజ్‌లో దర్శకుడు నిలదీస్తాడు. కలెక్టర్‌గా నయనతార కళ్ళతోనే నటించేసింది.

ఎమోషన్, అసహాయతతప్ప మరో ఫీలింగ్‌లేని పాత్రను సునాయాసంగా చేసి, రక్తికట్టించింది.

దాదాపు వందలాదిమంది జూనియర్ ఆర్టిస్టులు, అత్యంత సహజమైన నటన ప్రదర్శించి, ఇంత మందిని ఎలా మేనేజ్‌చేసి, సీన్‌ను అత్యంత సహజంగా తీసుకురాగలిగాడు దర్శకుడు అని అబ్బురపడడం ప్రేక్షకుడి వంతవుతుంది.

జిబ్రాన్ సంగీతం సినిమాకు ఆయువుపట్టు అవుతుంది. సన్నివేశం ఓ పక్క ప్రేక్షకుడిని నిలదీస్తుంటే, సంగీతం మరోపక్క మెలిపెట్టేస్తుంది. నిజానికి ఇలాంటి సినిమాలు అందరికీ నచ్చవు. అది వాస్తవం. వారాంతంలో, ఏదో సరదాకోసం ఓ సినిమా చూసి, పాప్‌కార్న్ తినేసి, కోక్ తాగేసి వద్దాం అనుకునేవాళ్ళకు అస్సలు నచ్చదు.

అలా కాకుండా సినిమాలో అంతకుమించి ఏదో కావాలి, తెరపై జీవితాలు చూడాలి, భలే తీశాడ్రా అన్న భావన కలగాలి అనుకునే కొద్దిమంది ప్రేక్షకులు వుంటారు. వీళ్ళది ఓ తరహా. వాళ్ళకు ఖచ్చితంగా నచ్చుతుంది. అందువల్ల ప్రేక్షకులు తమ అభిరుచి ఏమిటో డిసైడ్ చేసుకుని, ఈ సినిమాకు వెళ్ళాలి. ఈ విషయంతో, ఈ సమస్యతో, ఈ టేకింగ్‌తో మమేకం అవ్వగలిగినవాళ్ళు ఏం తీశాడ్రా అనుకుంటూ బయటకు వస్తారు. కనెక్ట్ కానివాళ్ళు, ఇదేం సినిమారా బాబూ... అనుకుంటూ నిట్టూరుస్తారు. ఛాయిస్ ఈజ్ యువర్స్.

**ప్లస్‌పాయింట్స్...**
దర్శకత్వం
సంగీతం
ఛాయాగ్రహణం

**మైనస్‌పాయింట్స్...**
కమర్షియల్ ఎలిమెంట్స్

**పంచ్‌లైన్**
ఈ సినిమా కొందరికి మాత్రమే ◆

## మళ్ళీ భయపెడుతుంది

'గీతాంజలి' సినిమాలో దెయ్యం పాత్రలో భయపెట్టిన అంజలి మరోమారు ప్రేక్షకుల్ని భయపెట్టేందుకు సిద్ధం అయింది. 'గీతాంజలి' చిత్రానికి సీక్వెల్‌ను నిర్మాతలు ప్లాన్ చేశారు.

దీనిలోనూ టైటిల్ పాత్ర అంజలిదే. అరకొర అవకాశాలతో ఆగి ఆగి సాగుతున్న అంజలి తనకు ఇంకో సారి టైటిల్ పాత్ర దక్కడంతో తెగ ఆనందపడిపోతున్నది. మరోమారు ప్రేక్షకుల్ని భయపెట్టి మెప్పించే అవకాశం వచ్చినందుకు ఆనందంగా ఉందంటూ పదే పదే ఈ సినిమా కబుర్లు చెప్తున్నది. ◆

## ఎన్నో మార్పులు



సినిమాల్లోకివచ్చాక జీవితం పూర్తిగా మారిపోయిందంటున్నది మెరుపుల మెహరీన్. చిత్ర పరిశ్రమలోకి వచ్చాక మరింత ఫోకస్‌తో, మరింత క్రమశిక్షణగా మారాను. నా సినీ ప్రయాణం నా గురించి నేను జాగ్రత్తలు తీసుకోవడాన్ని నేర్పింది.

సమయం విలువ తెలుసుకున్నాను. నా జీవితంలో అనేక అనుకూల మార్పులు సంభవించాయి. ఈ మార్పులన్నింటికీ కారణం అయిన చిత్ర పరిశ్రమకు కృతజ్ఞురాలినై వుంటాను. ప్రేక్షకులు నన్ను సాదరంగా ఆహ్వానించారు. నన్ను ఆమోదించారు. ఇవన్నీ పనిపట్ల నా బాధ్యతను మరింతగా పెంచాయి" అంటూ ఉత్సాహాలు ఒలికించింది. ◆

Review

# పార్టీవుంది... సందడే లేదు




రెడీమేడ్‌కు, టైలర్‌మేడ్‌కు తేడా వుంటుంది. రెడీమేడ్ షర్ట్ నచ్చినా, మనకు ఫిట్టవ్వాలికూడా.టైలర్‌మేడ్ ఐతే ఆ వ్యవహారం వేరు. రీమేక్‌లు అంటే రెడీమేడ్ వ్యవహారమే. వేరే భాషల్లో హిట్టైన సినిమాను హిట్ సినిమాగా మాత్రమే చూసి కొనుక్కువచ్చేస్తారు మన సినిమా జనాలు.

అవికాస్తా మన దగ్గర వర్కవుటవుతాయో, కాదో చూసుకోరు.ఏదోవిధంగా అడ్జస్ట్‌చేయాలని చూస్తారు. అదేమో కాస్త లూజుగా,కాస్త బిగుతుగారకరకాలుగా వుంటుంది.దాంతో చూసేవాళ్ళకు ఏదోలావుంటుంది. ఇలాంటి వ్యవహారమే అచ్చంగా ఈ వారం విడుదలైన 'కిరాక్ పార్టీ'ది. విభిన్నమైన సినిమాలు చేస్తూ వస్తున్న నిఖిల్‌హీరోగా నటించిన ఈసినిమాకథంతా ఓ ఇంజనీరింగ్ కాలేజీనేపథ్యంలో సాగుతుంది.

సీనియర్లు... జూనియర్లు, గొడవలు, అమ్మాయిలు, సరదాలు. ఇంతలో అనుకోని సంఘటన. కట్‌చేస్తే జూనియర్లు సీనియర్లు కావడం, అక్కడనుంచి కథ మరో మలుపు తిరగడం, చివరకు నాలుగేళ్ళ ఇంజనీరింగ్ పూర్తిచేసుకుని కుర్రాళ్ళు బతుకు దారి వెదుక్కుంటూ బయటకు నడవడం. ఇదీ సినిమా.

కన్నడంలో పెద్ద హిట్ అయిన 'కిర్రిక్ పార్టీ'ని 'కిరాక్ పార్టీ' అంటూ తెలుగులోకి తీసుకువచ్చారు. కొత్త దర్శకుడు శరణ్ పనిచేసిన ఈ సినిమాకు ఇద్దరు పెద్ద దర్శకులు చందు మొండేటి (సంభాషణలు), సుధీర్ వర్మ (స్క్రీన్‌ప్లే) సాయంపట్టారు.

కానీ సినిమా చూస్తే ఇద్దరు పెద్ద డైరెక్టర్ల చేయి సాయంచేశారా? లేక చేయివేసి కిందకు నొక్కేశారా అన్న అనుమానం కలుగుతుంది.

ఎందుకంటే సినిమాకు కీలకమైన మైనస్‌లు రెండు. ఒకటి స్క్రీన్‌ప్లే, రెండవది సంభాషణలు. ఒక్క హిట్,రెండు ఫ్లాపుల రికార్డు వున్న సుధీర్ వర్మ ఈ సినిమాకు ఓ అతుకులబొంత స్క్రీన్‌ప్లే అందించారు. ఒకపక్క మాతృకను అనుసరిస్తూ, మరోపక్క ఆ మధ్య విడుదలైన 'అర్జున్‌రెడ్డి'ని గుర్తుచేసుకుంటూ ఇలా రకరకాల పోకడలు పోయారు.

'అర్జున్‌రెడ్డి' సినిమాకు ఆ స్క్రీన్‌ప్లే నప్పిందంటే అక్కడ హీరో క్యారెక్టర్ అలా వుంటుంది. ఓ వరుస వాడి లేకుండా.పైగా ఆ సినిమా ఓ బయోపిక్‌లాసాగుతుంది. కానీ ఇక్కడ అలాకాదు.పైగా హీరోను రెండు షేడ్స్‌లో చూపించాలని డిసైడై, రెండో షేడ్‌కోసం 'అర్జున్‌రెడ్డి'ని అరువుతెచ్చుకున్నట్టైంది. ఇలా సుధీర్ వర్మ స్క్రీన్‌ప్లే విఫలమైతే, మరోపక్క చందుమొండేటి సంభాషణలు అంతకన్నా నిస్సారంగా వున్నాయి.

ఒక్క సంభాషణలో చమక్కులేదు.హుషారులేదు. కాలేజీ కుర్రాళ్ళ సంభాషణల్లో వుండే పంచ్, పదును ఎక్కడా కనిపించలేదు. ఎప్పుడో చందు మొండేటి కాలేజీలో చదివినకాలంలో మాదిరిగా వుంటుంది వ్యవహారం. ఇక కొత్త దర్శకుడు శరణ్‌కు సన్నివేశాలను పండించడంలో స్టామినా సరిపోలేదు.

దీనివల్ల సన్నివేశాలు తేలిపోయాయి. ఎక్కడా ఏ సన్నివేశంలోనూ ఫీల్ అన్నది కనిపించలేదు.ఇలా కథనం సరిగ్గా అల్లుకోక, సంభాషణలు పండక,సన్నివేశాలు సరిగ్గా రాకపోతే సినిమా ఏముంటుంది?

'కిరాక్ పార్టీ' తొలిసగం ఓ సగటు సినిమా మాదిరిగానే ప్రారంభమవుతుంది. కాలేజీ కుర్రాళ్ళు, అల్లరి, బీర్లు, సిగరెట్లతో సందడిగానే వుంటుంది. సీన్ తరువాత సీన్ వస్తుంటాయికానీ ఎక్కడా కొత్తదనం కనిపించదు. అనిపించదు.అందువల్ల ఏదో వెలితిపట్టి పీడిస్తూ వుంటుంది. ఇలాంటి సినిమా ఇంటర్వెల్ దగ్గర మాంచి మలుపు తిరుగుతుంది. నిజానికి ఆ మలుపు ఇలాంటిది అలాంటిది కాదు.

కానీ దర్శకుడిస్టామినా అస్సలు సరిపోక, అదేమాత్రం స్పందన కల్గించదు.చాలా రొటీన్‌గా, చప్పగా వెళ్ళిపోతుంది. ద్వితీయార్థం ప్రారంభం బాగానేవుంటుంది కానీ,

కాలేజీ ఎన్నికలు,ఇతరత్రా వ్యవహారాలు మరీబోర్‌గా సాగుతాయి.వున్నట్లుండి సినిమా అర్జున్‌రెడ్డి టర్న్ తీసుకుంటుంది.అదెందుకో,అదంతా ఏమిటో అర్థంకాదు. మళ్ళీ క్లైమాక్స్‌లో ఫేర్‌వెల్ పార్టీ కాస్త ఆకట్టుకుంటుంది.ఈ మధ్యలో ఇద్దరు హీరోయిన్లు. వాళ్ళ ఎపిసోడ్లు కూడా ఏమాత్రం ఆకట్టుకోవు. పైగా జోనర్‌కు సూట్‌కాని సెక్స్‌వర్కర్ వ్యవహారంఒకటి. ఇలా ఒకటేమిటి చాలా సమస్యలున్నాయి పార్టీకి.

ఇలాంటి సినిమాలో నిఖిల్ రెండు షేడ్స్ ప్రదర్శించాడు.రెండూ బాగానే చేశాడు.ఒక షేడ్‌లో కన్నడ హీరోను నటనలో యాజ్‌ఇట్ ఈజ్ ఫాలో అయిపోయాడు. రెండో షేడ్‌లో ఎందర్నో గుర్తుకుతెచ్చాడు. 'ప్రేమమ్' నుంచి 'అర్జున్‌రెడ్డి' వరకు. ఐతే లుక్స్‌లో జాగ్రత్త తీసుకున్నాడు.

చూడ్డానికి బాగున్నాడు. మిగిలిన గ్యాంగ్ అంతా ఓ.కె. ఇద్దరు కొత్త హీరోయిన్లు సిమ్రన్ పరీంజా, సంయుక్త హెగ్డె, చూడ్డానికి ఓ.కె. కానీ చేసిందిపెద్దగా ఏమీ లేదు. టెక్నికల్‌గా సినిమా బాగుంది.

కన్నడ సంగీతందర్శకుడు అజనీష్ లోక్‌నాథ్‌వర్క్ బాగుంది.పాటలు బాగున్నాయి.అద్వైతగురుమూర్తి సినిమాటోగ్రఫీ బాగానేవుంది. కుర్రకారు సినిమాలు అంటే అల్టిమేట్‌గా వుంటున్న రోజుల్లో, ఎప్పుడో చూసి వదిలేసిన స్టయిల్‌లో తీయడం, అవుట్‌డేట్ సీన్లు, డైలాగులు, స్క్రీన్‌ప్లే అందించడంతో 'కిరాక్ పార్టీ' అభాసుపాలయిపోయింది.

ప్లస్‌పాయింట్స్...
యూత్‌ఫుల్ జోనర్,
పాటలు, కలర్‌ఫుల్ చిత్రీకరణ

మైనస్‌పాయింట్స్...
స్క్రీన్‌ప్లే, డైరెక్షన్

పంచ్‌లైన్
చిర్రాకు పార్టీ ◆



## మరో ఛాన్స్

ఎందుకో, ఏంటోకాని పాపం లావణ్య త్రిపాఠి ఇంతకుముందు చేసిన సినిమాలన్నీ బాక్సాఫీసు వద్ద బోల్తాపడిపోయాయి. ఇటువంటి దశలో ఈ అమ్మాయికి ఓ పెద్ద అవకాశం వచ్చింది.

రవితేజ సరసన నటించే ఛాన్స్ దక్కించుకుని, కాస్తంత నవ్వులు పులుముకుంటున్నది. ఇప్పటిదాకా రవితేజ సరసన నటించని తార కోసం దర్శకుడు ట్రై చేశాడట. నిజానికి, లావణ్య 'టచ్‌చేసి చూడు'లో రవితేజ సరసన నటించాల్సివుంది. కాని అప్పటి ప్రణాళికలు వర్కవుట్ కాలేదు. దీంతో ఈసారి లావణ్యకు ఓటేశారు. ఈ సినిమాతో అయినా లావణ్య దశ మారుతుందేమో చూడాలి. ◆

## ఎలా ఆడుతున్నాయి?

- బాక్సాఫీస్ ఇంకా తేరుకోలేదు.
- పరీక్షలు, బంద్, సినిమాలు లేకపోవడంతో డల్‌గా వుంది. ఈ వారమే సినిమాల విడుదల మళ్ళీ ప్రారంభమైంది.
- విడుదల ప్లాన్ చేసుకున్న సినిమాలతో పాటు మూలన పడిన సినిమాలు అనేకానేకం ఈ వారం విడుదలయ్యాయి. కానీ చాలావరకు థియేటర్ రెంట్లు కూడా తెచ్చుకోవడం కష్టమే.
- కిర్రాక్ పార్టీకి ఓపెనింగ్స్ బాగున్నాయి. ఆ తరువాత బి, సి సెంటర్లలో 'దండుపాళ్యం'కు కాస్త మంచి ఓపెనింగ్సే వచ్చాయి. మరి వీకెండ్ తరువాత ఎలా వుంటాయో చూడాలి.

**సి**నీరంగంలో దీనగాథలనేకం. ఒక వెలుగు వెలిగి, చివరికి అనాథగా బయటకు తీసుకు వెళ్ళబడిన తారలు దక్షిణాదికే కాదు, ఉత్తరాదిన వున్నారు. అటువంటివారిలో ఒకనాటి అందాలతార నళినీ జయంత్ ఒకరు. నళినీ జయంత్‌ని ఈ తరం వారికి పరిచయం చెయ్యటం కూడా కష్టమే.

1940, 1950ల్లో అశోక్‌కుమార్ సరసన హీరోయిన్‌గా ఎన్నో హిట్ సినిమాలు అందించిన తార అని చెప్పాలా! ఆ తర్వాతి తరం హీరోయిన్‌లు అయిన తనూజ, నూతన్‌లకు పిన్ని వరుస అవుతుందని చెప్పాలా! బాలీవుడ్ కేంద్రమైన బొంబాయి నగరంలో 1926లో పుట్టింది నళిని జయంత్.

15వ ఏటనే తొలి సినిమాలో నటించింది. 1941లో మెహబూబ్‌ఖాన్ తీసిన సినిమా 'బహెన్'. అది సోదరిని ప్రేమించే అన్న కథ. సమాజం అటువంటి కథాంశాన్ని అంగీకరించగలదని ఆ దర్శకుడు ఎలా భావించాడో తెలియదు. ఫలితం ఆ సినిమా ఆడలేదు.

కాని అమ్మాయి పాత్ర వేసిన కొత్త పిల్ల ఎవరో బాగున్నది అనుకున్నారు. కాని మరల హీరోయిన్ అవకాశంకోసం ఏడు సంవత్సరాలు ఎదురుచూడాల్సి వచ్చింది. అప్పటివరకు చిన్న చిన్న పాత్రలు ధరించినా 1948లో 'అనోఖాప్యార్' సినిమాతో సినిమాలో తన స్థానం నిలబెట్టుకుంది.



నళిని జయంత్
(1926-2010)

# చివరి రోజుల్లో...

**మూడురోజులు వరసగా ఆ ఇంట్లో లైటు వెలగకపోవటం, ఆమె పెంపుడుకుక్కలు వీధుల్లోకి వచ్చి ఆహారంకోసం వెతుకులాడటం చూసిన ఇరుగుపొరుగులు ఆశ్చర్యపోయారు. విచారిస్తే నళిని జయంత్ మరణించిందన్నారట. ఆ నోటా ఈ నోటా సినీరంగంవారికి తెలిస్తే ఆమె ఇంకా ఇంతకాలం బతికివుందా! ఎక్కడ వుంది! అని అడిగినవారున్నారు.**

1950లంతా ఆమెదే. అశోక్‌కుమార్ సరసన 'సమాధి', 'సంగ్రామ్', 'జైపూరి', 'కఫియ' వంటి సినిమాలు అనేకం చేసింది. ప్రతి సంవత్సరం ఒక హిట్ అందించిన హీరోయిన్ అయింది. రాజ్‌ఖోస్లా 1958లో తీసిన 'కాలాపానీ' ఆమెకు సక్సెస్ అందించింది.

ఫిల్మ్‌ఫేర్ సపోర్టింగ్ నటి అవార్డు తెచ్చిపెట్టింది. ఆ తర్వాత ఆమెకు అంతగా సక్సెస్‌లు లేవు.

1965లో బొంబాయి రేస్‌కోర్స్ సినిమాతో ఆమె రిటైర్ అయింది. అప్పటికి ఆమెకు 39 ఏళ్ళు. ఆ వయసువరకు హీరోయిన్‌గా నిలవటం ఏ భాష తారకైనా కష్టమయిన విషయమే. 1965 తర్వాత నళిని జయంత్ పూర్తిగా కనుమరుగైంది.

1940ల్లోనే ఆమె వివాహం చేసుకుంది. నాటి దర్శకుడు, వీరేంద్ర దేశాయ్‌ని ప్రేమించి పెళ్ళిచేసుకుంది. కాని ఆ సంసారం ఆనందకరంగా సాగలేదు. భర్త నుండి విడిపోయి, కొంతకాలం ఒంటరిగా వున్న నళిని జయంత్ ఆ తర్వాత ప్రభుదయాళ్ అనే తోటి నటుడిని వివాహమాడింది. వారిద్దరూ పలు సినిమాలలో కలిసి నటించటంవల్ల దగ్గరయ్యారు.

ముంబయిలోని చెంబూర్ ప్రాంతంలోని యూనియన్ పార్క్‌లో నళిని జయంత్‌కి ఒక బంగళా వుండేది. హీరోయిన్‌గా విజయం సాధించిన 1950ల్లోనే ఆ బంగళా కొనుగోలు చేసింది. దాదాపు 60 సంవత్సరాలపాటు అక్కడే నివాసం.

దాదాపు 15 ఏళ్ళు సినీరంగానికి దూరంగా వున్న నళిని జయంత్‌ని ఇరుగుపొరుగువారు సినీనటిగా గుర్తించలేని పరిస్థితి.

**ఎ**వరో ఒకనాడు బాగా బతికినావిడ అనుకునే వారట. అటువంటిది 1980లో వచ్చిన 'బందీష్' సినిమాలో ఆమె కనిపించేసరికి ఆమె సినీతార అని ఆ ప్రాంతంవారికి తెలిసింది. 1983లో తిరిగి 'నాస్తిక్' సినిమాలో కనిపించింది అంతే.

ఆ తర్వాత ఆమె బంగళా వదిలిరావటం దాదాపుగా ఆగిపోయింది. భర్త, ఆమెమాత్రం ఆ బంగళాలో వుండేవారు. బంధువులు బొంబాయిలోనే వున్నప్పటికి వచ్చిపోయేవారెవరూ లేరు. దాదాపుగా ఎవరూ పట్టించుకోని, లేదా ఎవరిని కలవటానికి ఇష్టపడని జీవితం గడిపింది నళిని జయంత్. చివరి నాలుగైదు సంవత్సరాలు మరీ ఒంటరిది. భర్త పోయినతర్వాత ఆమె ఇల్లువదిలి బైటకు రావటం పూర్తిగా మానేసింది.

ఎవరైనా పలకరించేందుకు వెళ్ళినా గుమ్మందాటి వారిని లోపలికి రానిచ్చేది కాదు. ముక్తసరిగా సమాధానం చెప్పి మీరు వెళ్ళిపోతే తలుపు వేసుకుంటా అనే ధోరణిలో వ్యవహరించేది. క్రమంగా ఆమెగురించి ఎవరూ పట్టించుకోలేదు.

సినీరంగం ఆమెను ఎప్పుడో మరచిపోయింది. సినీరంగంలో ఒక వెలుగు వెలుగుతున్నప్పుడు లేదా విశేషంగా సంపద చేరినప్పుడు బంధువులను దూరంగా వుంచటం అనే పొరపాటు నళిని జయంత్ కూడా చేసిందేమో తెలియదు.

బంధువులు, మిత్రులు ఎవరూ తోడులేని ఆ లోకంలో నళినికి పెంపుడుకుక్కలే తోడు. వాటికి ఏవో పెడుతూ, వాటిని నిమురుతూ కాలక్షేపం చేసేది. ఒక పనిమనిషి మాత్రమే లోపలికి వెళ్ళి, సహాయం చేసేది. వంట చేసిపెట్టేది. కాని తనగురించి బయట ఎవరికి చెప్పినా సహించదని తెలిసి ఆ పనమ్మాయి కూడా తన పనేదో తాను చూసుకునేది.

మరణానికి నాలుగైదు రోజుల ముందెప్పుడు ఇంటిలో నడుస్తుండగా జారిపడింది. చీలమండ దగ్గర బెణికింది. కాలు కిందపెట్టలేని పరిస్థితి.

ఒక కర్ర పట్టుకుని, కాలితో కుంటుకుంటూ ఆ బంగళాలో ఒంటరిగా తిరుగుతుంటే పొరుగువారు చూసి, సహాయం అవసరమా అని అడిగేందుకు వెళితే అక్కరలేదని చెప్పి పంపింది.

**ఒ**కనాటి అందాల తార, ఇప్పుడు 80ల్లో పడిన వృద్ధురాలు. చర్మం సాగిపోయి, ముడుతలు పడి, కాలు కుంటాల్సిన పరిస్థితికి రావటం ఆమెకు మానసికంగా ఇబ్బంది. తాను ఎంతో గ్లామరస్‌గా బతికిన రోజుల కలలు కంటూవుండేది.

ఎవరితో మాటలు కలపాలన్న కోరిక లేదు. ఎందుకు బతుకుతున్నానో తెలియదనే ప్రశ్న. ఎంత కాలమైందో ఎవరితోనైనా మాట్లాడి.

హఠాత్తుగా ఆమె 2010 డిశంబర్ 20న మరణించిన విషయం కూడా ఎవరికీ తెలియదు. ఎవరో ఒక యువకుడు అంబులెన్స్ తీసుకువచ్చి అందులో ఆమెను తీసుకువెళ్ళిపోవటం పొరుగువారు చూశారు. అనారోగ్యంతో ఆసుపత్రికి తీసుకువెళ్ళాడనుకున్నారు కాని ఆమె మరణించిందనుకోలేదు.

మూడురోజులు వరసగా ఆ ఇంట్లో లైటు వెలగకపోవటం, ఆమె పెంపుడు కుక్కలు వీధుల్లోకి వచ్చి ఆహారంకోసం వెతుకులాడటం చూసిన ఇరుగుపొరుగులు ఆశ్చర్యపోయారు. విచారిస్తే నళిని జయంత్ మరణించిందన్నారట. ఆ నోటా ఈ నోటా సినీరంగం వారికి తెలిస్తే ఆమె ఇంకా ఇంత కాలం బతికివుందా! ఎక్కడ వుంది! అని అడిగినవారున్నారు.

నళినీ జయంత్ మరణం వెనుక ఏదో ఒక అంతు తెలియని విషయం దాగివుందన్నది మీడియాలో వచ్చిన వార్త. కాని అప్పటికే నళిని అంత్యక్రియలు ఒక అనామకురాలికి జరిగినట్టుగా జరిగాయి.

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

* ఎస్.శంకరయ్య, కోసిగి

స్వాతి సపరివార పత్రికకు '72' పేజీలు ఉండటానికి ఓ కారణం?

(ఆంగ్ల అక్షరాలు)

S W A T I

(అంకెలు)

19 + 23 + 1 + 20 + 9 = 72 కాబట్టి.

* ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

విడ్డూరం అంటే?

ద్రవపదార్థం కాని 'పొగ'ను 'తాగరాదు' అనడం.

> ఉత్తమ ప్రశ్నకు ₹ 500,
> ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి

* ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

'చిత్ర'హింసలు పెట్టేదెవరు?

అట్టర్‌ఫ్లాప్ అయిన 'చిత్రం'.

* ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

చదువు రాకున్నా, డిగ్రీలు చదివేదెవరు?

థర్మామీటర్.

* ఆర్.ప్రశాంతి, విజయనగరం

రి'లీఫ్'నిచ్చేవి?

చెట్లు.

* డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

నేటి హీరోయిన్?

అమ్మ చాటుదే అయినా అన్నీ చూపించే ధైర్యమున్నది.

* చప్ప నాగేశ్వరరావు, కాగాం

తలకు మించి అప్పులు తీసుకుంటే?

'లోన్‌లీ'గా బతకాల్సివుంటుంది.

* బి.మాన్‌సింగ్ నాయక్, కారంపూడి

పసిపిల్లలు 'గుక్క'పెట్టి ఎందుకు ఏడుస్తారు?

గుక్కెడు పాలకోసం.

## ఈ కార్టూన్ మీదే




# B హ్యాపీ

ఒకడు బార్‌లో కూర్చుని గ్లాస్‌లో మందు పోసుకుని తీక్షణంగా దానివైపే చూస్తున్నాడు.

అది గమనించిన మరో తాగుబోతు ఆ గ్లాస్ అందుకుని గబుక్కున తాగి ఇలా తాగాలికాని ఆ ఆలోచన ఏమిటి అని విసుక్కున్నాడు.

ఏడిచినట్టుంది, జీవితంమీద విరక్తి కలిగి ఎలుకల మందు కలిపా ఆ గ్లాస్‌లో... అందుకు ఆలోచన అనేసరికి రెండో తాగుబోతు ధబేలున పడిపోయాడు.



"మన అమ్మాయి పెళ్ళి సంగతేం చేశారు" అని అడిగింది భార్య.

అగు... మంచి సంబంధం దొరకాలి కదా. వస్తున్నవన్నీ పనికి మాలిన కుర్రాళ్ళ సంబంధాలే.

అలాగని ఊరుకుంటామా! మా నాన్న మాత్రం ఊరుకున్నాడా... ఏదో ఒకటని చెయ్యాలి గాని... విసుక్కుంది భార్య.

తన ప్రేయసిని బైక్‌మీద ఊరికి దూరంగా నిర్జన ప్రదేశందాకా తీసుకువెళ్ళాడు చంద్రం.

బండి ఆగిపోయింది. బండిలో పెట్రోలు అయిపోయింది. ఇక ఈ రాత్రి ఇక్కడే ఎలాగో ఒకలా గడపాలి మనం అన్నాడు కొంటెగా.

"నీ సంగతి నాకు తెలుసు..." అంటూ బ్యాగ్‌లో నుండి ఒక బాటిల్ తీసింది చంద్రిక.

"ఏమిటది! మంచినీళ్ళా..."

"కాదు పెట్రోల్... పద, ఇది పోసి బండిని సిటీకి నడుపు" అనేసరికి చంద్రం కళ్ళు బైర్లుకమ్మాయి.

నీ జుట్టు బాగుందిరా! ఇది మీ అమ్మనుండి వచ్చిందా! నాన్ననుండి వచ్చిందా! అని అడిగాడు టీచర్ నాలుగో తరగతి చదివే వెంకట్‌ని.

మా నాన్న నుండే అనుకుంటా టీచర్. ఆయన తలమీద 'ఒక్క వెంట్రుకా' లేదుకదా.

ఫ్యాక్టరీ యజమాని హఠాత్తుగా రావటం చూసిన ప్యూన్ హడావుడిగా మేనేజర్ గదిలోకి వెళ్ళబోతుంటే వాడిని చెయ్యిపట్టి ఆపి నీ డ్యూటీ ఏమిటి! అనడిగాడు.

"ఓనర్... గుంటనక్కగాడు వచ్చినపుడు గబగబా వచ్చి తనను లేపటమే నా డ్యూటీ అని మేనేజర్‌గారు చెప్పారండీ, అందుకే పరిగెట్టబోతున్నాను" అన్నాడు ప్యూన్.

"పెళ్ళి తరువాత మగాళ్ళు శక్తివంతులు అవుతారు అంటే ఏమిటో అనుకున్నానురా" అని వాపోయాడు నాగేశ్వర్.

ఏమైందిరా అంటే...

అప్పుడు రెండు మూడు కిలోల సరుకులు మోసే నేను ఇప్పుడు పాతిక కిలోల సంచులు మోస్తున్నా. అప్పుడు బండిమీద ఒక్కడినే వెళ్ళిన నేనిప్పుడు 70 కిలోల భార్యను ఎక్కించుకుని తీసుకెళ్తున్నా.

మనిషికి ఎదురయ్యే కష్టాలే ఆ తర్వాత అతను పొందే విజయాన్ని ఆనందించే స్థాయికి తీసుకెళతాయి.